"స్వదత
సంస్కృతమ్"

విశ్వజనీనం

# సంస్కృత వాణి


గ్రంథకర్త

సాహిత్య విద్యా ప్రవీణ

డా. సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులు,

ఎం.ఏ.పి.హెచ్.డి.

(సంస్కృతోపన్యాసకులు)





రోహిణి పబ్లికేషన్స్

రాజమండ్రి - 1

"వ్వదత
థిరిస్కృతమ్"



# విశ్వజనీనం
# సంస్కృతవాణి




గ్రంథకర్త
సాహిత్యవిద్యాప్రవీణ
డా॥ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులు,
ఎం. ఏ., పి.హెచ్.డి.,
రీడర్ - సంస్కృతవిభాగం
ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠం, కొవ్వూరు.





రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి- I.

# "స్వదత సంస్కృతమ్"
## విశ్వజనీనం సంస్కృతవాణి

- డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు,
ఎం.ఏ., పి.హెచ్.డి.,


ప్రచురణ హక్కులు :
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్ రోడ్, రాజమండ్రి. 1

ప్రథమ ముద్రణ :
జనవరి 1997

ముఖచిత్రాలంకరణ :
రమణ. విజయవాడ

డి.టి.పి :
శ్రీ లక్ష్మి గణపతి బైండింగ్ వర్క్స్,
కొవ్వూరు.

ముద్రణ :
శ్రీ అరుణోదయ (ఆఫ్‌సెట్) ప్రింటింగ్ ప్రెస్,
సీతారాంపురం, విజయవాడ - 2. ఫోన్ : 431422

ప్రకాశకులు :
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1.

మూల్యం :
రూ : 40/

# విషయ సూచిక


| | పేజీలు |
|---|---|
| విశ్వజనీనం సంస్కృతం | I-II |
| సంస్కృతభాష-దర్శన - విజ్ఞానాలు | III-V |
| వర్ణ సమామ్నాయం (అక్షరమాల) | 1-8 |
| సంస్కృతంలో పదాలు వాక్యాలు ఎలా తయారౌతాయి? | 9-20 |
| సుప్‌ప్రత్యయాలు - సుబన్త పదాలగురించి మరికొంత | 21-27 |
| ధాతువులు - తిజన్తపదాలు | 28-36 |
| కారక - విభక్తి పరిచయం | 37-42 |
| విభక్తుల సాధారణ ప్రయోగాలు | 43-45 |
| శబ్దాలు (టేబుళ్ల | 46-54 |
| వాక్యప్రయోగాల్లోని భేదాలు | 55-61 |
| కర్తృ కారకం (ప్రథమా - తృతీయా విభక్తులు) | 62-66 |
| భగవద్గీతనుండి (ప్రథమా - తృతీయా ప్రయోగాలు | 67-68 |
| కర్మకారకం (ప్రథమా - ద్వితీయా ప్రయోగాలు) | 69-71 |
| రామాయణంలో ద్వితీయావిభక్తి ప్రయోగాలు | 72-74 |
| కంఠస్థం చేయదగిన శ్లోకాలు | 75-76 |
| కరణకారకం (తృతీయావిభక్తి) (శ్లోకోదాహరణాలు) | 77-80 |
| సంప్రదాన కారకం (చతుర్థీవిభక్తి) (శ్లోకోదాహరణాలు) | 81-84 |
| అపాదాన కారకం (పంచమీవిభక్తి) (శ్లోకోదాహరణాలు) | 85-88 |
| సంబంధ బోధనం షష్ఠీవిభక్తి - (శ్లోకోదాహరణాలు) | 89-93 |
| అధికరణ కారకం సప్తమీవిభక్తి (శ్లోకోదాహరణాలు) | 94-99 |
| తిజన్త ప్రయోగాలు - దశలకారాలు | 100-103 |
| టేబుళ్లు | 104 - |
| దశలకారాలు - వివరణం | 105-107 |
| ప్రాచీనకాలంలో అధ్యాపన పరణి (ఉపనిషత్తు నుండి వాక్యాలు) | 108-114 |

ప్రాచీనకాలపువిద్యలు
ధాతుప్రయోగాలు - సమాన్య పరిచయం (టేబుళ్లు) 117-124
ధాతురూపాలు (కొన్నిధాతువుల పరిచయం)
ధాతుప్రయోగాలు ఉదాహరణాలు 125-127
ధాతురూపాలు (కొన్ని విశేషధాతువులు) 128-129
ప్రయోగాలు (ధాతురూపాలకు ప్రయోగవాక్యాలు) 120-131
విశేష ధాతురూపాలు 132-133
ఆత్మనే పదిధాతురూపాలు - ఉదాహరణవాక్యాలు 134-136
ధాతువుల విశేషప్రయోగాలు (హేతుమణ్ణిజన్త సనాద్యన్త 137-142
ప్రయోగాలు - ఉదాహరణాలు 143
ప్రాచీన భూవిజ్ఞానం (పాఠం) ధాతువులు ఉపసర్గలు వీని ప్రయోగాలు 144-146
పృథివీతత్త్వం - పరమాణువాదం - ఇతరవిశేషాలు 144-146
ప్రాచీనం జలవిజ్ఞానం (సుశ్రుత సంహితనుండి వాక్యాలు) 147-155
కృత్ ప్రత్యయాన్త ప్రయోగాలు - వాటికి ఉదాహరణాలు
ప్రాచీన రసాయన శాస్త్రవిజ్ఞానం (Ancient Chemistry)
వాక్యప్రయోగాలు 156-159
సమాసముల ప్రయోగాలు - సమాన్య పరిచయం 160-162
తత్పురుషాది సమాసాలు 163-166
కృత్ప్రత్యయాన్తాలలో కొన్ని విశేష ప్రయోగాలు
(క్త్వా - తుమున్ ప్రత్యయాన్త ప్రయోగాలు) 167-169
తద్ధితాంత ప్రయోగాలు 170-172
తద్ధితాంత విశేషప్రయోగాలు 173-175
భౌతిక విజ్ఞానవిశేషాలు - (అవ్యయాల పరిచయం) 176-181
సంధిప్రక్రియ - లింగములు 182-183
అచ్సంధులు (ప్రాచీన కాలంలోనౌకా నిర్మాణం) 184-188
హల్ సంధులు 188-189
ముఖ్యంగా గమనించ వలసిన కొన్నివిశేషాలు 189-190
విష్ణుపురాణంలో (శ్లోకాల్లో సంధులు) 190-190

# సంస్కృతం విశ్వజనీనం

ఏ జాతికైనా ఒక జీవనవిధానం, ఒక ఆలోచనా సరణి ఉంటుంది. దానిలోనే ఆ జాతియొక్క సంస్కారం, దాన్ని బట్టి ఆ జాతి గొప్పతనం ఆధారపడి ఉంటుంది. భారతీయ జాతి యొక్క సంస్కృతిని ప్రతిబించేవి, వేదాలు, వాటిపై ఆధారపడి వైదిక విజ్ఞానాన్ని అందించడానికి ఆవిర్భవించిన ఇతిహాస, పురాణ - కావ్యాది వాఙ్మయం, ఇవన్నీ ఒకే అంతస్సూత్రంతో వేరు వేరు రీతుల్లో జాతి ప్రతిబోధనం చేస్తున్నాయి. ఇవన్నీ ఒకే భాషలో నిర్మింపబడ్డాయి. అదే సంస్కృతం. వేదాల్లోని సంస్కృతానికి, ఇతిహాసపురాణాదుల్లో ఉన్న సంస్కృతానికి కొంత తేడా ఉన్నప్పటికి, ఈ రెండు రకాల సంస్కృతానికి విశాలమైన శబ్దరాశి ఒకటే. లోకంలో 'జనాః' అని అంటే వేదంలో 'జనాసః' అని క్రొద్దిపాటి మార్పుతో అదే శబ్దం ఉంటుంది.

ఈ సంస్కృతభాష లోకంలో వాడుకలో ఉండేది. ఈ లౌకిక సంస్కృతంతో పాటే, దీని అపభ్రంశరూపాలైన ప్రాకృతాలు కూడా సాధారణ జనవ్యవహారంలో ఉండేవి. వేద, పురాణేతి హసాదుల్లో, వ్యాకరణ సంస్కార సంపన్నమైన భాషఏది ఉన్నదో దాన్ని 'సంస్కృతం' అని, అన్నారు. ఆరోపాలను ఉచ్చరించడంలో ఉన్న అశక్తివల్ల, వాతావరణ పరిస్థితులవల్ల మార్పులు చేసి వాడటం ఉండేది. ఇలా వాడబడిన శబ్దలే అపభ్రంశాలు. ఇలా జరిగిన అపభ్రంశాలే నేటి ఉత్తర హిందుస్థానంలోను దక్షిణ దేశంలోను ఉన్న వాడుకభాషలు అని చాలామంది విశ్వసిస్తారు. ఇది ఉత్తరహిందు స్థానభాషలవిషయంలో యథార్థమైనా, దక్షిణాది భాషలు అలా ఏర్పడలేదనే వాదం ఉంది, ఆర్య - ద్రావిడ భాషలనే పేర్లతో విడగొట్టి జాతిని నిలువునా చీల్చే ప్రయత్నాలూ జరిగాయి. సంకుచిత దృష్టితో ఆర్షవాఙ్మయాన్ని కూడా కించపరచే ధోరణులు కూడా ఎన్నో ఈ గడ్డపై ఆవిర్భవించాయి. అవి ఇంకా కొందరి మనస్సుల్లో పిశాచల్లా పట్టి పీడిస్తున్నాయి.

II

వీటిపై పెద్దలు తర్జన భర్జనలు చేశారు. చేస్తున్నారు. ఇంకా చేస్తూనే ఉంటారు. అఖండగంగను పవిత్రమనినెత్తిని పెట్టుకొనే వారు కొందరుంటే, అది కలుషం అని దూరంగా తొలగిపోయే వారు ఉన్నట్లే - "నాస్త్యే వతజ్జగతి సర్వ మనోహరం యత్" ఈ జగత్తులో అందరికీ నచ్చిన వస్తువు అంటూ ఏదీ ఉండదన్నట్లు సంస్కృతాన్ని పండించేవారు, ఎండించే ప్రయత్నం చేశావారు ఇద్దరూ ఉన్నా, వీరిని చూచి, నిర్లక్ష్యంగా, నిరామయంగా అందర్నీ అక్కున జేర్చుకొనే గంగలా, పిల్లల అపచారా లను పట్టించుకోక నెత్తికెత్తుకునే మాతృమూర్తి అయిన తల్లిలా సంస్కృత భాష, దానిలోని సారస్వతం ఈ జాతిని ఉజ్జీవింప జేస్తునే ఉన్నది. సూర్యునికాంతిని చేతులతో ఆపలేనట్లే సంస్కృత భాషాదీప్తిని చూచి ఓర్వలేక ఈర్ష్యా సూయలలో దాన్ని అడ్డుకోజూచిన సోమకాసురులు కూడా చివరికి లెంపలు వేసుకోకతప్పదు. భాషకు జాతి-మత-కుల-వర్గవిద్వేషాలుండవు. ఆ ద్వేషాలన్నీ మనుషులకే ఉంటాయి. భాష భావ వ్యక్తికి ఉపకరించే ఒక మహత్తర సాధనం. అది దాన్ని వినియోగించు కోగలవారి సామర్థ్యంపై వికాసాన్ని పొందుతుంది. ఒకరిని తిట్టడానికి, మరొకరిని పొగడటానికి భాష ఉపకరిస్తుంది. అయినా ఆ దోషం బాషదికాదు. దాన్ని ఉపయోగించు కొనేవాడిది. ఒక పూవును దానిలో పరిమళాన్ని చూచి ఆనందించి అది పరమాత్మకు సమర్పించాలనే సద్బుద్ధి కలవాడున్నట్లే, తనకు అది ఉపభోగసాధనం అని తనను అలంకరించుకొని వాడూ ఉంటాడు. తుంచి నలిపి నేలపై పారవేసి వికటంగా ఆనందించే ఉన్మాదీ ఉంటాడు. వీరి భిన్న భిన్న ప్రవృత్తులు వారి వారి సంస్కారాన్ని తెలియ జేస్తాయే తప్ప, పూవును, దానికి గల సహజ పరిమళాన్ని, సౌందర్యాన్ని తీసి పారవేయజాలవు కదా! భాష కూడా అంతే.

పనిగట్టుకొని కొందరు "సంస్కృతం మృతభాష" అని ప్రచారం చేస్తూ ఉంటారు. భారతీయ జాతి, ప్రపంచంలో ఉత్తమ సంస్కారవంతులు బ్రతికి ఉన్నంత వరకు ఆ భాషకు చావు లేదనే తత్త్వం వారికి తెలియకపోవడం

శోచనీయం. వైదికులకు, అ వైదికులకు, ఆస్తికులకు నాస్తికులకు అందరికీ ఈ భాష ఆశ్రయం అయింది. అవుతుంది.

వేదాలు, రామాయణ మహాభారతాదులు, సారస్వతం ఈ భూమిపై బ్రతికి ఉన్నంత కాలం సంస్కృతం అమృత హృద్యమై బ్రతికే ఉంటుందన్న వివేకం ఒకరు కలిగిస్తే వచ్చేదా? నిజంగా నిద్రపోతున్న వాణ్ణి మేల్కొల్పవచ్చు. దొంగనిద్ర పోతున్న వాణ్ణి మేల్కొలప గలవారెవ్వరు. వారిని ద్వేషినందువల్ల వచ్చే పురుషార్థం ఏమిటి? సంస్కృతాన్ని నిష్కారణంగా, దాన్ని ఉపయోగించు కోవడం చేతకాక, "అందని ద్రాక్ష పళ్లు పుల్లన" అన్నట్లు నిరసించే అరసికుల మనస్సు' రంజింప జేయవలసిన అగత్యం, అవసరం ఎవ్వరికీ లేదు. సంస్కృతజ్ఞులకు అసలే లేదు. వారి మానాన్ని వారిని వదలి వేయడమే మంచిది.

ఇక, దాని పట్ల ఏలేశమాత్రమైనా, అంతర్గతంగా ప్రీతి ఉండి, వానిని అందుకో లేనని బెంగపడేవారికి మరికొంత ఆసక్తిని, చొరవను, మార్గసారల్యాన్ని కలిగించడమే ఈ ప్రయత్నానికి లక్ష్యం.

ఉన్న వాక్యాలను, వాటిలోని అంశాలను వాక్యరూపంగా ఈ పుస్తకంలో తీసికోవడం జరుగుతున్నది. సందర్భోచితంగా ఆయా విభక్తులను, ధాతువులను, వాక్యప్రయోగాలను పరిచయం చేయడానికి రామాయణాదులే కాక, శ్లోకాలు కూడా ఇవ్వడం జరిగింది. ఆ శ్లోకాన్ని కంఠస్థం చేస్తే ఆ విషయం బుద్ధిస్థం అవుతుంది. గుర్తు పెట్టుకోవడంనికి వీలుగా ఉంటుంది.

సంస్కృత వ్యాకరణ ప్రణాళిని అనుసరించి ఆయా వ్యాకరణాంశాలు ఇవ్వబడినా, ఉదాహరణాలన్నీ ప్రాచీన దర్శన - విజ్ఞాన విషయాలతో ముడిపడి ఉన్నవే ఇవ్వబడ్డాయి.

ఆధునిక భౌతిక - రాసాయనిక విశేషాలలో కొన్నిటిని సూచనా ప్రాయంగా వాక్యాల ద్వారా పరిచయం చేయడం జరిగింది.

ఈ విధమైన సంస్కృత భాషా పరిచయం బహుశః ఇదే మొదటిదేమో! దీన్ని చూచి, ఉత్సాహవంతులగు సంస్కృత పాఠకులు సంస్కృత విద్యార్థులకు, ఇతరులకు మన విజ్ఞానం పట్ల సారస్వతం పట్ల అభిరుచిని పెంచాలనే ఈ తాపత్రయం.

ఇది సమగ్రం కాదు. మార్గ దర్శకం మాత్రమే. ఎన్నో లోటు పాటులుండి ఉంటాయి. అయినా తప్పక ఆదరించి ఈ మార్గాన్ని అనుసరిస్తారని ఆశించడం గ్రంథ రచయితగా నా ధర్మం. త్రికరణశుద్ధిగా నా ఆశయం.

టేబుల్స్‌లో ఇచ్చిన శబ్దాలను, ధాతువులను, వాక్యాలను పోల్చి చూచి అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేయాలి. ఉపాధ్యాయులు కూడా శబ్దాలను పోల్చి చూపి సులభంగా గ్రహించేటట్లు చేయాలి. విషయాలపట్ల ఆసక్తిని కల్పించాలి.

అదే ఈ రచన కులక్ష్యం.



పెద్దది అన్న సత్యాన్ని చెప్పుకోలేని ఆత్మవంచకులు ఈ భరత భూమిపై ఉన్నారు. "ఆనోభద్రాః క్రతవో యన్తువిశ్వతః (Let noble thoughts come from all directions) నలుచెరగుల నుండి ఉదాత్త భావాలు ప్రసరించాలనే భావన గల మన ప్రాచీనుల పేర్లయినా, మన పాఠ్య గ్రంథకర్తలు ఉట్టికించ లేని దుర్బలులు. అణువాదాన్ని చెప్పే గ్రంథాలు, మన ప్రాచీనులలో దానికి ప్రవర్తకులైన కణాద - గౌతముల పేరైనా పేర్కొనవు. "అద్భిర్వినా గ్లాయ మానత్వం ప్రాణిత్వమ్' నీరు లేక పోతే వాడిపోవడమే ప్రాణిలక్షణమని నిర్వచించి చెట్లలో ప్రాణమున్నదని సహేతుకంగా నిరూపించిన మహా భారతంలోని విషయాలపై దృష్టిలేని మనమేధావులు, చెట్లకు ప్రాణం ఉన్నదని చెప్పిన వారెవరు? అనగానే ఆధునికుల పేరు టక్కున చెప్పగలరే గాని, వారికి ఈ దర్శనం ఈ నాటిది కాదని తెలియక పోవడం, పాపం, వారి దోషం కాదు. వారు చదువు కున్న చదువు యొక్క దోషం. అంతా మాకే తెలుసును అనే అహంకారాన్ని మనం తిరస్కరించడం సబబే అయినా, మాకేమీ తెలియదు అనుకునే అవివే కాన్ని గూడ భూషణంగా భావించు కోవడాన్ని ఏమని భావించాలి! అన్ని మనకు తెలియక పోవచ్చు. కానీ మనకూ కొన్ని తెలుసును, తప్పైనా ఒప్పైనా మనకు ఒక భావన, ఆలోచన ఉందనే సత్యాన్ని మన మేధావులు ఎందుకు దాస్తారు?

మన పాఠ్యప్రణాళికలో మన భారతీయ ఆలోచనాధారను కూడా కనీసం నామ మాత్రంగా అయినా చెప్పాలి. పుస్తకాలను త్రిప్పి వ్రాయాలి. ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానాలు సమ్మిళితం చేసి భౌతిక - రసాయన - గణిత - వాస్తు విశేషాలను పునః పరిశీలనం చేసి మన విజ్ఞానాన్ని వెలికి దీసి మన పిల్లలకు సంగ్రహంగా నైనా తెలియ పరచే అవసరం ఎంతైనా ఉంది.

ఏవో కొన్ని వాక్యాలు కంఠస్థం చేసి ఆ భాష వచ్చిందని సంతృప్తిపడటం కంటే, అసలు ఆభాషలో ఉన్న విశేషాలను గ్రహిస్తూ వాటితో పాటే భాషను నేర్పడం బాగుంటుంది.

మన ప్రాచీన గ్రంథాల్లో అంటే ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలైన రామాయణ మహాభారతాలు, భగవద్గీత, దర్శనాలు ఇలా అక్కడక్కడ విడివిడిగా

ఉన్న వాక్యాలను, వాటిలోని అంశాలను వాక్యరూపంగా ఈ పుస్తకంలో తీసికోవడం జరుగుతున్నది. సందర్భోచితంగా ఆయా విభక్తులను, ధాతువులను, వాక్యప్రయోగా లను పరిచయం చేయడానికి రామాయణాదులే కాక, శ్లోకాలు కూడా ఇవ్వడం జరిగింది. ఆ శ్లోకాన్ని కంఠస్థం చేస్తే ఆ విషయం బుద్ధిస్థం అవుతుంది. గుర్తు పెట్టుకోవడంనికి వీలుగా ఉంటుంది.

సంస్కృత వ్యాకరణ ప్రణాళిని అనుసరించి ఆయా వ్యాకరణాంశాలు ఇవ్వబడినా, ఉదాహరణాలన్నీ ప్రాచీన దర్శన - విజ్ఞాన విషయాలతో ముడిపడి ఉన్నవే ఇవ్వబడ్డాయి.

ఆధునిక భౌతిక - రాసాయనిక విశేషాలలో కొన్నిటిని సూచనా ప్రాయంగా వాక్యాల ద్వారా పరిచయం చేయడం జరిగింది.

ఈ విధమైన సంస్కృత భాషా పరిచయం బహుశః ఇదే మొదటిదేమో! దీన్ని చూచి, ఉత్సాహవంతులగు సంస్కృత పాఠకులు సంస్కృత విద్యార్థులకు, ఇతరులకు మన విజ్ఞానం పట్ల సారస్వతం పట్ల అభిరుచిని పెంచాలనే ఈ తాపత్రయం.

ఇది సమగ్రం కాదు. మార్గ దర్శకం మాత్రమే. ఎన్నో లోటు పాటులుండి ఉంటాయి. అయినా తప్పక ఆదరించి ఈ మార్గాన్ని అనుసరిస్తారని ఆశించడం గ్రంథ రచయితగా నా ధర్మం. త్రికరణశుద్ధిగా నా ఆశయం.

టేబుల్స్‌లో ఇచ్చిన శబ్దాలను, ధాతువులను, వాక్యాలను పోల్చి చూచి అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేయాలి. ఉపాధ్యాయులు కూడా శబ్దాలను పోల్చి చూపి సులభంగా గ్రహించేటట్లు చేయాలి. విషయాలపట్ల ఆసక్తిని కల్పించాలి.

అదే ఈ రచన కులక్ష్యం.



# వర్ణ సమామ్నాయం
# (అక్షరమాల)

సంస్కృత వర్ణాల ఆవిర్భావం ఎప్పుడైంది? అనే ప్రశ్నకు తేదీలతో సమాధానం ఇవ్వడం చాలా కష్టం. సృష్టి అనేది జరిగిందనేది ఋగ్వేదంలోని నాసదీయసూక్తం చెబుతున్నది. సృష్టిలో మానవుడు అవిభజనీయాంశం. ఆ మానవుడు సృష్టిలోని వస్తు జాతాన్ని వ్యవహరింపవలసినప్పుడు, భగవంతుని సంకల్పం వల్లనే అనంతమైన వేదరాశి ఆవిర్భవించి, ఋషులచే వినబడటం వల్ల శ్రుతులుగా వ్యవహరింపబడింది. శబ్దరాశి అంతా వేదరాశిలోనే ఉంది. దాన్నే మానవుడు కూడా కొద్దిపాటి మార్పులతో ఉపయోగించాడు. ఈ విధంగా సృష్టిలోని వస్తువులతో పాటు వాటి వ్యవహారానికి కావలసిన అపారమైన శబ్దరాశిని భగవంతుడే సృజించి ఇచ్చాడని భారతీయుల సాంప్రదాయికమైన అభిప్రాయం. మానవుడే తన అవసరాలకు శబ్దాలను సృజించుకున్నాడని ఆధునిక వైజ్ఞానికుల భావన. కష్టం వచ్చినా, సుఖం కల్గినా, కోపం వచ్చినా నోటిలో నుంచి శబ్దాన్ని పుట్టించి వ్యక్తపరచడం ప్రాణులన్నింటికీ ఉన్న సమాన లక్షణమే అయినా, స్పష్టంగా ఒక క్రమమైన పద్ధతిలో శబ్దాన్ని ఆవిర్భవింప చేయగల పటిమ, బుద్ధిశక్తి సమస్తప్రాణి కోటిలోను, ఒక్కమానవునికే ఉండటం వల్ల, మానవుడే భాషను తానే తన అవసరానికి సృజించుకున్నాడని శాస్త్రజ్ఞులు అంటారు. శబ్దరాశి యొక్క పుట్టుకతోనే అక్షరరాశియొక్క పుట్టుక కూడ ముడిపడి ఉంది. ముందు అక్షరరాశి పుట్టి అక్షరాల కలయిచే పదాలు సృజింపబడ్డాయా? లేకముందే వాడుకకు కావలసిన శబ్దరాశి పుడితే, ఆ శబ్దరాశిలోని అంశాలను విడగొట్టగా అక్షరాలు ఏర్పడ్డాయా? అనే ప్రశ్నకు కూడ సమాధానం కష్టమే. "దేవీం వాచమజనయన్త దేవాః తాం విశ్వరూపాః పశవో వదన్తి" అనే వేదవచనాన్ని బట్టి దేవతలు ప్రకాశశీలమైన (చైతన్యవంతమైన) వాక్కును సృజించారని, ఆ వాక్కును ప్రాణులు (అంటే మానవులు) మాటాడుతున్నారని, ఆ వాక్కులలోనే అక్షరాలు చేరి ఉన్నాయని తెలుస్తున్నది. ఈ అఖండమైన వాక్కును అభ్యాసం ద్వారా అలవరచుకొనవలసి వచ్చినపుడు, అఖండ వాక్యాలను పదాలుగాను పదాలను అక్షరాలుగాను, విడగొట్టవలసి వచ్చిందని భావించవచ్చును.

నందికేశ్వరుడు రచించిన 'కాశిక' అనే గ్రంథంలో ఇలా ఒక శ్లోకం ఉంది.

నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్ ।
ఉద్ధర్తు కామః సనకాది సిద్ధాన్ ఏతద్విమర్శే శివసూత్రజాలమ్ ॥

పరమేశ్వరుడు తాండవనృత్యం చేసిన తరువాత, చివర 14 సార్లు ఢక్కను మ్రోగించాడట. సనకసనందనాది సిద్ధపురుషులను ఉద్ధరించాలని ఇలా చేశాడట. ఈ పదునాల్గు ధ్వనులను పర్యాలోచిస్తే అక్షర సమామ్నాయానికి మూలమైన 'అకారాది' వర్ణాలతో కూడిన శివసూత్ర సముదాయం ఏర్పడిందట.

పాణినిమహర్షి తాను సంస్కృతభాషకు వ్యాకరణం వ్రాయాలని ఉపక్రమించి దర్భపవిత్రాలు చేతిలో పట్టుకొని తూర్పువైపుకు కూర్చుండి తపోనిష్ఠతో అష్టాధ్యాయి అనే 8 అధ్యాయాలలో సూత్రాలను రచించినాడట. శిక్షాగ్రంథంలో (అక్షరాల పుట్టుకను బోధించే శాస్త్రమే శిక్ష) పాణినిస్తుతి ఇలా ఉంది.

యేనా క్షరసమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్ ।
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మైపాణినయే నమః ॥

ఎవ్వడు మహేశ్వరుని నుండి అక్షర సమామ్నాయాన్ని పొంది, వ్యాకరణశాస్త్రాన్ని సమగ్రంగా రచించాడో, ఆపాణిని మహర్షికి నమస్కారం' అని శ్లోకతాత్పర్యం. 'అక్షర సమామ్నాయం, అంటే అక్షరవేదం అనే అర్థం. అక్షరమాల కూడా వేదమంత ప్రాచీనమైంది అనాది సిద్ధమైంది.

అసలు అచ్చులు హల్లులు అనే వ్యవహారం ఎలా ఏర్పడింది? పాణినికంటే ముందు ఈ అచ్‌హల్ విభాగం లేదా? అనే సందేహం కలగవచ్చు. పాణిని కంటే ముందు అచ్చులకు స్వరాలని, హల్లులకు వ్యంజనాలని వ్యవహారం ఉంది. పాణిని, తాను దర్శించిన 14 మహేశ్వర సూత్రాలలోను చివర తాను చేర్చిన వ్యంజన వర్ణాల ద్వారా కొన్ని సంజ్ఞలు ఏర్పరచాడు. వాటికి ప్రత్యాహారాలని పేరు పెట్టాడు. అఇఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్ - అనే మొదటి నాల్గు సూత్రాలలో మొదట ఉన్న 'అ' కారాన్ని, 'చ్' అనే చివరివర్ణంలో కలిపి 'అచ్' అని ఒక సంజ్ఞ కల్పించాడు. ఈ 'అ' 'చ్' మధ్యలో ఉన్న అ,ఇ,ఉ,ఋ,ఌ,ఏ,ఓ,ఐ,ఔ 'అనే 9వర్ణాలను మౌళికంగా అచ్చులని వ్యవహరించాడు. ఇలాగే 'హయవరట్' అనే సూత్రంలోని 'హ' అనే వర్ణాన్ని 'హల్' అనే 14వ సూత్రంలోని 'ల్' అనే వర్ణంతో కలిపి 'హల్' అనే సంజ్ఞ ఏర్పరచి, ఈ మధ్యలో ఉన్న వర్ణాలన్నీ హల్లులు అన్నాడు. ఆ విధంగా - హ,య,వ,ర,ల,ఞ,మ,ఙ,ణన,ఝ, భఘ,ఢ,ధ, జబగడదఖఫఛఠథచటత,క,ప,శ,షస అనే వర్ణాలను హల్లులని

వ్యవహరించాడు. పైన పేర్కొన్న మౌళికమైన అచ్చులే ఉచ్చారణలో ఉండే భేదాలనుబట్టి అనేక ప్రభేదాలుగా ఏర్పడ్డాయి. వాటి వివరాలు ఈ క్రింద ఇయ్యబడ్డాయి. చూడండి.

**అచ్చుల భేదాలు (ఎ)**

పాణినిమహర్షి తపస్సు చేసి తాను వ్రాయదలచిన వ్యాకరణానికి ఉపయోగించేలా ఒక క్రమంలో అక్షరాలను మహేశ్వరానుగ్రహంచేత దర్శింప గలిగాడు. తాను దర్శించిన అక్షరక్రమాన్ని 14 సూత్రాలుగా పాణిని కూర్చాడు. ఆ సూత్రాలు ఇవి. 1) అఇఉణ్ 2) ఋఌక్ 3) ఏఓఙ్ 4) ఐఔచ్ 5) హయవరట్ 6) లణ్ 7)ఞమఙణనమ్ 8)ఝభఞ్ 9) ఘఢధష్ 10) జబగడదశ్ 11) ఖఫఛఠథచటతవ్ 12) కపయ్ 13) శషసర్ 14) హల్.

ఈ సూత్రాలను ఆధారంగా చేసికొని మొదటి నాల్గు సూత్రాల్లో ఉన్న 'అఇఉఋఌ ఏఓఐఔ' వర్ణాలను అచ్చులని, 5వ సూత్రంనుంచి చివరి వరకు ఉన్న అక్షరాలను (అంటే హయవరలఞమఙణన ఝభఘఢధ జబడదఖఫఛఠథ చటత కప శషస' అనే వర్ణాలను) హల్లులు అని వ్యవహరించాడు.

అసలీ అక్షరాలు ఎప్పుడు పుట్టాయి? వీటికి మొదలు ఏమైనా ఉన్నదో. అన్న ప్రశ్నకు వేదములంతటి ప్రాచీనత, వేదసమానత ఈ అక్షర రాశికి ఉన్నదని అంగీకరింపవలసి ఉన్నది. పాణినికంటే ముందు కాలంలోనే వ్యాకరణములు భారత దేశంలో ఆవిర్భవించాయి. అందువల్ల వారందరికి ఈ అక్షరమాల తెలియదనడానికి వీలు లేదు. అయితే ఈ అక్షరాల విభాగాలకు పేర్లు వేరుగా ఉండి ఉండవచ్చు. పాణిని మహర్షి చేసిన చాలా విభాగాలను, ఆయనకంటే ఎంతో ముందు వాడైన యాస్కమహర్షి కూడా చేశాడు. పాణిని జనమే జయుని పేరు ఉట్టంకించాడు కనుక జనమేజయుని కంటే తరువాతివాడు. ఇక యాస్కమహర్షి భాషానిర్వచనం చేసినవానిగా మహాభారతంలోనే శాంతిపర్వంలో కీర్తింపబడ్డాడు. కనుక, మహాభారతం కంటే ముందే, పాణినీయ వ్యాకరణం వంటిదేదో ఉండితీరాలి. యాస్కుడుకూడా తనకంటే ముందువారైన మహర్షులను వ్యాకరణకర్తలుగా పేర్లతో కీర్తించాడు. కనుక అతి ప్రాచీన కాలంలోనే సంస్కృత వ్యాకరణం ఉండటంవల్ల అప్పటికే నిర్దుష్టమైన అక్షరమాల ఉండి ఉండాలి. ఉపనిషత్తులలోనే అక్షరం, పదం, వాక్యం మొదలైన శాస్త్రీయ శబ్దాలున్నాయి. కనుక అక్షరస్వరూపం అతి ప్రాచీనమైందని, ఆయా కాలాల్లో ఆయా మహర్షులు తపశ్శక్తిచే దర్శించారని చెప్పడం సముచితంగా

ఉంటుంది. ఈ అభిప్రాయాన్నే వాక్య పదీయం అనే గ్రంథంలో భర్తృహరి అనే వ్యాకరణ శాస్త్రజ్ఞుడు ఇలా అన్నాడు- "అక్షరసమామ్నాయస్య, వాగ్ వ్యవహారస్య న కశ్చిత్ కర్తా అస్తి. ఏవమేవవేదే పారంపర్యేణ స్మర్యమాణమ్." ఈ అక్షర సమామ్నాయానికి నిర్మాత ఎవ్వడూలేడు. ఇలా వేదంలో ఒకరి తరువాత ఒకరిచే పరంపరగా స్మరింపబడేదే ఇది. (మహాభాష్య ప్రదీపానికి ఉద్ద్యోతవ్యాఖ్య వ్రాసిన నాగేశభట్టు - ఈ వాక్యాలు ఉదాహరించాడు.)

**పాణినీయ వ్యాకరణాన్ని అనుసరించి అచ్చులు - హల్లులు ఎలా ఏర్పడ్డాయి?**

అ - హ్రస్వము - ఒక మాత్రాకాలంలో ఉచ్చరింపదగిన వర్ణం - ఇది ఉదాత్తం, అను దాత్తం,స్వరితం అనే మూడు స్వరాలు, వాటికి అనునాసికం, అననునాసికం అనే విభాగం ఏర్పడగా మొత్తం ఆరు రకాలుగా ఉంది (6)

ఆ - దీర్ఘం - రెండు మాత్రలకాలంలో (అంటే రెండు హ్రస్వ 'అ'కారాలు ఉచ్చరించడానికి పట్టే కాలంలో) ఉచ్చరింపబడే వర్ణం - దీనికి కూడా పై విధంగా 6 భేదాలున్నాయి (6)

ఆ3 - ప్లుతం - మూడు హ్రస్వ 'అ' కారాలు ఉచ్చరించే కాలంలో దీన్ని పలకాలి - దీనికి కూడా 6 భేదాలున్నాయి (6)

ఇలా, హస్వం, 'అ'కారం - 6
దీర్ఘం, ఆకారం - 6
ప్లుతం, ఆ 3 కారం - 6 - కలసి 18 అవర్ణాలున్నాయి. ఇవన్నీ లోకంలోను వేదంలోను వ్యవహారంలో ఉన్నాయి.

ఇలాగే- ఇకారానికి - 18 ప్రభేదాలు,
ఉకారానికి - 18 ప్రభేదాలు,
ఋకారానికి - 18 ప్రభేదాలు,
ఌకారాని - 12 ప్రభేదాలు (దీనికి దీర్ఘం లేదు)
ఏ,ఐ,ఓ,ఔ -

అనే వర్ణాలకు కూడా ఒక్కొక్కదానికి 12 ప్రభేదాలు - 4×12 = 48 మొత్తం - 132 అచ్చులు ఉన్నాయి. వీటినే స్వరాలని కూడా పిలుస్తారు. కాని లోక వ్యవహారంలో బాగా వినియోగింపబడే అచ్చులు -

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ఏ ఐ ఓ ఔ ఇవి. మూడు మాత్రలతో ఉచ్చరింపబడే ప్లుతాచ్చు దూరంగా ఉన్నవారిని పిలిచేటప్పుడు వాడబడుతూ ఉంటుంది. ఎలాగంటే -

హే రామ! అత్ర - ఆగచ్ఛ - ఓ రామా ఇక్కడకురా. రామా3 అనే శబ్దం పైన ప్లుతస్వరం ఉంది. ఆ ప్లుతస్వరాన్ని 3 అంకెతో సూచించడం జరిగింది. తెలుగులో కూడా ఎవరినన్నా పలిచేటప్పుడు 'ఒరేయ్' అనేటప్పుడు 'రే' మీద ప్లుతస్వరం వేసి ఉచ్చరిస్తే తప్ప దూరంగా ఉన్న వాడికి వినిపించదు. ఇలాగే అచ్చులను ముక్కుతో పలికితే వాటిని అను నాసిక లని అంటారు. తెలుగులో అనునాసికను తెలియజేయడానికి, ఆధునికులు 'ఁ' అనే అర్ధాను స్వారాన్ని వాడుతున్నారు. 'ఆఁ అలాగా! 'ఉహూఁ కుదరదు. ఆఁ, ఊఁ అనే రెండు ఇక్కడ అనునాసికలుగా ముక్కుతో పలకబడుతున్నాయి. ఇక '0' అని తెలుగు వ్రాసే అక్షరాన్ని సంస్కృతంలోనూ అను స్వారమని అంటారు.

'రామం భజ' అన్నప్పుడు 'మ' కు ప్రక్కన ఉన్న 'సున్న' అనుస్వారం. ':' ఇలా రెండు సున్నాలు రాస్తే విసర్గ అని అంటారు. తెలుగులో స్వతంత్రంగా దీనికి వినియోగం లేదు. తెలుగులో వాడబడే సంస్కృత పదాల్లో విసర్గం ఉంటుంది. ఉదా దుఃఖమ్, తెలుగు - దుఃఖము. ఆధునిక రచనల్లో ఈ విసర్గ(:) వ్రాయడానికి బదులు దుఖ్ఖము' అని 'ఖ' వత్తు ఇస్తున్నారు.

ఇవి కాక రెండు వర్ణాలు సంస్కృతంలో మాత్రమే ఉన్నాయి. (1) జిహ్వా మూలీయం (2)ఉపధ్మానీయం అని. విసర్గాన్ని 'క' కారానికి ముందు ఉచ్చరించినప్పుడు అది 1/2 విసర్గంగా గుర్తిస్తారు. దీనికే జిహ్వా మూలీయం పేరు. ౖ"క" అనేచోట ఇది ఉంది. ఇలాగే 'ప' వర్ణానికి ముందు ౖ'ప' అని ఉచ్చరిస్తే దాన్ని ఉపధ్మానీయం అంటారు విసర్గం ఉచ్చారణంలో అలా మారిందన్నమాట.

ఇక హల్లులు అని మనం వ్యవహరించే తెలుగు అక్షరాల్లో సంస్కృత భాషకు చెందిన హల్లులన్నీ ఉన్నాయి. తెలుగులో మాత్రమే "ఱ" అనేది, చ,జఅనే హల్లులు అదనంగా ఉన్నాయి. ఇక అచ్చుల్లో ఎ,ఒ అనేహ్రస్వ అచ్చులు అదనంగా ఉన్నాయి. ఇలా హ్రస్వాచ్చులు సంస్కృతంలో లేవు. ఎలుక, ఒప్పు అనే పదాల్లో ఇవి వాడబడుతున్నాయి.

హల్లులకు వ్యంజనాలు అని పేరు. కేవలం క్,ఖ్,గ్,ఘ్,ఙ్,చ్,ఛ్,జ్,ఝ్,ఞ్,,ట్, ఠ్, డ్,ఢ్,ణ్,ప్,ఫ్,బ్,భ్,మ్,య్,ర్,ల్,వ్,శ్,ష్,స్,హ్,ళ్, అనేవి మాత్రమే హల్లులు. వీటికి

అచ్చులు చేర్చితే క్+ఆ = కా, క్+ఇ=కి; క్+ఈ = కీ; క్+ఉ=కు, క్+ఊ=కూ; క్+ఋ=కృ;క్+ౠ=కౄ; క్+ఏ=కే, క్+ఐ=కై; క్+ఓ=కో; క్+ఔ=కౌ

ఇలా ప్రతి హల్లుకు ప్రక్కన అచ్చుచేర్చినప్పుడు, ఒక్కొక్క హల్లు పలురకాలుగా ఉచ్చరింపబడుతోంది. హల్లులు అచ్చులతో కలిసినప్పుడే వీటిని ప్రాణులు అని అంటారు. ప్రాణము కలవి అన్నమాట. ప్రాణం అంటే అచ్చు.

తెలుగులో వర్ణక్రమం చెప్పడం అనే ఒక సంప్రదాయం ఉంది. కకార అకారములు 'క', కకార ఇకారములు 'కి', ఇలా "గుణింతాలు" (ఇది అపశబ్దమైనా లోకంలో ఇలానే అంటారు) చెప్పించుతారు. ఇక్కడ 'కకారం' అంటే 'క్' అనే హల్లు, దీన్నే హల్లు, వ్యంజనం అంటారు, ఇది 1/2 మాత్రాకాలంలో పలకబడుతోంది.ఏ హల్లైనా అంతే. ఈ హల్లులు లేక వ్యంజనాలను సమూహాలుగా విభజించారు.

(1) క వర్గం - క్,ఖ్,గ్,ఘ్,ఙ్ - ఇవి కంఠంలోంచిపుట్టాయి కనుక - కంఠ్యాలు.

(2) చ వర్గం - చ్,ఛ్,జ్,ఝ్,ఞ్ - ఇవి తాలువుల (దవడలు) లోంచి పుట్టాయి కనుక- తాలవ్యాలు.

(3) టవర్గం - ట్, ఠ్,డ్,ఢ్,ణ్ - ఇవి మూర్థ (అంగుడు) లోంచి పుట్టాయి - కనుక మూర్ధన్యాలు.

(4) త వర్గం - త్,థ్, ద,ధ్,న్ - ఇవి దంతాల్లోంచి పుట్టాయి, కనుక దంత్యాలు.

(5) పవర్గం - ప్,ఫ్,బ్,భ్,మ్ - ఇవి ఓష్ఠాల (పెదవుల) నుంచి పుట్టాయి కనుక ఓష్ఠ్యాలు. ఈ ఐదు వర్గాలలోని అక్షరాలకు 'స్పర్శ' వర్ణాలని పేరు.

(6) య,ర,ల,వ - వీటిని అంతఃస్థవర్ణాలని అంటారు.

(1) య - దవడల్లో నుంచి పుట్టింది (2) ర - మూర్థలోంచి పుట్టింది (3) ల- దంతాల్లోంచి పుట్టింది. (4) వ - దంతాల్లోంచి పెదవుల్లోంచి పుట్టింది.

(7) శషసహ - వీటిని ఊష్మవర్ణాలంటారు.

(1) శ - దవడల్లోంచి పుట్టింది (2) ష - మూర్థలోంచి పుట్టింది (3) స - దంతాల్లోంచి పుట్టింది. (4) హ - కంఠంలోంచి పుట్టింది.

(8) పైన పేర్కొన్న వర్ణాలు కాక - అను స్వారం, విసర్గ, జిహ్వామూలీయమ్, ఉపధ్మానీయమ్ అని నాలుగు రకాల వర్ణాలున్నాయి. (అనుస్వారం నాసికలోనుంచి పుట్టింది. విసర్గం కంఠంలోంచి పుట్టింది. వీటిలో పై రెండిటి గురించి, (అంటే అనుస్వార విసర్గాలగురించి) సూచనగా చెప్పడం జరిగింది. జిహ్వామూలీయం 'ᳵక'

- జిహ్వ (నాలు) యొక్క మూలలోంచి పుట్టింది. ఉపధ్మానీయం (ౢప) పెదవుల్లోంచి పుట్టింది. ఇంతకూ ఇవి అచ్చులా? హల్లులా? అంటే పాణిని నిర్దేశించిన అఇఉణ్ మొదలైన సూత్రాల్లో ఈ వర్ణాలు కనబడటంలేదు కనుక ఇవి అచ్చులూ హల్లులు కావేమోననే సందేహం కలగవచ్చు. కాని, వీటిని శాస్త్ర కారులు అచ్చుల్లోను హల్లుల్లోనూ పఠించుకున్నారు. కనుక అచ్చులూ అవుతాయి. హల్లులూ అవుతాయి. ఇక అచ్చుల్లో - అకారం - కంఠంలోంచి, ఇకారం - తాలువులోంచి, ఉకారం పెదవుల్లోంచి, ఋకారం మూర్ధలోంచి, ౡ కారం దంతాల్లోంచి, ఏఐ వర్ణాలు - కంఠ - తాలుస్థానాలు రెంటి నుంచి, ఇలాగే ఓ ఔ - కంఠం పెదవులు అనే రెండుస్థానాల్లోంచి పుడతాయి. అచ్చులకు స్వరాలని కూడా పేరని వెనుక చెప్పడం జరిగింది. ఈ క్రింది టేబుల్ చూడండి - అక్షరాల స్థానాలు తెలుస్తాయి.

| | | |
|---|---|---|
| అ,కఖగఘఙ హ":"-కంఠం | ఉపఫబభమ,ౢ-ఓష్ఠాలు | వ-దంతాలు-పెదవులు |
| ఇచఛజఝఞయశ-తాలువు | ఞమఙణన-నాసిక-కంఠం | ౢక-అనేచోట జిహ్వా మూలీయ వర్ణానికి జిహ్వామూలం స్థానం. |
| ఋటఠడఢణరష-మూర్ధ (అంగుడు) | ఏఐ-కంఠం-దవడ | '0'-అను స్వారానికి నాసిక స్థానం. |
| ౡతథదధనలస-దంతాలు | ఓఔ-కంఠం,పెదవులు | |

## సంస్కృతంఅక్షరాలను ఎలా వ్రాయలి? ఏ లిపివ్రాయాలి?

సంస్కృతం అతి ప్రాచీన కాలంలో బ్రాహ్మీ లిపిలో వ్రాయబడేది. ఇలా వ్రాయబడిన శాసనాలున్నాయి. ఈ లిపిలోనుంచి కొంత మార్పు చేస్తే 'దేవనాగరి' అనే లిపి ఏర్పడింది. అందువల్లనే బ్రాహ్మీలిపి అక్షరాల క్రమం - ఆకారం - దేవనాగరి ఆకారానికి దగ్గరానే ఉంటుంది. కొన్ని సంస్కృత శాసనాలు గ్రీకు లిపిలో కూడా వ్రాయబడ్డాయి. బహుశః పాణిని - కాత్యాయనుల కాలంలో గ్రీకు లిపి కూడా మనవారికి పరిచితమై ఉండవచ్చు. అందుకే - కాత్యాయనుడు తనవార్తి కాల్లో యవనుల లిపిని 'యవనాని' అని వ్యవహరించాడు. (యవనాల్లిప్యామ్) పాణినికి లిపి తెలుసును. కనుకనే - దివా విభా నిశా....."ఇత్యాది - సూత్రంలో (అష్టాధ్యాయి 3-2-21) 'లిపి' 'లిబి' అనే రెండు శబ్దాలు ప్రయోగించాడు - ఈ రెండూ పర్యాయ పదాలని వాఖ్యాతలు వ్యాఖ్యానించారు. ఈ రెండు శబ్దాలకు 'కృ' అనే ధాతువు చేరిస్తే 'ట' అనే ప్రత్యయం చేరి 'లిపికర', 'లిబికర' అనే రూపాలు ఏర్పడతాయి. 'లిపికర' అంటే అక్షరాలును రేఖారూపంగా వ్రాసేనవాడు అని అర్థం.

సంస్కృతాన్ని ఏ లిపిలోనైనా వ్రాయవచ్చు. ఆయా ప్రాంతాల వారు వారివారి లిపుల్లో సంస్కృత గ్రంథాలు ముద్రించుకుంటారు. అయితే ప్రస్తుతం దేవనాగరి అనే లిపి అంతర్జాతీయముగా కూడా వాడబడుతున్నది. ఈ క్రింది టేబుల్‌లో తెలుగు అక్షరాలతో వాటిని పోల్చి గ్రహించవచ్చు.

| | |
|---|---|
| అచ్చులు | అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ఏ ఐ ఓ ఔ |
| | अ आ इ ई उ ऊ ऋ ॠ ऌ ए ऐ ओ औ |
| హల్లులు | క్ ఖ్ గ్ ఘ్ ఙ్ చ్ ఛ్ జ్ ఝ్ ఞ్ ట్ ఠ్ డ్ ఢ్ ణ్ |
| ఇవిహల్లులు | क् ख् ग् घ् ङ् च् छ् ज् झ् ञ् ट् ठ् ड् ढ् ण् |
| | త్ థ్ ద్ ధ్ న్ ప్ ఫ్ బ్ భ్ మ్ య్ ర్ ల్ వ్ శ్ ష్ స్ హ్ |
| | त् थ् द् ध् न् प् फ् ब् भ् म् य् र् ल् व् श् ष् स् ह् |
| పై హల్లులకు | క్+అ=క క్+ఆ=కా క్+ఇ=కి క్+ఈ=కీ క్+ఉ=కు |
| అచ్చులుచేరిస్తే | क्+अ=क, क्+आ=का, क्+इ=कि, क्+ई=की, क्+उ=कु |
| | క్+ఊ=కూ క్+ఋ=కృ క్+ౠ=కౄ క్+ఌ=క క్+ఏ=కే |
| | क्+ऊ=कू, क्+ऋ=कृ, क्+ॠ=कॄ, क्+ए=क |
| | క్+ఐ= కై, క్+ఓ =కో, క్+ఔ =కౌ, కం, కః |
| | क्+ऐ=कै, क्+ओ=को, क्+औ=कौ, कं कः |

ఇలా ఇతర వర్ణాలకు కూడా ఆయా వర్ణాల ప్రక్కన (హల్లుల ప్రక్కన) అచ్చులు చేరిస్తే వాడుకలో ఉన్న ఎన్నో వర్ణాలు తయారవుతున్నాయి.

ఇవి కాక రెండు లేదా మూడు హల్లుల కలయిక వల్ల సంయుక్త వర్ణాలు ఏర్పడతాయి - ఉదా. రాష్ట్రమ్ - ఇక్కడ 'ష్ట్ర' అన్నది సంయుక్తాక్షరం

ష్ + ట్ + ర్ + అ = ష్ట్ర

క్లిష్టమ్ - క్ + ల్ + ఇ = క్లి; ష్ + ట్ + అ = ష్ట + మ్

ఇలా అచ్చులు హల్లులు కలిసి వర్ణ సముదాయంగా ఏర్పడవచ్చు. ముందు ముందు పాఠాల్లో ఇవి మీకు స్పష్టపడతాయి.

# సంస్కృతంలోపదాలు-వాక్యాలు ఎలా తయారౌతాయి?

ఏ భాషనైనా మనం మాట్లాడేటప్పుడు ఆ మాటల పొందిక, నిర్మాణం గురించి తెలిసి కోవడం చాలా అవసరం. ఉదాహరణానికి మనం ఇద్దరు వ్యక్తులు తెలుగులో మాట్లాడుతున్నారనుకుందాం. వాళ్లు చదువుకున్నవాళ్లైనా కాకపోయినా వాళ్లు మాట్లాడుకొనే తీరు ఒక క్రమమైన పద్ధతిలో ఉంటుంది. ఈ క్రిందివాక్యాలు చూడండి.

(1) నేను - అన్నం - తింటున్నాను
అహమ్ - అన్నం - ఖాదామి

(2) బాలః పాఠాన్ - పఠతి
బాలుడు - పాఠాలను - చదువుతున్నాడు.

ఈ రెండు వాక్యాల్లోను ఎన్ని అంశాలున్నాయి?

నేను (అహమ్) అన్నం (అన్నమును, తింటున్నాను (ఖాదామి) ఇలా విడగొడితే మూడు అంశాలున్నాయి. ఈ మూడిటిని పదాలు అని అంటారు. ఒక్కొక్క పదాన్ని అచ్చులు,హల్లులుగా విడగొట్టండి. 'నేను' (అహమ్) ఈ పదంలో తెలుగులో నాలుగక్షరాలు, సంస్కృతంలో నాలుగక్షరాలు ఉన్నాయి. ఇలా మిగతా పదాలను అక్షరాలుగా విడగొట్టవచ్చు. దీని బట్టి తేలిందేమిటి? కొన్ని అక్షరాలు కలిపితే పదాలు ఏర్పడతాయి. మొదటి వాక్యంలో 3 పదాలున్నాయి (అహం - అన్నం - ఖాదామి). ఇలాగే రెండవ వాక్యంలో కూడా మూడు పదాలున్నాయి. ఈ మూడు పదాలు కలిస్తే ఒక పద సమూహం ఏర్పడింది. దీన్ని 'వాక్యం' అని అంటారు. ప్రతి భాషలోనూ ఇలా అక్షరాలు కలిపితే పదాలు, పదాలు కలిపితే వాక్యాలు అవుతాయి. ఇంగ్లీషులోనైనా ఇంతే.

I - am - a - boy ఇక్కడ నాలుగు పదాలున్నాయి. ఈ నాలుగు పదాల్లోను "I" అనే పదంలో ఒక అక్షరం "am" అనేపదంలో రెండక్షరాలు, "a"అనే పదంలో ఒక అక్షరం, "boy"అనే పదంలో 3 అక్షరాలు ఉన్నాయి. ఇలా అక్షరాలు విడివిడిగా కలిసి పదాలయ్యాయి. ఈ పదాలు నాలుగూ కలిసి వాక్యం అయింది. తెలుగులోలాగానే సంస్కృతంలో కూడా 'అక్షరం' 'పదం' 'వాక్యం' అనే వ్యవహరిస్తారు. ఇంగ్లీషులో అయితే **letter, word, sentence** అని వ్యవహరిస్తారు. ఈమాటల్ని బట్టి మనం అర్థం చేసికోవలసింది ఏమిటంటే - ఏ భాషలోనైనా - అక్షరాలు, అవికలిస్తే

పదాలు, పదాలు కలిస్తే 'వాక్యాలు' తయారౌతాయి. ఈ వాక్యాలు వాడితేనే ఎదుటివారికి అర్థం అవుతుంది. వ్యవహారం సాగుతుంది.

**సంస్కృతంలో పదాలు ఎలా తయారౌతాయి?**

ఏ భాషలోనైనా కొన్ని అక్షరాలు కలిసి పదాలుగా ఏర్పడి ఒక అర్థాన్ని బోధిస్తాయి. ఆ అక్షరాలు ఎన్నైనా కావచ్చు. సంస్కృతంలో పదాలు రెండు రకాలుగా ఉంటాయి.

(1) సుబన్త పదాలు (2) తిజన్త పదాలు.

ప్రతి వాక్యంలోను తప్పనిసరిగా కొన్ని సుంబత పదాలు, కనీసం ఒక్కటైనా తిజన్త పదం ఉండి తీరుతుంది. అలాలేకపోతే అసలు 'వాక్యం' అనేదే ఏర్పడదు. క్రింది వాక్యాలు చూడండి.

| | సుబన్త పదాలు (A) | తిజన్త పదాలు (B) |
|---|---|---|
| 1) | రామః గ్రామం | గచ్ఛతి |
| | రాముడు గ్రామానికి | వెళ్తున్నాడు. |
| 2) | బాలికా పిత్రా | భాషతే |
| | బాలిక తండ్రితో | మాట్లాడుతున్నది. |
| 3) | ఉద్యోగీ ప్రతిదినం కార్యాలయం | పర్యవేక్షతే |
| | ఉద్యోగి ప్రతిదినమూ కార్యాలయాన్ని | పర్యవేక్షిస్తాడు. |

ఇక్కడ ముందు వరుసలో ఉన్నవి సుబన్త పదాలు - రెండో వరసలో ఉన్నవి తిజన్త పదాలు. 'పాణిని' మహర్షి 'సుప్‌తిజన్తం పదమ్' అనే సూత్రాన్ని వ్రాసి పదాలు రెండు రకాలని చెప్పాడు.

**సుబన్త పదాలు : (భాషలో సగానికి పైగా ఇవే ఉన్నాయి)**

సంస్కృతంలో ఏదైనా ఒక పదం తయారు అయింది అంటే అందులో రెండు అంశాలు తప్పకుండా ఉంటాయి. 1. ప్రకృతి 2. ప్రత్యయం. 'ప్రకృతి' అనేది మౌళికశబ్దం. ఆమౌళిక శబ్దాలకు ప్రక్కన చేర్చబడే శబ్దాలను ప్రత్యయాలంటారు. ప్రకృతులకు 'ప్రత్యయాలు కలిస్తేపదాలు తయారౌతాయి. ప్రకృతులనే ప్రాతిపదికాలు అంటారు. కొన్ని పదాలలో ప్రకృతికి 'ధాతువు' అనే పేరు ఉంటుంది. సంస్కృతభాషలో 1) కృత్ ప్రత్యయాలు 2) తద్ధిత ప్రత్యయాలు 3)స్త్రీ ప్రత్యయాలు 4) సుప్ ప్రత్యయాలు 5) తిజ్ ప్రత్యయాలు 6) వికరణ ప్రత్యయాలు అని మొత్తం ఆరు రకాలు ప్రత్యయాలున్నాయి. (ఇది స్థూలంగా చేసిన విభాగంమాత్రమే)

**1) కృత్ ప్రత్యయాలు : అవి చేర్చగా ఏర్పడే ప్రతిపదికాలు.**

1) భూ + ణ్వుల్ = భావక (ఇక్కడ 'భూ' అనే ధాతువు ప్రకృతి - దానికి 'ణ్వుల్' అనే కృత్ ప్రత్యయం చేరి "భావక" అయింది.

2) పఠ్ + ల్యుట్ = పఠన
3) గమ్ + క్తిన్ = గతి
4) కృ + తృచ్ = కర్తృ
5) దృశ్ + తవ్య = ద్రష్టవ్య
6) రమ్+అనీయర్ = రమణీయ

ఇక్కడ ముందున్నది 'ధాతువు' అంటారు. ఇది ప్రకృతి. దీనికి ప్రక్కన ల్యుట్, క్తిన్, అనీయర్, శతృ, తవ్య మొదలైన కృత్ ప్రత్యయాలు చేరిస్తే పఠన, గతి, రమణీయ, కర్తృ, ద్రష్టవ్య అనే కృదంత శబ్దాలు తయారయ్యాయి.

**2) తద్ధితప్రత్యయాలు - అవి చేర్చగా ఏర్పడే ప్రాతి పదికాలు.**

కొన్ని ప్రాతిపదికాలకు (ప్రకృతులకు) తద్ధితాలనే ప్రత్యయాలు చేర్చగా తద్ధితప్రత్యయాంత ప్రాతిపదికాలు ఏర్పడతాయి.

a) స్త్రీ + న ఞ్ = స్త్రైణ.
b) పుంస్ + స్నఞ్ = పౌంస్న
c) అశ్వపతి + అణ్ = అశ్వపత
d) గంగా + ఢక్ = గాంగేయ
e) గర్గ + యఞ్ = గార్గ్య
f) దక్ష + ఇఞ్ = దాక్షి
g) కురు + ణ్య = కౌరవ్య

ఇక్కడ మొదటి శబ్దం ప్రాతిపదికం. దానికి ప్రక్కన నఞ్, స్నఞ్ మొదలైన తద్ధిత ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన స్త్రైణ, పౌంస్న, గాంగేయ ఆశ్వపత మొదలైన శబ్దాలను తద్ధితాంత ప్రాతిపదికాలు అంటారు.

**3) స్త్రీ ప్రత్యయాలు - స్త్రీ ప్రత్యయాంత ప్రాతిపదికాలు.**

సంస్కృతంలో శబ్దాలను మూడు లింగాలలో వ్యవహరిస్తారు. కొన్ని శబ్దాలు పుంలింగ శబ్దాలు, కొన్ని స్త్రీ లింగ శబ్దాలు, కొన్ని నపుంసక లింగ శబ్దాలు. ఈ లింగాల గురించి ముందు పాఠాల్లో స్పష్టంగా తెలుస్తుంది. ఇంగ్లీషులో వీటిని 'Genders' అంటారు. తెలుగులో సంస్కృతంలోలాగానే వ్యవహరిస్తారు. ఇంగ్లీషులో కూడా లింగాలున్నాయి. ఈ విషయం ముందు పాఠాల్లో స్పష్టంగా చెప్పబడుతుంది. ఈ మూడు లింగాలలో స్త్రీలింగ శబ్దాలను గుర్తించడానికి ఆ శబ్దాల చివర ఉన్న "స్త్రీ ప్రత్యయాలు" ఉపకరిస్తాయి. ఎలాగంటే-

1) గంగా - ఇక్కడ 'ఆ' అనేది స్త్రీ లింగాన్ని సూచించే ప్రత్యయం.
2) గౌరీ - ఇక్కడ 'ఈ' అనేది స్త్రీ లింగ ప్రత్యయం.

3) తనూః - ఇక్కడ "ఊ" అనేది స్త్రీ లింగ ప్రత్యయం
4) యువతిః - ఇక్కడ 'తి' అనేది స్త్రీ లింగ ప్రత్యయం
ఇలాగే మరికొన్ని స్త్రీ లింగాన్ని సూచించే ప్రత్యయాలున్నాయి. ఈ స్త్రీ లింగ ప్రత్యయాలు చేర్చిన శబ్దాలను స్త్రీలింగ ప్రాతిపదికాలు అంటారు. సాధారణంగా ఇవన్నీ దీర్ఘాచ్చు చివర కలిగి ఉంటాయి. 'తి' అనేది చివర కలవి ఎక్కువగా స్త్రీలింగాలే.

4) సుప్ ప్రత్యయాలు -

పైన పేర్కొన్న 1) కృత్ ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన ప్రాతిపదికాలు (భావక - పఠన మొదలైనవి)
2) తద్ధిత ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన ప్రాతిపదికాలు (స్త్రైణ - పౌంస్న మొ॥)
3) స్త్రీ ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన ప్రాతిపదికాలు (గంగా, గౌరీ మొ॥)
వీటిని కేవలం ప్రాతిపదికాలుగా భాషలో ప్రయోగించడం కుదరదు. ఎలాగైతే ముడిసరుకును వస్తువుగా మార్చితేనే తప్ప ఉపయోగించడం కుదరదో, అలాగే పైన పేర్కొన్న మూడు రకాల శబ్దాలు (ప్రాతిపదికాలు) ప్రకృతులు. వీటికి 'సుప్' అని పిలువబడే 21 ప్రత్యయాలు చేర్చితే, మూడు లింగాల్లో, ఏకవచనం, ద్వివచనం, బహువచనం అనే మూడు వచనాల్లో - ప్రథమావిభక్తి మొదలైన ఏడు విభక్తుల్లో ఒక్కొక ప్రాతిపదికానికి 21 రూపాలు సాధారణంగా ఏర్పడతాయి వీటన్నింటిని "సుబన్త శబ్దాలు" అని అంటారు. భాషలో సగం వంతు ఈ శబ్దాలే ఉంటాయి. వీటికే సుబన్త పదాలనికూడా పేరు.

ఉదా : పైన పేర్కొన్న మూడు రకాల ప్రాతిపదికాలకు చివర 'సుప్' ప్రత్యయాలు చేరిస్తే ఎలా ఉంటుందో చూడండి.

| కృదంత పదికాలపై ఏర్పడ్డ పదాలు | తద్ధితాంతప్రాతిపదికాలపై ఏర్పడ్డ పదాలు | స్త్రీ ప్రత్యయాంత ప్రాతిపదికాలపై ఏర్పడ్డ పదాలు |
|---|---|---|
| 1. భావక+సుప్=భావకః భావించువాడు. | స్త్రైణ+సుప్=స్త్రైణః స్త్రీసమూహము. | గంగా+సుప్=గంగా, గంగ. |
| 2. పఠన+సుప్=పఠనం- చదువుట. | పౌంస్న+సుప్=పౌంస్నః- పురుష సమూహము | గౌరీ+సుప్=గౌరీ, గౌరి. |
| 3. గతి+సుప్=గతిఃగతి,నడక | ఆశ్వపత+సుప్=ఆశ్వపతః- ఆశ్వపతుడు. | తనూ+సుప్=తనూః,శరీరం. |
| | గాంగేయ+సుప్=గాంగేయః గాంగేయుడు. | యువతి+సుప్=యువతిః-యువతి. |

4. రమణీయ+సుప్=
రమణీయం; అందమైనది

5. కర్తృ+సుప్=కర్తా-కర్త
పనిచేయువాడు.

6. ద్రష్టవ్య+సు=ద్రష్టవ్యం-
చూడదగినది.

ఇక్కడ ముందుభాగం ప్రాతిపదికం- 'సుప్' అనేది ప్రత్యయం. ఇలా ఏర్పడిన పదాన్ని సుబన్తపదం అంటారు

గార్గ్య+సుప్=గార్గ్యః-గార్గ్యుడు
దాక్షి+సుప్=దాక్షిః-దక్షపుత్రుడు
కౌరవ్య+సుప్=కౌరవ్యః
కౌరవ్యుడు.

ఇక్కడ తద్ధితాంతప్రాతిపదికాలకు సుప్ ప్రత్యయాలు చేరిస్తే సుబన్త పదాలు ఏర్పడ్డాయి.

ఇక్క స్త్రీప్రత్యయప్రాతిపదికాల పై సుప్ ప్రత్యయాలు చేరిస్తే సుబన్త శబ్దాలు ఏర్పడ్డాయి.

ఈ విధంగా పైన మూడు రకాల సుబన్త శబ్దాలు ఏర్పడం చూశాం కదా!

**సమాసప్రాతిపదికాలపై సుబన్తశబ్దాలు**

ఇవి కాక నాల్గవ రకం 'సమాసప్రాతిపదికాలు' అని ఉన్నాయి. పైన నిర్దేశించిన కొన్ని ప్రాతిపదికాలను ఒకటిగా కలిపితే సమాస ప్రాతిపదికాలేర్పడతాయి. అనేక శబ్దాలను ఒక శబ్దంలా అయేట్లు కలపడాన్ని సంస్కృతంలో సమాసం అంటారు. రెండు శబ్దాలనుంచి ఎన్ని శబ్దాలైనా ఇలా కలపవచ్చు. ఎలాగో చూడండి.

1) గంగా+గౌరీ = గంగాగౌరీ + ఔ = గంగాగౌర్యౌఇక్కడ గంగా- గౌరీ అనే రెండు ప్రాతిపదికాలు కలసి 'గంగాగౌరీ' అనే సమాసప్రాతిపదికం అయింది. దానికి 'ఔ' అనే సుప్ ప్రత్యయం చేరిస్తే 'గంగాగౌర్యౌ' అనే సుబన్తపదం తయారైంది. దీని సమస్త పదం అంటారు.

2) రమణీయ + యువతి = రమణీయ యువతి+సుప్ = రమణీయయువతిః అందమైనయువతి.

రమణీయ + గతి = రమణీయ గతి+సుప్= రమణీయగతిః, అందమైన నడక.

రమణీయ + స్త్రైణ = రమణీయస్త్రైణ+సుప్=రమణీయస్త్రైణః = అందమైన స్త్రీ సమూహము.

3) గౌరీ + తనూ = గౌరీతనూ+సుప్=గౌరీతనూః గౌరియొక్క శరీరము

4) గాంగేయ + పతన = గాంగేయపతన+సుప్ = గాంగేయపతనమ్ = భీష్ముని పతనము. ఇక్కడవేరే ప్రాతిపదికాలు, అంటే కృదన్త-తద్ధితాంత-స్త్రీప్రత్యయాంత ప్రాతిపదికాలు రెండేసి కలిపి సమాసప్రాతిపదికాలు తయారు చేసి వాటికి సుప్ ప్రత్యయాలు చేర్చాం ఇలా మూడేసి, నాల్గేసి ప్రాతిపదికాలు కూడా కలపచ్చు - ఎలాగో చూడండి

(ఎ) యువతి+తనూ+భావక=యువతితనూ భావక+సుప్=యువతితనూభావకః యువతి యొక్క శరీరాన్ని భావించేవాడు. ఇక్కడ మూడు ప్రాతిపదికాలు కలిపి ఒక సమాస ప్రాతిపదికం తయారు చేసి, దానికి సుప్ ప్రత్యయం చేర్చి వాడవచ్చు. వాక్యంలో ఇలా తయారైన సుబన్త పదం ఒకటైనా ఉండి తీరాలి.

**ఈ సుబన్త శబ్దాలను మరొక విధంగా గుర్తించవచ్చు.**

1) వస్తువులను బోధించే సుబన్తశబ్దాలు (పదాలు)

ఉదా : 1) బాలః 2) వృక్షః 3) పృథివీ 4) శకటమ్ 5) పుస్తకమ్ 6) ఫలమ్ 7) పత్రమ్ 8) గృహమ్ (9) లతా 10) ఛత్రమ్ 11) బాలా 12) వస్త్రమ్ 13 స్తంభః మొదలైనవి. కంటికి కనిపించేవి, కనిపించనివి అయిన అనేక విధాల వస్తువులను బోధించే శబ్దాలన్నీ సుబన్తపదాలే.

**2) వస్తువులలో ఉండే గుణాలను బోధించే సుబన్త పదాలు**

1) నీలః (నలుపు) 2) హ్రస్వః (పొట్టివాడు, పొట్టిది - ఇక్కడ గుణము ద్వారా వస్తువు బోధింపబడుతోంది) 3) హ్రస్వతా, హ్రస్వత్వమ్ (ఇది కేవలం గుణాన్ని మాత్రమే బోధించే పదం) 4) రక్తః 5)దీర్ఘః 6) లఘుః 7) మృదుః మొదలైనవి. వీటినే గుణవాచకాలు అని అంటారు.

**3) బంధుత్వాన్ని బోధించే సుబన్తపదాలు :**

1) మాతా 2) పితా 3) స్వసా (చెల్లెలు) 4) పతిః 5) పుత్రః 6) శ్వశురః (మామ) 7) శ్వశ్రూః (అత్త) 8) జామాతా (అల్లుడు) 9) మాతులః (మేనమామ) ఇలా బంధుత్వం బోధించే పదాలన్నీ సుబన్త పదాలే.

**4) 'సర్వనామ' సుబన్తాలు :** సాధారణంగా అన్ని వస్తువులను వ్యవహరించడానికి ఉపయోగించే పదాలు.

1) కిమ్ (ఏమి?) 2) సః (వాడు, అది) 3) యః (ఎవ్వడో, ఏదో) 4) ఏషః (వీడు, ఇది) 5)అసౌ (వాడు, అది) 6) సా (అది, ఆమె) 7) ఏషా (ఈమె, ఇది) 8) త్వం (నీవు) 9) అహమ్ (నేను) 10) ఇదం (ఇది) 11) అయమ్ (వీడు, ఇది) ఇలా చాలా పదాలున్నాయి (సర్వః, విశ్వః మొదలైనవి)ముందు తెలుసుకుందాం.

**5) సంఖ్యను బోధించే సుబన్త పదాలు**

1) ఏకః 2) ఏకా 3) ఏకం 4) ద్వౌ 5) ద్వే 6) త్రయః 7) త్రీణి 8) పంచ 9) షట్ ఇలా చాలా ఉన్నాయి.

**(6) క్రియను (Action) బోధించే సుబన్త పదాలు**

1) పాకః (వంట) 2) పచనం (వంట) 3) పాచకః (ఇక్కడ క్రియ ద్వారా వ్యక్తి బోధింపబడుతున్నాడు) 4) పఠనమ్ 5) పాఠః 6) దర్శనమ్ 7) గమనం (నడక) 8) భోజనం 9) గానమ్ 10) క్రీడనం 11) ధావనం (పరుగెత్తడం) ఇలా ఎన్నో సుబన్తాలున్నాయి.

**(7) అవ్యయసుబన్తాలు**

అవ్యయాలని పిలువబడే సుబన్తపదాలు కొన్ని ఉన్నాయి. తు,చ,హి,మొ॥ వాక్యాల్లో ఇన్ని రకాల సుబన్త పదాలను అవసరాన్ని బట్టి వాడవలసి ఉంటుంది.

**సుబన్తపదాలను తిజన్త పదాలతో కలపడం :-**

ఈ సుబన్త పదాలను తిజన్త పదాలతో కలిపితేనే గాని వాక్యం పూర్తికాదు. తిజన్త పదాలు : 'తిజ్' అని పిలువబడే 18 ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన పదాలను తిజన్త పదాలని అంటారు. భాషలో ఇవి సగం వంతు ఉంటాయి. 50% శాతం సుబన్త పదాలు + 50% తిజన్తపదాలు కలిసి అనేక విధ్యాల వాక్యాలుగా ఏర్పడతాయన్నమాట. తిజన్త పదాలనే క్రియాపదాలు అంటారు. ఈ పాఠం మొదట్లో టేబుల్లో సుబన్త పదాలు - తిజన్త పదాలు కలిసి వాక్యం ఎలా అయ్యాయో చూపించాంకదా! ఒకసారి మళ్లీ దాన్ని చూడండి. అక్కడ మూడు వాక్యాల్లో మూడు తిజన్త పదాలు ఇచ్చాము.

1. గచ్ఛతి - వెళ్లుతున్నాడు.
2. భాషతే - మాటాడుచున్నాడు.
3. పర్యవేక్షతే - పర్యవేక్షిస్తున్నాడు.

ఇక్కడ గమ్+అ+తి = మధ్యలో 'అ' ప్రత్యయం చేరి 'గచ్ఛతి' అయింది

భాష్+అ+తి = మధ్యలో 'అ' చేరింది. భాషతే అయింది.

పరి+అవ+ఈక్ష్+అ+తే=ఇక్కడ 'ఈక్ష్' అనేది ధాతువు. దానికి చూచుట అని అర్థం. దానికి ముందు 'పరి' 'అవ' అనే రెండు శబ్దాలు చేర్చబడ్డాయి. వీటిని ఉపసర్గములు అని అంటారు. వీటి గురించి విడిగా చెప్పుకుందాం. ఇవి క్రియాపదాలకు మాత్రమే చేర్చబడతాయి. ధాతువుకు 'తిజ్' అనే ప్రత్యయానికి మధ్య 'అ' అనే ప్రత్యయం చేరింది ఇటువంటి ప్రత్యయాలకే, వికరణ ప్రత్యయాలని పేరు.

ఇలా ఏర్పడ్డ తిజన్త శబ్దాలు (పదాలు) కొన్నివేలు ఉంటాయి. వీటిగురించి విడిగా పాఠాల్లోముందుముందు స్పష్టపరుపబడుతుంది. ఇంతవరకు సుబన్త పదాలంటే ఏమిటో, తిజన్త పదాంటే ఏమిటో స్థూలంగా చెప్పాము. సంస్కృతభాషలో ఉన్న పదాల్లో ఈ రెండు రకాల పదాలను తగిన విధంగా కలుపుతూ వాక్యాలు తయారుచేసి ప్రయోగించాలి. ఈ క్రింది వాక్యాలు మరొక్కసారి చూచి సుబన్త పదాలు తిజన్త పదాలు గుర్తించండి.

| సుబన్తాలు - | తిజన్తాలు | సుబన్తాలు - | తిజన్తాలు |
|---|---|---|---|
| 1)ఉపాధ్యాయః పాఠాన్ | పాఠయతి | 4) బాలాః చతురంగం | క్రీడన్తి |
| ఉపాధ్యాయుడు పాఠాలను చదివిస్తున్నాడు. | | బాలురు చదరంగం ఆడుతున్నారు. | |
| 2 విద్యార్థినః పుస్తకాని | పశ్యన్తి | 5) శిశుః ఉచ్చైః | రోదితి |
| విద్యార్థులు పుస్తకాలను చూస్తున్నారు. | | శిశువు బిగ్గరగా రోదిస్తున్నది. | |
| 3) వైద్యః రోగిణః | చికిత్సతే | 6) యజమానః భృత్యాన్ | ప్రేరయతి. |
| వైద్యుడు రోగులను చికిత్స చేస్తున్నాడు. | | యజమానుడు పనివాళ్లను ప్రేరిస్తున్నాడు. | |

ఈ క్రింది టేబుల్‌లో కృదంత ప్రాతిపదికాలపై ఏర్పడిన సుబన్త పదాలు, తద్ధితాన్త ప్రాతిపదికాలపై ఏర్పడ్డ సుబన్త పదాలు సమాసప్రాతిపదికలపై ఏర్పడిన సుబన్త పదాలు ముందు ముందు పాఠాల్లో గుర్తించేందుకు వీలుగా ఇవ్వడం జరిగింది. చూడండి.

మూడు రకాల సుబన్త పదాలు

| | కృదన్త పదాలు | | తద్ధితాంత పదాలు | | సమాస పదాలు | |
|---|---|---|---|---|---|---|
| | పదం - ప్రత్యయం | అర్థం | పదం-ప్రత్యయం | అర్థం | పదం | అర్థం |
| 1. | కుంభకారః (అణ్) | కుంభమును తయారు చేయువాడు | ఆశ్వపతమ్ (అణ్) | అశ్వపతియొక్క అపత్యం (సంతానం) | ఉపకృష్ణమ్ (అవ్య) | కృష్ణునికి దగ్గర |
| 2 | వాస్తవ్యః (తవ్య) | నివసించి ఉండువాడు | దైత్యః (ణ్య) | దితికుమారుడు. | అనురూపమ్ (అవ్య) | రూపానికి తగినది |
| 3 | నర్తకః:నర్తకీ (ష్వున్) | నర్తకుడు, నర్తకీ | స్త్రైణః (నఞ్) | స్త్రీ సమూహము. | కృష్ణశ్రితః (తత్పురుషః) | కృష్ణునాశ్రయించిన వాడు |
| 4 | ఏధితవ్యమ్ (తవ్య) | వృద్ధిచెందదగినది | పౌస్నః (స్నఞ్) | పురుషసమూహము. | గోహితమ్ (త.స) | గోవులకొరకుహితము |
| 5 | ప చేలిమాః(కేళిమర్) | పండినవి. | దాశరథిః(ఇఞ్) | దశరథపుత్రుడు. | రాజపురుషః (దా.స) | రాజుయొక్క పురుషుడు |
| 6 | చేయమ్, జేయమ్ (యత్) | ప్రోగుచేయదగినవి, జయింపదగినది. | వైనతేయః(ఢక్) | వినతాపుత్రుడు. | ఈశ్వరాధీనః (త.స) | ఈశ్వరుని యందు ఆధారపడినవాడు. |
| 7 | కార్యమ్, వర్జ్యమ్ (ణ్యత్) | చేయదగినది, విడువదగినది | క్షైరేయీ (ఢఞ్) | క్షీరములో సంస్కరింపబడినది. | | |
| 8 | కర్తా(తృచ్) కర్త్రీ | చేయువాడు/చేయునది | శతరుద్రీయమ్(ఛ) | శతరుద్రులుదేవతగా గలది. | పంచగవమ్ | ఐదుగోవుల సమూహము |
| 9 | కారకః/కారికా(ణ్వుల్) | చేయువాడు/చేయునది | శతరుద్రియమ్(ఘ) | " | మహానవమీ | గొప్పదైననవమి |
| 10 | నందనః(ల్యుట్) | కుమారుడు | వాయవ్యమ్ (యత్) | వాయువు దేవతగా గలది. | సత్కృత్య | సత్కరించి |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 11 | మంత్రీ,స్థాయీ(ణిని) | మంత్రి,స్థిరముగా నుండునది | మాతులః(డులచ్) | మేనమామ. | ద్విరాత్రమ్ | రెండురాత్రుల సమూహము |
| 12 | బుధః,కృశః(క) | తెలుసుకున్నవాడు చిక్కినవాడు | ఆగ్నేయం(ఢక్) | అగ్నిదేవతగలది. | | |
| 13 | జనమేజయః(ఖశ్) | జనులవృద్ధి పొందించు వాడు | వైదిశమ్(అణ్) | విదిశకు దగ్గరగా ఉన్న నగరం | పూర్వరాత్రః | రాత్రిపూర్వభాగము |
| 14 | ఆఢ్యంకరణమ్ (ఖ్యున్) | ధనవంతుని చేయుట | ఆథర్వణికః(ఠక్) | అథర్వణమును అధ్యయనము చేయువాడు. | పురుషవ్యాఘ్రః | వ్యాఘ్రము(పెద్దపులి) వంటి పురుషుడు. ఇంత వరకు తత్పురుష సమాసములు. |
| 15 | విద్,ధుక్,లిహ్(క్విప్) | తెలుసుకొనువాడు పితుకువాడు నాకువాడు | శాద్వలః(వలచ్) దాక్షిణాత్యః(త్యక్) | పచ్చికబైలు. దక్షిణదేశమున నున్నవాడు. | పీతాంబరః | పచ్చని బట్టగలవాడు బహువ్రీహి |
| 16 | పారదృశ్వా(క్వనిప్) | తుదిచూచువాడు | ఆరణ్యకః(వుఞ్) | అరణ్యమందుంటు న్నవాడు. | ప్రాప్తోదకః | (పొందబడిన ఉదకం గల (గ్రామము) |
| 17 | సరసిజమ్(డ) | పద్మము | యౌష్మాకీణః(ఖఞ్) | మీవాడు. | రూపవద్భార్యః | రూపవతియైన భార్య కలవాడు. |
| 18 | స్నాతమ్, స్తుతః(క్త) | స్నానము చేయబడినది స్తుతింపబడినాడు | ఆస్మాకీనః(ఖఞ్) | మావాడు. | | |
| 19 | క్షీణవాన్ (క్తవత్) | క్షీణించినవాడు | ప్రావృషేణ్యః(ఏణ్య) | వర్షాకాలమునందు పుట్టినది. | పద్మాక్షీ | పద్మమువంటి కన్నులు కలది. |
| 20 | పచమానః(శానచ్) | వండుచున్నవాడు | జాతుషమ్(షుక్) | లక్కతో నిండిన వస్తువు. | పంచాంగుళమ్ | ఐదు అంగుళులు పొడవు కలది. |
| 21 | పచన్(శతృ) | వండుచున్నవాడు | అశ్మమయమ్ (మయట్) | రాతితోనిండినది. | మహాయశాః | గొప్ప కీర్తి కలవాడు. |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 22 | అలంకరిష్ణుః (ఇష్ణుచ్) | అలంకరించు స్వభావం కలవాడు | ఆక్షికః(ఠక్) | పాచికలాడువాడు | మృదుభాషణః | మృదులమైన భాషణము కలవాడు. |
| 23 | జిష్ణుఃస్థాస్నుః(గ్స్నుః) | జయించు స్వభావం కలవాడు స్థిరముగాఉండే స్వభావం కలవాడు | దేవాగారికః(ఠఞ్) | దేవాగారమున నియోగింపబడినవాడు | వ్యూఢోరస్కః | విశాలమైన గుండె కలవాడు |
| | | | సర్వధురీణః(ఖ) | అందరి బరువు మోయువాడు | ఇంతవరకు బహువ్రీహి సమాసములు. | |
| | | | సార్వజనీనః(ఖఞ్) | సర్వజనులయందు సాధువైనవాడు | హరిహరగురవః | హరి-హర-గురువులు |
| 24 | నిందకః,హింసకః (ఉఞ్) | నిందించువాడు హింసించువాడు | సభ్యః(య) | సభలో సాధువు (యోగ్యుడు) | ధర్మార్థౌ | ధర్మార్థములు |
| 25 | జల్పాకః,వరాకః (షాకన్) | ఎక్కువగా మాట్లాడు లక్షణము కలవాడు, దీనుడు | | | రామకృష్ణౌ | రామకృష్ణులు |
| 26 | స్పృహయాళుః | కోరుస్వభావము కలవాడు | హృద్యః(యత్) | హృదయమునకు ప్రియమైనది | గవాశ్వమ్ | గోవులు,అశ్వాల సమూహము |
| | దయాళుః(ఆళుచ్) | దయా స్వభావము కలవాడు | | | | |
| 27 | జాగరూకః(ఊక) | మేల్కొన్నవాడు | పారిషద్యః(ణ్య) | పరిషత్తులో సాధువు యోగ్యుడు | హంసౌ | ఆడహంస-మగహంసలు |
| 28 | స్థావరః-ఈశ్వరః (వరచ్) | స్థిరముగా ఉండునది నియమించువాడు | నశ్యమ్(యత్) | ముక్కుకు హితమైనది | పితరౌ | తలిదండ్రులు |
| 29 | దాత్రమ్,నేత్రమ్ (ష్ట్రన్) | ఖండించునది, చూచునది | లౌకికః(ఠఞ్) | లోకమందున్నట్లు తెలిసినవాడు | భ్రాతరౌ | సోదరుడు,సోదరి ఇంతవరకు ద్వంద్వము ఏకశేషములు |
| 30 | భీతిః,రీతిః (క్తిన్) | భయము విధానము | పథికః (ష్కన్) | మార్గమునవెళ్ళువాడు వెళ్ళునది | | |

| | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి - | రామ + సు = రామః<br>(రాముడు) | రామ + ఔ = రామౌ<br>(ఇద్దరురాములు) | రామ + జస్ = రామాః<br>(అనేకమంది రాములు) |
| ద్వితీయావిభక్తి | రామ + అమ్ = రామమ్<br>(రాముని) | రామ + ఔ = రామౌ<br>(ఇద్దరురాములను) | రామ + శస్ = రామాన్<br>(అనేకమంది రాములను) |
| తృతీయావిభక్తి- | రామ + టా = రామేణ<br>(రాముని చేత) | రామ + భ్యాం = రామాభ్యాం<br>(ఇద్దరు రాముల చేత) | రామ + భిః = రామైః<br>(అనేకమంది రాములచేత) |
| చతుర్థీవిభక్తి- | రామ + ఙే = రామాయ<br>(రాముని కొరకు) | రామ + భ్యాం = రామాభ్యాం<br>(ఇద్దరు రాముల కొరకు) | రామ + భ్యస్ = రామేభ్యః<br>(అనేకమంది రాములకొరకు) |
| పంచమీ విభక్తి- | రామ + ఙసి = రామాత్<br>(రాముని వలన) | రామ + భ్యాం = రామాభ్యాం<br>(ఇద్దరు రాముల వలన) | రామ + భ్యస్ = రామేభ్యః<br>(అనేకమంది రాములవలన) |
| షష్ఠీ విభక్తి | రామ + ఙస్ = రామస్య<br>(రామునికి, యొక్క) | రామ + ఓస్ = రామయోః<br>(ఇద్దరు రాములకు) | రామ + ఆమ్ = రామాణాం<br>(అనేకమంది రాములకు) |
| సప్తమీ విభక్తి- | రామ + ఙి = రామే<br>(రామునియందు) | రామ + ఓస్ = రామయోః<br>(ఇద్దరురాముల యందు) | రామ + సుప్ = రామేషు<br>(అనేక రాముల యందు) |

ఇలా ప్రతిప్రాతిపదికానికి 21 ప్రత్యయాలు, ఏడు విభక్తుల్లో, మూడు వచనాల్లో చేర్చుతూపోతే అపారమైన సుబన్త పదరాశి ఏర్పడుతుంది. ఇక్కడ ప్రకృతి 'రామ'అనేది. దానికి 21 ప్రత్యయాలు ప్రక్కన చేర్చాం. సంధివల్ల కొద్దిగా మార్పు జరిగి 21 రూపాలు ఏర్పడ్డాయి. ఇలా శబ్దాలు తయారు చేసే విధానాన్ని వ్యాకరణశాస్త్రంలో పాణినిమహర్షి మున్నగువారు నిర్దేశించారు. **వారి మాటలే ఈ** విధానానికి ప్రమాణం. దీన్నే ముందు వివరించడం జరిగింది.

# సుప్ ప్రత్యయాలు - సుబన్త పదాల గురించి మరికొంత

వెనుక పాఠంలో సంస్కృత భాషలో పదాలు రెండు రకాలుగా ఉన్నాయని అవి సుబన్త పదాలు 2) తిఙన్త పదాలు అని చెప్పడం జరిగింది. ఈ రెండు రకాల పదాలు మొత్తం భాషలో ఇంచుమించుగా సమానంగా ఆక్రమించి ఉన్నాయి.

ఇవికలిస్తే 'వాక్యాలు' ఏర్పడతాయి, వాక్యాలనే మనం లోకవ్యవహారంలోగాని ఇతరత్రగాని ప్రయోగిస్తాం. ఈ రెండు రకాల పదాలలో 1) సుబన్త పదాలు అనేవి కొన్ని ప్రాతి పదికాలకు ప్రక్కన 'సుప్' అని పిలువబడే కొన్ని ప్రత్యయాలు చేర్చగా ఏర్పడతాయని కూడా చెప్పడం జరిగింది. వీటికేవిభక్తి ప్రత్యయాలని పేరు.

ఇక్కడ మరికొంత వివరంగా సుబన్త పదాలు తయారవడానికి చేర్చవలసిన సుప్ ప్రత్యయాలు ఏమిటో, తెలుసుకుందాం. ముందు ముందు పాఠాల్లో వీటిని గుర్తించడం చాలా అవసరం. సుప్ప్రత్యయాలు - వాటివల్ల ఏర్పడే పదాలు గుర్తించడానికి. రామశబ్దాన్ని తీసుకుందాం.

**సుప్ ప్రత్యయాలకు అర్థాలు**

'సుప్' ప్రత్యయాలు చేర్చగా సుబన్త పదాలు ఏర్పడ్డాయి కదా! ఆ 21వ సుప్ ప్రత్యయాలకు అర్థాలేమిటో? తెలుగు విభక్తి ప్రత్యయాలతో పోల్చి గ్రహించవచ్చు.

20వ పేజీలో ఇచ్చిన టేబుల్‌లో ఇచ్చినప్పటికీ మరికొంత విశేషంగా తెలుగులో మనంలోకవ్యవహారంలోవాడుతూ ఉన్న విభక్తి ప్రత్యయాలతో సంస్కృతవిభక్తి ప్రత్యయాలను పోల్చి అర్థాలు గ్రహించితే ఎక్కడైన వాక్యప్రయోగాల్లో వాటిని సులువుగా గుర్తించడం వీలవుతుంది. అందుకోసం మరికొంత విపులంగా ఈవిభక్తి ప్రత్యయాలగురించి ఇక్కడ ఇవ్వడం జరుగుతున్నది. ఏక-ద్వి-బహువచనాలుముందు ఇచ్చి - ప్రక్కన సంస్కృతప్రత్యయాలు, వాటి అర్థాలు ఇచ్చాం.

1. ప్రథమావిభక్తి.

ఏక.వ - సు - డు,ము,వు - రామః‌రాముడు; వృక్షః = వృక్షము, ధేనుః=ధేనువు(గోవు)

ద్వి. ఔ లు రామౌ-ఇద్దరు రాములు - వృక్షౌ - రెండువృక్షాలు

బహు. జస్ రామాః - అనేకమంది రాములు; వృక్షాః - అనేక వృక్షాలు.

2. ద్వితీయా విభక్తి -

ఏవ.వ - అమ్ - ని,ను,కూర్చి,గురించి - రామమ్ -రాముని, హరిమ్-హరిని,రాముని కూర్చి రామునిగురించి, వృక్షమ్-వృక్షమును,గురించి.

ద్వి. - ఔట్ - లన్‌ల రామౌ-ఇద్దరురాముల, కూర్చి, గురించి అనికూడా చేర్చవచ్చు.

బహు - శస్ రామాన్-రాముల, రాముల కూర్చి, రాముల గురించి

3. తృతీయావిభక్తి

ఏక. టా- చేత, చే, తోడ,తో - రామేణ రామునిచేత, రామునిచే, రామునితోడ, రామునితో

ద్విః భ్యాం (ల) చేత (ల) చే (ల) తోడ (ల) తో - రామాభ్యాం-ఇద్దరు రాములచే, చేత, తో, తోడ

బహుః భిస్ రామైః రాములచేత (తో,తోడ)

4. చతుర్థీ విభక్తి

ఏక - ఙే -కొరకు, కై, రామాయ = రామునికొరకు, కై.హరయేవిష్ణువుకై,కొరకు

ద్వి - బ్యామ్ రామాభ్యాం = ఇద్దరు రాములకొరకు, కై

బహు - భ్యస్ రామేభ్యః - రాముల కొరకు, కై

5. పంచమీ విభక్తి

ఏక. ఙసి - వలన, కంటె, పట్టి - రామాత్=రామునివలన, కంటె,పట్టి

ద్వి. భ్యాం (ల) వలవ(ల)కంటె, (లపట్టి) రామాభ్యాం-ఇద్దరు రాముల వలన, కంటె, పట్టి

బహు, భ్యస్ రామేభ్యః - రాములవలన, కంటె, పట్టి.

6. షష్ఠీ విభక్తి

ఏక - ఙస్ - కి,కు,యొక్క, లో,లోపల. రామస్య-రామునకు, హరేః-హరికి, యొక్క, హరియొక్క..

ద్వి - ఓస్ -పైప్రత్యయాలే, ముందు 'ల' చేరుతుంది. రామయోః ఇద్దరు రాములకు, ఇద్దరు రాములయొక్క

బహు-ఆమ్ రామాణామ్ - రాములకు, రాములయొక్క, లోపల,లో.....

7. సప్తమీ విభక్తి

ఏక.-ఙి -అందు,న -రామే=రామునియందు, వృక్షే=వృక్షమునందు, హరౌ=హరియందు..

ద్వి. ఓస్ ఈ ప్రతయాలకేముందు రామయోః ఇద్దరు రాములయందు
బహు.సుప్ 'ల' చేరుతుంది రామేషు - రాములయందు
ఇతంతవరకు 'సుప్' ప్రత్యయాలంటే ఏమిటో, తెలుగులో వాటికి సమానంగా ఉండే ప్రత్యయాలు ఏమిటో చెప్పడం జరిగింది. ఇలా రామ మొదలైన ప్రాతిపదికాలకు, సుప్ ప్రత్యయాలు చేర్చి సుబన్త శబ్దాలు కొన్నివేలు తయారు చేయవచ్చు. ఈ ప్రత్యయాలు అన్ని లింగాల్లోనూ చేరుతాయి. అయితే రూపాల్లో కొంత మార్పులు ఉంటాయి. ముందు ముందు పాఠాల్లో ఆ తేడాలను క్రమంగా గుర్తించవచ్చు. ప్రతివాక్యంలోను తప్పనిసరిగా ఒకటో రెండో ఇంకా ఎక్కువో సుబన్త పదాలు ఉండి తీరాలి.

రామశబ్దాన్ని చూచి ఇలాగే మిగతా శబ్దాలను గుర్తించేందుకు, ముఖ్యంగా చివర ఉన్న సుప్ ప్రత్యయాలు గుర్తించేందుకు ప్రయత్నం చేయాలి. అప్పుడు సుబన్త పదాలు పరిచయమౌతాయి. ఇక్కడ ఒక విశేషాన్నిగుర్తించాలి.
ఏమిటంటే - కొన్ని సుబన్తాలకు మూడు వచనాల్లోనూ రూపాలుంటాయి. కొన్నింటికి ఏకవచనం లేదా ఏవో రెండు వచనాలకు సంబంధించిన ప్రత్యయాలు చేరుతాయి.

ఎ) ఏకః (పుం. లిం.)
ఏకా (స్త్రీ.లిం.)
ఏకమ్ (న.పుం)

ఈ శబ్దానికి -దివచన - బహు వచన ప్రత్యయాలు చేరవు.

ద్వివచనం మాత్రమే కల శబ్దాలు
1) ద్వౌ (పుం.)
ద్వే (స్త్రీ-న.పుం)
2) ఉభౌ (పుం)
ఉభే (స్త్రీ.న.పుం)

ద్విఉభఅనేసంఖ్యావాచకాలైన ఈ శబ్దాలకు - ఏకవచన - బహు వచన ప్రత్యయాలు చేరవు.

బి) బహువచన ప్రత్యయాలు మాత్రం కలశబ్దాలు. వీటికి ఏకవచన-ద్వివచనాలుండవు.
1) దారాః (పుం) (భార్య)
2) ఆపః (స్త్రీ.) (నీరు)
3) త్రయః త్రీణి (న.పుం.) తిస్రః (స్త్రీ) (పుం.) 4) చతుర్ 5) పంచన్ 6) షట్
7) సప్తన్ 8) అష్టన్ 9) నవన్ 10) దశన్ ఈ శబ్దాలన్నీ
కేవలం బహువచన ప్రత్యయాలతో మూడు లింగాలలోను రూపాలు కలిగి ఉంటాయి

ఇలాగే - 11) గృహాః (పుం) (ఇళ్లు) 12) బహవః (పుం) (అనేకులు) 13) **కతి (పుం.)** (ఎన్ని) అనేవి బహువచనంలో మాత్రమే ఉండే శబ్దాలు. ఈ శబ్దాల పూర్తి **రూపాలు** వాటి ప్రయోగాలు ముందు పాఠాల్లో స్పష్టపరుపబడతాయి.

ఏవో రెండు వచనాల్లో రూపాలుండే సుబన్త శబ్దాలు.

1) ఉభయః (పుం.) ఈ శబ్దం ఏకవచన - బహువచన **ప్రత్యయాలతో** మాత్రమే కూడి ఉంటుంది. పైన పేర్కొన్న శబ్దాలన్నీ సుబన్త పదాలే.

3) అవ్యయాలు, లేక నిపాతములు అని పిలువబడే శబ్దాలు కూడా **సుబన్త పదాలే.** అయితే వీటికి చివర సుప్ ప్రత్యయాలు చేర్చి లోపింపచేయబడతాయి. **అందువల్ల** ప్రత్యయాలు చేర్చినందువల్ల వచ్చే మార్పు ఏమీ ఉండదు.

ఈ అవ్యయాలు మూడు రకాలుగా ఉన్నాయి.

ఎ) కృదంతా వ్యయాలు - అంటే ధాతువుల కంటే కొన్ని కృత్ ప్రత్య**యాలు చేర్చడం** వలన ఏర్పడిన శబ్దాలు కృదంతా వ్యయాలుగా పరిగణింపబడ్డాయి.

ఉదా : శ్రుత్వా, గత్వా, పీత్వా (క్త్వా అనే ప్రత్యయాలు చేర్చినవి)

అధిగత్య, నిపీయ, విజ్ఞాయ (ల్యప్ అనే ప్రత్యయం చేరినవి)

భవితుం గన్తుం శ్రోతుమ్ (తుమున్ అనే ప్రత్యయం చేరినవి)

ఇవన్నీ కృత్ ప్రత్యయాన్తాలైన అవ్యయాలు. వీటిని సుబన్త **పదాలు**గానే పరిగణిస్తారు.

బి) తద్ధితాంతవ్యయాలు :- కృదంత శబ్దాలమీద, ఇంకా ఇతర శబ్దాల **మీద, వేరువేరు** 'తద్ధిత' ప్రత్యయాలు చేరిస్తే ఏర్పడ్డ కొన్ని తద్ధిత ప్రత్యయాన్త శబ్దాల**ను కూడా** అవ్యయాలుగా పరిగణించారు. ఇవి చాలా ఉన్నాయి. కొన్ని ప్రసిద్ధ**మైనవి.**

(a) సర్వత్ర, యత్ర కుత్ర మొదలైన 'త్రల్' ప్రత్యయాన్త శబ్దాలు.

(b) హకారాన్తాలు - ఇహ, కుహ మొదలైనవి.

(c) 'దా' అనేది చివర కలవి - సర్వదా, యదా, తదా, కదా, మొదలైనవి

(d) 'దానీమ్' అనేది చివర కలది - ఇదానీం, తదానీం - మొదలైనవి.

(e) 'ధా' చివరకలవి - బహుధా, ద్విధా, ఏకధా, సర్వధా మొదలైనవి.

(f) అతసుచ్ ప్రత్యయాన్తాలు - దక్షిణతః, ఉత్తరతః మొదలైనవి.
(g) 'శస్' ప్రత్యయం చివర కలవి - బహుశః; అల్పశః, అంశశః, విభాగశః ఇత్యాదులు చాలా ఉన్నాయి. ఇవన్నీ అవ్యయాలే. అంటేలింగం, విభక్తి, వచనంలేనివి.

వీటి ప్రయోగాల గురించి విడిగా ఒక పాఠంలో చెప్పడం జరుగుతుంది. ఇటువంటి 'తద్ధితప్రత్యయాలు' అని వ్యవహరింపబడే ప్రత్యయాలతో కూడిన శబ్దాలను కూడా కొన్నింటికి అవ్యయాలుగా పరిగణించారు. ఇవీ సుబన్త శబ్దాలే.
(3) అవ్యయీభావ సమాసావ్యయాల్చు.
సమాసాలలో అవ్యయీభావ సమాసం అని ఒకటి ఉన్నది. ఆ సమాసం చేయగా ఏర్పడ్డ శబ్దాలను కూడా అవ్యయాలని అంటారు.
ఉదా :- పరోక్షమ్, ఉపకృష్ణమ్, అనుగంగమ్, యథాశక్తి ఇత్యాదులు.

ఈ విధంగా మూడు రకాలైన అవ్యయాలు (కృదంతావ్యయాలు, తద్ధితాంతావ్యయాలు, అవ్యయీభావ సమాసావ్యయాలు) సుబన్త పదాలే. అంటే వీటికి చివర సుప్రత్యయాలు చేర్చబడ్డాయన్నమాట. కొన్నిచోట్ల అవి వినిపించవు. కొన్ని చోట్ల వాటి స్వరూపం మారిపోతుంది. వీటి విశేషాలు ముందుముందు విడిగా స్పష్టపడగలవు.

ఇంతవరకు సుబన్త పదాలు ఎలా ఏర్పడేదీ విశదీపరచడం జరిగింది. ఇంతవరకు చెప్పిన విషయాన్ని బట్టి సుబన్త పదాలకు సంబంధించి ఈ క్రింది విభాగం స్పష్టపడుతున్నది.

1) కృదన్తప్రాతిపదికాలపై తయారైన సుబన్త పదాలు.

2) తద్ధితాన్త ప్రాతిపదికాలపై తయారైన సుబన్త పదాలు.

3) సమాసప్రాతిపదికాలపై తయారైన సుబన్త పదాలు

1) వీటిలోనే కొన్ని మూడు వచనాలలో రూపాలున్న సుబన్త పదాలు.

2) ఏదో ఒకే వచనం కల సుబన్త పదాలు.

3) రెండు వచనాలు కల సుబన్త పదాలు.

4) అవ్యయాలైన (సుప్ప్రత్యయాలు లోపించి, లేదా స్వల్పమైన మార్పుచెందిన) సుబన్త పదాలు అంటే ఏవచనాలు లేని సుబంతాలు.మరొకవిశేషం-
పైన ఉదాహరించిన రామ శబ్దరూపాల్లో సుప్ప్రత్యయాలు 21లో కొన్ని స్పష్టంగా కనిపిస్తున్నాయి.

రామ + ఔ రామౌ; రామ + అమ్ = రామమ్

రామ + ఔట్

రామ + భ్యాం = రామాభ్యాం ; రామ + భ్యస్ = రామేభ్యః

రామ + ఓస్ = రామయో(స్)ః - రామ + సు(ప్) = రామేషు, రామ + ఆమ్ రామాణామ్

ప్రథమా ద్వితీయా విభక్తుల్లో ద్వివచనరూపాల్లో 2) రామౌ అనేచోట; తృతీయా, చతుర్థీ పంచమీ విభక్తుల్లో రామాభ్యాం అనేచోట ద్వివచనంలోను, చతుర్థీ పంచమీ బహు వచనాల్లో - రామేభ్యః అనే చోట, షష్ఠీ-సప్తమీ ద్విచనాల్లో రామయోః అనేచోట, షష్ఠీ బహువచనంలో రామాణామ్ అనేచోట, సప్తమీ బహువచనంలో రామేషు అనేచోట - చివర మిగిలినవి సుప్ప్రత్యయాలే. మిగిలిన రూపాల్లో సంధివశంగా మార్పుచెంది రామ+జస్ (అస్); రామ+ఙి (ఇ) అనేచోట సుప్ప్రత్యయాలున్నాయి. కాని అవి - రామాః (అస్) అలాగే, రామే (ఇ) అనేచోట్ల కనిపించడంలేదు. శబ్దంలో కలిసినాయి. మిగిలిన చోట్ల ప్రత్యయాల స్థానాల్లో వేరే శబ్ద స్వరూపం కనిపిస్తున్నది. ఈ శబ్దాల అంతాలను గుర్తించడం ద్వారా 21 రూపాలను గుర్తుపెట్టుకోవాలి. అకారాన్త శబ్దాన్ని ఒక దాన్ని గుర్తు పెట్టుకొంటే కొన్ని వందల శబ్దాలు తెలుసుకోవచ్చు. రామ శబ్దాన్ని చూచి, కృష్ణః వృక్షః గోవిందః మాధవః గుహః స్కందః హరః, శివః, దేవః, స్తంభః, గ్రంథః , శుకః, ఇలా అకారాన్త శబ్దాలను చెప్పడం అలవాటు చేసుకొని అభ్యాసం చేస్తే మూల శబ్దాలకు వాటికి చేర్చే సుప్ప్రత్యయాలకు ఉన్న సంబంధం, రూపాలు ఎలా ఏర్పడుతున్నాయో సామాన్యంగా తెలుస్తుంది. ఇలాగే స్త్రీలింగ నపుంసక లింగ శబ్దాలు రెండు రావాలి. వాక్య నిర్మాణానికి వెళ్లేముందు మరి రెండు శబ్దాలు మనం నేర్చుకోవలసిఉంది.. అవి 1)యుష్మద్ - అస్మద్ అనేవి మౌళిక శబ్దాలు కాగా వీటికి సు-ఔ-జస్ మొదలైన 21 ప్రత్యయాలూ చేరిస్తే రూపాలు ఇలా తయారయ్యాయి.

**యుష్మద్ శబ్దం దకారాన్తం మూడు లింగాల్లోను సమానం, నీవు అని అర్థం.**

| ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|
| ప్ర.వి- త్వమ్ (నీవు) | యువామ్ (మీరిరువురు) | యూయమ్ (మీరందరు) |
| ద్వి.వి.- త్వాం;త్వా(నిన్ను) | యువామ్;వామ్(మీఇరువురను) | యుష్మాన్;వః(మీరందరిని) |
| తృ.వి.- త్వయా (నీచేత) | యువాభ్యాం (మీరిద్దరిచేత) | యుష్మాభిః (మీరందరిచేత) |
| చ.వి.- తుభ్యం;తే (నీకొరకు) | యువాభ్యాం(మీరిద్దరికొరకు) | యుష్మత్ (మీరందరికొరకు) |
| పం.వి.-త్వత్ (నీవలన) | యువాభ్యాం (మీరిద్దరివలన) | యుష్మత్ (మీరందరివలన) |
| ష.వి- తవ; తే(నీకు | యువయోః, వాం (మీఇద్దరికి) | యుష్మా కం;వః(మీఅందరికి) |
| స.వి.-త్వయి (నీయందు) | యువయోః(మీఇద్దరియందు) | యుష్మాసు (మీ అందరియందు) |

ఇక్కడ కొన్నిచోట్ల రెండేసి రూపాలున్నాయి. అర్థాలు ఒకటే.

దీనిలాగే నేను అనే అర్థం కల అస్మద్ అనే శబ్దం కూడా నేర్చుకోవాలి. దీనికి పైలాగానే సుప్ ప్రత్యయాలు చేరిస్తే ఇలా రూపాలుంటాయి. ఇదీ దకారాన్తమే. మూడు లింగాల్లోనూ ఇలాగే రూపాలుంటాయి.

| ఏకవచనం. | ద్వివచనం | బహువచనం. |
|---|---|---|
| ప్రవి. అహమ్ (నేను) | ఆవామ్ (మేమిరువురం) | వయం (మేమందరం) |
| ద్వి.వి. మామ్, మా (నన్ను) | ఆవామ్,నౌ (మా ఇద్దరిని) | అస్మాన్,నః(మమ్ములను) |
| తృవి. మయా(నాచేత) | ఆవాభ్యాం(మా ఇద్దరిచేత) | అస్మాభిః (మా అందరిచేత) |
| చ.వి. మహ్యాం;మే(నాకొరకు) | ఆవాభ్యాం, నౌ(మా ఇద్దరికొరకు) | అస్మభ్యం;నః(మాఅందరికొరకు) |
| పం.వి. మత్ (నావలన) | ఆవాభ్యాం (మా ఇద్దరివలన) | అస్మత్(మా అందరివలన) |
| ష.వి. మమ,మే(నాకు,నాయొక్క) | ఆవయోః,నౌ(మాఇద్దరికి, మా ఇద్దరియొక్క) | అస్మాకం,నః(మాకు,మాయొక్క) |
| స.వి. మయి (నాయందు) | ఆవయోః(మాఇద్దరియందు) | అస్మాసు (మాయందు) |

ప్రస్తుతం వాక్య నిర్మాణానికి ప్రథమావిభక్తి రూపాలు సరిపోతాయి. అయినా ముందు ముందు ఈ శబ్దాలు రెండూ చాలా అవసరపడతాయి. కనుక ఇక్కడే పూర్తిగా వాటిని పరిచయం చేయడం జరిగింది. ఈ శబ్దాలను సర్వనామ శబ్దాలంటారు.అందరికీ వాడదగ్గవన్నమాట ఇవీ సుబన్త శబ్దాలే. ఈ రెండు శబ్దాల రూపాలు పోల్చి చూడండి పోలిక, తేడా రెండూ తెలుస్తాయి. త్వమ్-అహమ్; త్వాం,మామ్;ఇలా అన్ని రూపాలూ పోల్చి చూడండి.

# ధాతువులు - తి జన్త పదాలు

సంస్కృత భాషలో రెండు రకాలుగా పదాలు ఉన్నాయని సుబన్త - తిజన్త పదాలని చెప్పడం జరిగింది. వాటిలో సుబన్త పదాలగురించి, ఏర్పడే విధానం గురించి చెప్పడం జరిగింది. ఇప్పుడు రెండవ రకానికి చెందిన పదాలను అంటే తిజన్త పదాలను గురించి చెప్పుకుందాం. ఏ అక్షర సముదాయానికి చివర 'తిజ్' అని వ్యవహరింపబడే ప్రత్యయాలు చేర్చితే తిజన్త పదాలు ఏర్పడతాయో ఆ అక్షర సముదాయాన్ని వ్యాకరణ శాస్త్ర కారులు 'ధాతువు' అని వ్యవహరిస్తారు. ఈ ధాతువులను (మౌళికశబ్దసముదాయాన్ని) 'పాణిని' 'మహర్షి' ధాతుపాఠంగా అందించాడు. ఈ ధాతుపాఠంలో 1967 ధాతువులు ఉన్నాయి. ప్రతిధాతువుకు అర్థం కూడా నిర్దేశింపబడి ఉంది. "భూ - సత్తాయామ్" (ఉనికి అనే అర్థంలో ఉన్నది), ఇత్యాదిగా ధాతువుల నిర్దేశం జరిగింది. ఇవి మాత్రమే కాక సూత్రాలలో మరికొన్ని ధాతువులు నిర్దేశింపబడ్డాయి. వీటిని కూడా చేరిస్తే ఈ ధాతువులు 2650 ఉన్నాయని ఒక పరిగణనం ఉంది. ఆంగ్లంలో వీటిని Roots అంటారు.

ఏ భాషలోను ఇంత స్పష్టమైన ధాతుపరిగణనం లేదు. సంస్కృతవ్యాకరణ విధానాన్ని అనుసరించి ఇతర భారతీయ భాషల్లో కూడా, ఈ ధాతుపరిగణనం అంత సమగ్రంగా కాకపోయినా ఉన్నది. శాకటాయనుడనే పాణినికంటే ముందు వాడైన వ్యాకరణాచార్యుని మతంలో సంస్కృతభాషలోని ప్రతిపదం ఈ ధాతువు నుండే ఏర్పడుతుంది. ధాతువులన్నీ క్రియలను (పనిని) బోధిస్తాయి. ఈ ధాతువులనుండి తయారైన సుబన్త పదాలు కూడా ఉంటాయని వెనుక చెప్పడం జరిగింది. ఆ సుబన్త శబ్దాలు క్రియను అప్రధానంగాను, ఆ క్రియతో కూడిన కర్త, కర్మ మొదలైన, క్రియతో కూడిన వస్తువులను ప్రధానంగాను బోధిస్తాయి. క్రియకు ప్రాధాన్యం, ఈ ధాతువులకు తిజ్లలని చెప్పబడే ప్రత్యయాలు చేర్చినప్పుడే కలుగుతుది. ఈ స్థలంలో బోధింపబడే క్రియ భూతకాలం, వర్తమాన కాలం, భవిష్యత్ కాలం అనే మూడు కాలాలలో ఉంటుంది. విధి, ఆశీస్సు, మొదలైన అర్థాలను గూడా ఈ క్రియా పదాలు బోధిస్తాయి. ఈ కాలం మొదలైన అర్థాలను బట్టి శాస్త్ర కారులు ధాతువుల ప్రయోగాలను పది సంజ్ఞలద్వారా సులభంగా గుర్తు పెట్టుకునేట్లు చెప్పారు. వాటికి 'లకారాల"ని పేరు. లట్,విట్,లుట్,ల్ృట్,లేట్, లోట్, లజ్ లిజ్, లుజ్ ల్ృజ్ అని వాటిని వ్యవహరిస్తున్నారు వీటిలో 'లేట్' అనే లకారం వేదంలోనే ఉంటుంది. లోకంలో

ఉండదు. మిగిలిన. వాటిలో 'లిఙ్' అనేది రెండు రకాలు. కనుక లోకంలో కూడా 10 లకారాలున్నాయని సామాన్యంగా తెలుసుకుంటే చాలు. ముందు ముందు విశేషంగా తెలుసుకోవచ్చు.

**తిఙన్త పదాలు - తిఙ్ప్రత్యయాలు**

భాషలో సుబన్త పదాల గురించి తెలుసుకున్న తరువాత, తిఙన్త పదాల గురించి తెలుసుకోవాలని వేరే చెప్పనక్కర్లేదు. ఇవి లేనిదే వాక్య సమాప్తి లేదు కదా! 'తిఙ్' అని వ్యవహరింపబడే 18 ప్రత్యయాలున్నాయి. వీటిని ధాతువుల ప్రక్కన చేరిస్తే తిఙన్త శబ్దాలు తయారు అవుతాయి.

ఆ ప్రత్యయాలు ఇవి.

1)తిప్ - తస్ - ఝి |సిప్ - థస్ - థ |మిప్ - వస్ - మస్ |ఈ 9 ప్రత్యయాలను పరస్మైపద ప్రత్యయాలని అంటారు.

2)త - ఆతామ్ - ఝ | థాస్ - ఆథామ్ - ధ్వమ్ | ఇట్ - వహిఙ్ - మహిఙ్

ఈ 9 ప్రత్యయాలను ఆత్మనే పద ప్రత్యయాలని అంటారు. ధాతువులపై ఈ ప్రత్యయాలు చేర్చాలని చెప్పడం జరిగింది. ఇలా చేర్చినప్పుడు ఏర్పడేవి తిఙన్త పదాలు. వీటిని భాషలో ప్రయోగిస్తాం. ఇవే క్రియను ప్రధానంగా బోధిస్తాయి కనుక క్రియా పదాలు అంటారు. ధాతువులు 3 రకాలుగా ఉన్నాయి.

1) పరస్మై పది ధాతువులు (2) ఆత్మనే పదిధాతువులు (3) ఉభయ పది ధాతువులు. (వీటి వివరాలు ముందు ముందుస్పష్ట పడగలదు.)

1) పరస్మై పదిధాతువులకు, ముందు నిర్దేశించిన 'తిప్' మొదలైన 9 ప్రత్యయాలు చేరిస్తే 9 రూపాలు ఏర్పడతాయి. ఉదా :

ప్ర.పు - భూ + తిప్ = భవతి  భూ + తస్ = భవతః  భూ + ఝి = భవన్తి
మ.పు, భూ + సిప్ = భవసి  భూ + థస్ = భవథః  భూ + థ = భవథ
ఉ.పు. భూ + మిప్ = భవామి  భూ + వస్ = భవావః  భూ + మస్ = భవామః

ఇలా ప్రతి పరస్మై పది ధాతువుకు రూపాలు తయారు చేయవచ్చు.

2) ఆత్మనే పది ధాతువులకు 2వ వరుసలోని 9 ప్రత్యయాలు చేరిస్తే 9 రూపాలు తయారౌతాయి. చూడండి. ఏధ్ = వృద్ధౌ (వృద్ధిచెందుట) అనే ధాతువుకు ఆత్మనే పది ప్రత్యయాలు చేరిస్తే

ప్ర.పు. ఏధ్ + త = ఏధతే; ఏధ్ + ఆతామ్ = ఏధేతే; ఏధ్ + ఝ = ఏధన్తే
మ.పు ఏధ్ + థాస్ = ఏధసే; ఏధ్ + ఆథామ్ = ఏధేథే; ఏధ్ + ధ్వమ్ = ఏధధ్వే
ఉ.పు. ఏధ్ + ఇట్ = ఏధే; ఏధ్ + వహిజ్ = ఏధావహే; ఏధ్ + మహిజ్ = ఏధామహే

ఈ పైని పేర్కొన్న పరస్మై పది - ఆత్మనే పది - ధాతువులు, వాటి కిచెందిన ప్రత్యయాలు చేరిస్తే కొద్దిపాటి మార్పులు జరిగి రూపాలేర్పడ్డాయి. వీటిని తిజన్త పదాలని అంటారు. ప్రస్తుతం ఉదాహరణంగా ఇచ్చిన రెండు రకాల రూపాలు వర్తమాన కాలాన్ని అంటే ప్రస్తుతం ఆపని జరుగుతున్న కాలాన్ని బోధిస్తాయి. ఈ ప్రత్యయాలనే ఉపయోగించి భూతకాలం, భవిష్యత్ కాలం, వాటితో పాటు లోక వ్యవహారంలో ఉన్న అనేక అర్థాలను బోధించవచ్చు. అయితే ఆయాకాలాలు, లేదా ఆయా అర్థాలు బోధించేటప్పుడు ఇవే ధాతువుల చివరి భాగాలు మారతాయి. ఇంకా స్వల్పమైన మార్పులు వస్తాయి.

ఈ విధంగా సామాన్యంగా ఒక్కొక్క ధాతువు, పదిరకాల అర్థ విశేషాలను బోధిస్తూ 10×9=90 రూపాలు పొందవచ్చును. ఇలా 'భూ'ధాతువుకు 90రూపాలు, 'ఏధ్' ధాతువుకు 90రూపాలు తయారు చేయవచ్చును. వీటికి అన్నిటికీ అర్థాలు వేరుగానే ఉంటాయి. కొన్ని రూపాలు మూడవ వ్యక్తితో లేదా వస్తువుతో అన్వయిస్తాయి. కొన్ని రూపాలు ఎదుటి వ్యక్తితో, వస్తువుతో అన్వయిస్తాయి. కొన్ని రూపాలు తనకు అన్వయిస్తాయి. ఈ సృష్టిలో ఉన్న వస్తువుల్ని 3గా విభజించవచ్చు. వీటిలో తాను కూడా ఒక భాగం. తన ఎదుటి వస్తువు, వ్యక్తి ,రెండవ భాగం. తటస్థంగా ఉన్న వస్తువు మూడవది. ఈమూడింటిని 1) ప్రథమపురుషం (తటస్థ వస్తువులేదావ్యక్తి) 2)మధ్యమపురుషం (ఎదుటి వ్యక్తి, వస్తువు) 3)ఉత్తమపురుషం (తాను) అని శాస్త్రపరిభాషలో వ్యవహరిస్తారు. ఈ మూడింటిని నేను, మేము, - నీవు, మీరు - అది వాడు, వారు అని వ్యవహరిస్తాం. సంస్కృతంలో రామః, కృష్ణః, వృక్షః, గృహమ్ మొదలైన వస్తువుల్ని, వ్యక్తుల్ని బోధించే శబ్దాలన్నీ తత్, ఏతత్, ఇదమ్, అదస్ అనే శబ్దాల ద్వారా నిర్దేశించడం జరుగుతుంది. ఇలా, సః = వాడు, తత్ = అది, ఏషః = వాడు; ఏతత్ = అది, సా = ఆమె, అది; ఏషా = ఆమె, అది; అసౌ = వాడు, అది,

అదః = అది ఇలా ఈ శబ్దాల చేత నిర్దేశింపబడే వాటిని క్రియతో అన్వయింపవలసి వచ్చినప్పుడు ప్రథమ పురుషకు చెందిన 3రూపాలు వాడాలి. వృక్షః- ఏధతే - చెటులు వృద్ధి చెందుచున్నది, మొదలైనది. ఎదుటివానిని, లేదా దానిని క్రియతో అన్వయింపవలసి వచ్చినప్పుడు, త్వం అసి = నీవున్నావు, త్వమ్ ఏధసే = నీవు వృద్ధి చెందుతున్నావు. అని యుష్మద్ = నీవు అనే శబ్దాన్ని కలిపి మధ్యమ పురుషకు చెందిన 3 రూపాలు వాడవలసి ఉంటుంది. ఇక తనకు క్రియతో అన్వయం అవసరం అయినప్పుడు, నేను ఉన్నాను, అహమ్ అస్మి; అహమ్ ఏధే = నేను వృద్ధిచెందుతున్నాను. ఇలా ఉత్తమ పురుషకు చెందిన 3 రూపాలు వాడవలసి ఉంటుంది. ఈ విధంగా ధాతువులకు చేర్చే 9 ప్రత్యయాలు 3+3+3=9 ప్రథమ - మధ్యమ - ఉత్తమ పురుష ప్రత్యయాలుగా తెలుసుకోవాలి. ఈ ధాతువులను 10 లకారాలలో (కాలం మొదలైన వేరు వేరు అర్థాల్లో) పదిసార్లు 'తిప్' మొదలైన 9 ప్రత్యయాలను విడివిడిగా చేర్చి 9×10 = 90 రూపాలను ఒక్కొక్క ధాతువుకు తయారు చేస్తారు. ఈ లకారాలకు లట్, లిట్, లుట్, లృట్, లోట్, లఙ్, విధిలిఙ్ ఆశీర్లిఙ్ లుఙ్ లృఙ్ అని లోక భాషలో వ్యవహరిస్తారు. వీటి వివరణం ముందు ముందు పాఠాల్లో విడిగా వస్తుంది.

2) ఇలాగే ఆత్మనే పది ధాతువులకు 9 ప్రత్యయాలు 'త - ఆతామ్' మొదలైనవి 10 లకారాలలోనూ చేరిస్తే, ఒక్కొక్క ధాతువుకు 90 రూపాలు సామాన్యంగా ఏర్పడతాయి.
3) ఉభయ పది ధాతువులకు పై రెండు రకాల ప్రత్యయాలు 18 చేరిస్తే 90+90= 180 రూపాల చొప్పున ఒక్కొక్క ధాతువుకు ఏర్పడతాయి.

ఇవన్నీ క్రియాపదాలే. వీటిని తిఙన్త పదాలని అంటారు

1) బభూవ (ఉండెనట) 2) అపఠత్ (చదివెను) 3) గమిష్యతి (వెళ్లగలడు) 4) భూయాత్ (జరుగునుగాక) 5) పశ్యేత్ (చూడవలెను) 6)పఠ (చదువుము) 7) భునజ్మి (తినుచున్నాను) ఇలా ఎన్నో క్రియాపదాలు వాడబడుతూ ఉంటాయి.

సుబన్త రూపాలను తిఙన్త రూపాలతో కలిపితేనే వాక్యాలు ఏర్పడతాయి కదా! కనుక ఇప్పుడు, 2,3 ధాతు రూపాలు (తిఙన్త రూపాలు) చూచి తరువాత వాక్య నిర్మాణం తెలుసుకుందాం.

1) భూతకాలం పఠ్ = చదువుట (ఈ కాలాన్ని లఙ్ అని పిలుస్తారు)

| ఏకవచనం | ద్వి వచనం | బహు వచనం |
| --- | --- | --- |
| ప్ర.పు. అపఠత్ (చదివెను) | అపఠతాం (ఇరువురు చదివిరి) | అపఠన్ (చదివిరి) |
| మ.పు. అపఠః (చదివితివి) | అపఠతం (మీరిరువురు చదివితిరి) | అపఠత (మీరు చదివితిరి) |
| ఉ.పు. అపఠమ్ (చదివితిని) | అపఠావ (మేమిరువురము చదివితిమి) | అపఠామ (మేము చదివితిమి) |

2) భవిష్యత్ కాలం (దీన్ని ల్బట్ అని అంటారు)

గమ్ = నడచుట లేదా వెళ్లుట.

| ఏకవచనం | ద్వి వచనం | బహు వచనం |
| --- | --- | --- |
| ప్రపు. గమిష్యతి (వెళ్లగలడు) | గమిష్యతః (ఇరువురు వెళ్లగలరు | గమిష్యన్తి (మీరందరు వెళ్లగలరు) |
| మ.పు. గమివ్యసి (వెళ్లగలవు) | గమిష్యథః (మీరిరువురు వెళ్లగలరు) | గమిష్యథ (మీరందరు వెళ్ల గలరు) |
| ఉ.పు. గమిష్యామి(వెళ్లగలను) | గమిష్యావః (మేమిరువురము వెళ్లగలము) | గమిష్యామః (మేమందరము వెళ్లగలము) |

3) వర్తమానకాలం (దీన్ని లట్ అంటారు)

గద్ = పలుకుట

| ఏకవచనం | ద్వి వచనం | బహు వచనం |
| --- | --- | --- |
| ప్ర.పు. గదతి (పలుకు చున్నాడు) | గదతః (ఇద్దరు పలుకుచున్నారు) | గదన్తి (అందరు పలుకుచున్నారు) |
| మ.పు. గదసి (పలుకు చున్నావు) | దగథః (మీరిద్దరు పలుకు చున్నారు) | గదథ (మీరందరు పలుకు తున్నారు) |
| ఉ.పు. గదామి (పలుకు చున్నాను) | గదావః (మేమిద్దరం పలుకు తున్నాము) | గదామః (పలుకుచున్నాము) |

ఇక్కడ పై ధాతు రూపాల్లో చివర తిప్ - తస్ - ఝి మొదలైన 9 పరస్మైపద ప్రత్యయాలు చేర్చబడ్డాయి. వేరొక ధాతువుకు ఇవి చేరిస్తే ఎలా ఉంటాయో చూద్దాం.

ఉదా : పఠ్ = చదువుట, వర్తమానకాలం (దీన్ని లట్ అంటారు)

| | | | |
|---|---|---|---|
| ప్రథమ పురుషః (తటస్థుడైనఉన్నవానికి అన్వయిస్తుంది) | పఠ్+తి(ప్) / పఠతి | పఠ్+తస్ / పఠతః | పఠ్+ఝి(అన్తి) / పఠన్తి: |
| మధ్యమ పురుషః (ఎదుటివానికి అన్వయిస్తుంది) | పఠ్+సి(ప్) / పఠసి | పఠ్+థస్ / పఠథః | పఠ్+థ / పఠథ |
| ఉత్తమ పురుషః తనకు అన్వయిస్తుంది) | పఠ్+మి(ప్) / పఠామి | పఠ్+వస్ / పఠావః | పఠ్+మస్ / పఠామః |

దీనిలాగా, వద్=పల్కుట, హస్=నవ్వుట, అత్=నడచుట, నుద్=ప్రేరించుట, లిఖ్=వ్రాయుట, ఇలా ధాతువులకు ప్రక్కన పైన నిర్దేశించిన 'తిప్' మొదలైన ప్రత్యయాలు చేర్చి వదతి, హసతి, అతతి, నుదతి, లిఖతి - ఇలా తొమ్మిదేసి రూపాలు తయారు చేయవచ్చును. వీటిని తిజన్త రూపాలంటారు.

ఇప్పుడు ఒక సుబన్త రూపాన్నీ, ఒక తిజన్త రూపాన్ని కలిపితే వాక్యాలు ఏర్పడతాయి చూడండి.

| సుబన్త రూపం | తిజన్త రూపం | |
|---|---|---|
| రామః | అపఠత్ | రాముడు చదివెను. |
| రామౌ | అపఠతామ్ | ఇద్దరు రాములు చదివిరి. |
| రామాః | అపఠన్ | రాములందరు చదివినారు. |
| యువామ్ | అపఠతం | మీరిరువురు చదివితిరి. |
| యూయమ్ | అపఠత | మీరందరు చదివితిరి. |
| అహమ్ | అపఠమ్ | నేను చదివితిని. |
| ఆవామ్ | అపఠావ | మేమిరువురము చదివితిమి. |
| వయమ్ | అపఠామ | మేమందరము చదివితిమి. |

ఇలాగా భవిష్యత్ కాలరూపాలను సుబన్త శబ్దాలతో కలిపితే -

| | | |
|---|---|---|
| రామః | గమిష్యతి | రాముడు వెళ్లగలడు |
| రామౌ | గమిష్యతః | ఇద్దరురాములు వెళ్లగలరు. |
| రామాః | గమిష్యన్తి | రాములందరు వెళ్లగొలరు. |
| త్వం | గమిష్యసి | నీవు వెళ్లగలవు. |
| యువామ్ | గమిష్యథః | మీరిద్దరు వెళ్లగలరు. |
| యూయమ్ | గమిష్యథ | మీరందరు వెళ్లగలరు. |

| | | |
|---|---|---|
| అహమ్ | గమిష్యామి | నేను వెళ్లగలను. |
| ఆవామ్ | గమిష్యావః | మేమిద్దరమువెళ్లగలము. |
| వయం | గమిష్యామః | మేమంతా వెళ్లగలము. |

ఇదే వరసలో వర్తమాన కాల ధాతురూపాలకు అన్వయించండి చూడండి.

ఇలా సబన్త రూపాలు+తిజన్తరూపాలు కలిస్తే వాక్యాలు ఏర్పడతాయని స్పష్టం అయిందికదా! ముందుముందు ఇంకా ఇతర విభక్తిరూపాలను ఇతర తిజాన్తరూపాలను కలిపి వాక్యాలు తయారుచేద్దాం.

| | | | |
|---|---|---|---|
| 1.రామః | పఠతి | 2.త్వం | పఠసి |
| రాముడు | చదువుచున్నాడు | నీవు | చదువుతున్నావు |
| రామౌ | పఠతః | యువామ్ | పఠధః |
| ఇద్దరు రాములు | చదువుతున్నారు. | మీరిరువురు | చదువుతున్నారు |
| రామా | పఠంతి | యూయమ్ | పఠథ |
| రాములు | చదువుచున్నారు. | మీరంతా | చదువుతున్నారు |
| 3. అహమ్ | పఠామి | | |
| నేను | చదువుతున్నాను. | | |
| ఆవామ్ | పఠావః | వయం | పఠామః |
| మేము | చదువుతున్నాము. | మేమిరువురము | చదువుతున్నాము |

పైని ఇచ్చిన రామ శబ్దం లాంటి ఏదైనాశబ్దం ప్రథమా విభక్తిరూపాలు, అస్మద్ శబ్ద ప్రథమావిభక్తి రూపాలు, యుష్మద్ శబ్ద ప్రథమా విభక్తిరూపాలు మొత్తం 9 రూపాలు తొమ్మిది క్రియాపదాలతో ఏకాలానికి చెందిన రూపాలతో నైనా, కలిపితే వాక్యాలు తయారు అవడం గమనించారు కదా! ఈ సంస్కారం మీద ముందుకు వెళ్దాం. ప్రసిద్ధ కావ్యాలలలోంచి ప్రయోగాలు వాక్యాలు తెలుసుకుందాం.

విధిగా ఏశబ్దానికైనా ప్రథమా విభక్తిరూపాలు యుష్మద్ - అస్మద్ శబ్దాల ప్రథమావిభక్తి రూపాలు బాగా గుర్తుపెట్టుకోండి. ఈపుస్తకంలో ఇచ్చిన శబ్దాల టేబుల్స్ దగ్గరపెట్టుకొని, పైనిచెప్పినట్లు ప్రథమావిభక్తిరూపాలను, యుష్మద్-అస్మద్ శబ్ద రూపాలను

ఏధాతురూపాలతోనైనా పైనిచూపించినట్లుగా కలిపి ఒక 'నోట్' పుస్తకం మీద వ్రాసి అభ్యాసం చేయండి. దానివల్ల వాక్యనిర్మాణం చాలాసులువు అవుతుంది. ఇంతవరకూ చెప్పిన విషయాలనుబట్టి

ఈ తిజన్త పదాలగురించి స్థూలంగా ముందు ఈ క్రింది విషయాలు గుర్తిస్తే సూక్ష్మంగా వాటి ప్రయోగాలు ఎలఉంటాయో తెలుసుకోవచ్చు.

1. 'ధాతువు' అని పిలువబడే మౌళిక శబ్దాలనుంచి 'తిఙ్' అని సామాన్యంగా వ్యవహరింపబడే 18 ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన పదాలను తిజన్త పదాలని అంటారు. తిఙ్ప్రత్యయాలు చివర కలపదాలు కనుక తిజన్తపదాలని వాటికి వ్యవహారం.

2. తిప్, తస్,ఝి, మొదలైన వెనుక నిర్దేశించిన 18 ప్రత్యయాలను తిఙ్ ప్రత్యయాలంటారు. 9 ప్రత్యయాలను పరస్మైపదప్రత్యయాలంటారు.

3. మిగిలిన 9 ప్రత్యయాలను ఆత్మనే పదప్రత్యయాలంటారు.

4. ఈపరస్మైపద-ఆత్మనే పద ప్రత్యయాలు చేర్చినందువల్ల ఏర్పడే క్రియాపదాలరూపాలు వేరువేరుగాఉంటాయి.

5. వాస్తవానికి ఈరెండురకాల క్రియాపదాలప్రయోగంలో శాస్త్రకారులు తేడా చూపించినా, వ్యవహారంలో ఆతేడాపాటింపబడుతున్నట్లు కనపడదు.

6. అంటే పరస్మైపదాలుగా చెప్పబడే ధాతువులైనా, ఆత్మనే పదాలుగా చెప్పబడేధాతువులైనా సూక్ష్మమైన రూపభేదమే తప్ప వ్యవహారంలో వాటికి అంతగా తేడా ఏమీ పాటింపబడటంలేదు.

7. కొన్ని ధాతువులను పరస్మైపదప్రత్యయాలు చేర్చదగిన ధాతువులుగా గుర్తించారు. వీటిని పాణిని స్పష్టంగా నిర్దేశించాడు.

8. కొన్ని ధాతువులను ఆత్మనేపదప్రత్యయాలు చేర్చదగిన ధాతువులుగా గుర్తించారు, వీటినికూడా పాణిని నిర్దేశించాడు.

9. ఈ రెండు రకాల ప్రత్యయాలూ చేర్చి రెండు రకాల రూపాలూ తయారుచేయదగిన ఉభయపదిధాతువులుగా మరికొన్నిటిని గుర్తించారు. వీటన్నింటికి అర్థాలు వేరుగా ఉన్నా ఒకసాధారణ లక్షణం ఉంది. ఇవన్నీ క్రియాపదాలే.

10. 'ధాతువు' అని పిలువబడే మౌళిక శబ్దం నుంచే భాషలోని పదాలన్నీ. అంటే సుబన్తపదాలు - తిజన్తపదాలు రెండూ ఏర్పడుతున్నాయని కొందరి సిద్ధాంతం.

శాకటాయనుడనే వ్యాకరణాచార్యునిఅభిప్రాయం ఇదే. అయితే అవ్యయాలుగా పిలువబడే లింగం, వచనం, విభక్తి ఏదీలేని కొన్ని శబ్దాలు ఏధాతువునుండీ పుట్టినట్లు చెప్పడానికి అవకాశంలేదు. ఉదా: హి, తు, చ, వై, ఇవ; మొదలైనవి ఇటువంటివి. ఎన్నో ఉన్నాయి. కనుక అన్ని పదాలూ ధాతువులనుంచే పుట్టాయనడం కుదరదు.

12. అయినా, భాషలో మూడువంతులకుపైగా పదాలను ధాతువులనుంచే తయారుచేయవచ్చు. ఈధాతువుక్రియనుబోధిస్తుంది. ఆక్రియ-కాలంతో అన్వయించి ఉంటుంది.

13. ఈధాతువుల మీద తయారైన క్రియాపదాలను మూడురకాల వస్తువులతో కలిపి ప్రయోగించడం జరుగుతుంది.

14. ఈ 3రకాల వస్తువుల్ని ప్రథమ పురుష-మధ్యమపురుష - ఉత్తమపురుషలని వ్యవహరిస్తారు.

16. సుప్ ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన సుబన్త పదాలను, తిఙ్ ప్రత్యయాలు చేర్చగాఏర్పడిన తిఙన్తపదాలను, ప్రక్కప్రక్కన కలిపి ప్రయోగిస్తే వాక్యాలు ఏర్పడతాయి. మనం లోకంలో వాక్యాలను ప్రయోగిస్తాం.

17. మొత్తంమీద సంస్కృతభాషలో 1) సుబన్త పదాలు 2) తిఙన్త పదాలు అని పదాలు రెండు రకాలుగా ఉంటాయి. ఎన్నిరకాలశబ్దాలైన ఈవిభాగాల్లో చేరి తీరాలి.

18. పదాలనే వ్యవహారంలో మాటాడేటప్పుడు, వ్రాసేటప్పుడు, ప్రయోగించాలితప్ప, సుప్ ప్రత్యయాలు, తిఙ్ప్రత్యయాలు చేర్చకుండా కేవల ప్రాతిపదికాలనుగాని, కేవలధాతువులను గాని ప్రయోగించకూడదు. అలా ప్రయోగిస్తే వాటివల్ల వ్యవహారం సాధ్యంకాదు. అర్థం కూడా పూర్తిగారాదు.

19. తిఙన్త పదాలనే క్రియాపదాలని వ్యవహరిస్తారు.

20. సుబన్త పదాలనే 1) కృదన్తపదాలు 2) తద్ధితాంతపదాలు 3) సమాస పదాలు 4) అవ్యయపదాలు అని భాషలో వ్యవహరిస్తాం.

ఈ పైని నిర్దేశించిన అంశాలను, ముందుగా, సంస్కృతభాషను క్షుణ్ణంగా అవగాహనకు తెచ్చుకోదలచిన వారు గుర్తించాలి. ముందు ముందు విడిగా ధాతువులను కొన్నింటిని వివరించడం జరిగింది.

## కారక - విభక్తి పరిచయం :-

వాక్య నిర్మాణం గురించి తెలిసికొనే ముందు వాక్యంలోని భాగాలు తెలుసుకోవాలి. భాష అనేది మన వ్యవహారమే. దీన్ని శాస్త్రీయంగా విశ్లేషించి సలక్షణంగా చెబితే దానికి వ్యాకరణం అని పేరు పెట్టారు. వ్యాకరణం తెలియనివారు కూడా మాటాడగలరు. వ్యాకరణం ఉన్నా లేకపోయినా జన వ్యవహారం జనులున్నచోట తప్పక ఉండి తీరుతుంది. కనుక జనవ్యవహారం ముందు, వ్యాకరణం తరువాత, ఏర్పడ్డాయన్నమాట.అందువల్లే 'ప్రయోగశరణం వ్యాకరణం' అన్నారు. పిల్లవాడు మాటాడుతాడు. ఏ విధంగా శబ్దవిన్యాసం చేస్తే మనకు అర్థం అవుతుందో, వాడికీ అదే శబ్దవిన్యాసం వల్ల అర్థం తెలిసి వ్యవహారం కుదురుతున్నది. వ్యాకరణం చదివి, వాక్యవిన్యాసం కారకప్రయోగం తెలినవాడు ఎలా వాక్యప్రయోగం చేస్తాడో, వ్యాకరణం చదువుకోని పామరుడు కూడా అలాగే వాక్యవిన్యాసం చేస్తాడు. అయితే శబ్దోచ్చారణలో అంత స్పష్టత ఉండకపోవచ్చు. వ్యాకరణం చదువుకున్నవాడు 'రాముడు అన్నమును తినుచున్నాడు' అని అంటే, చదువుకోనివాడు శబ్దసంస్కారం లేనివాడు- రాఁవ్డు వణ్ణం తింటన్నాడు" అని అనవచ్చు. ఇక్కడ, కర్త, కర్మ, క్రియల ప్రయోగంలో తేడా ఏమీలేదు. వ్యాకరణం చదివనంతమాత్రాన "రాఁవ్డుకి వణ్ణంయొక్క తిను" అని అంటాడా? ఎందుకు ఈ మాటలు వ్రాస్తున్నానంటే, వాక్యనిర్మాణానికి పదప్రయోగానికి సంబంధించిన ప్రాథమిక సంస్కారం ఆ భాషను మాటాడే వ్యక్తికి సహజంగానే అనూచానమైన వ్యవహారాన్ని బట్టి కలుగుతూనే ఉంది. దాన్నే శాస్త్రం నిర్వచించింది. ఇదే ఏ భాషకైనా వర్తించే సూత్రం. అంటే శాస్త్రం అనుభవానికి దూరమైన మాట ఎంతమాత్రం చెప్పదు అనడానికి ఇది చెప్పవలసి వచ్చింది.

సంస్కృతం కూడా ముందునుంచి వ్యవహారంలో ఉన్న భాషే. దానికి ఐంద్రం, చాంద్రం, కాశకృత్స్నం, ఆపిశలం, కౌమారం, సారస్వతం, శాకటాయనం, పాణినీయం అనే 9 వ్యాకరణాలున్నా, పాణిని మహర్షి వ్రాసిన వ్యాకరణం సమగ్రమైంది. దానికి, కాత్యాయనుడు వార్తికాలు వ్రాసి మరికొంతభాషను సంస్కరించి పూర్తిని కలుగజేస్తే, పతంజలి మహర్షి మహాభాష్యాన్ని రచించి ఆనాటికీ ఈనాటికీ సాటి లేదన్నట్లుగా ప్రపంచానికి వ్యాకరణ సంప్రదాయం ఎలా ఉండాలో దర్శింపజేశాడు. ప్రపంచంలో మరియే భాషకు ఇలాంటి వ్యాకరణం లేదు.

వాక్యంలో ప్రయోగింపబడే సుబన్త - తిఙన్త పదాల నిర్మాణాన్ని పాణిని తన వ్యాకరణ సూత్రాల ద్వారా నిరూపించాడు. ఇక్కడ ఒక విషయాన్ని చెప్పాలి.

ఆధునికులు కొందరు, వ్యాకరణం భాషయొక్క పెరుగుదలను అరికడుతుందని, పాణిని వ్యాకరణం తరువాత సంస్కృతభాష మార్పులేకుండా ఒక స్థిరరూపాన్ని పొందిందని, ఇది భాష యొక్క పెరుగుదలకు అడ్డమేనని అంటారు. ఇదే నిజమైతే కాత్యాయనుడు, పాణిని తరువాత కాలంలో వార్తికాలు వ్రాయడం ఎందుకు? భాసాదుల రచనల్లో ఎన్నో అపాణినీయ ప్రయోగాలు కనిపిస్తాయి. అసలు పాణిని కాలంలో కూడా ఆయనే నియమాలకు లొంగని ఎంతో శబ్దజాలాన్ని నిపతించాడు. ఒక రకంగా ఇది భాషను స్వేచ్ఛగా వదలడమే కదా!

సుబన్త పదాలు ఏడు విభక్తులలో ప్రయోగింపబడి ఉంటాయని వెనుక రామశబ్దాన్ని చూపించి చెప్పడం జరిగింది. అక్కడే, 21 సుప్ ప్రత్యయాలు చేర్చడం ద్వారా మూడు వచనాలలో ఏడు విభక్తులలో సామాన్యంగా 21 రూపాలు ఒక్కొక సుబన్త శబ్దానికి ఏర్పడతాయని చూపించడం జరిగింది. కొన్నింటికి ఈ రూపాలు పెరగడం, తగ్గడం కూడా ఉందని సోదాహరణంగా చెప్పడం జరిగింది. ఆ విభక్తులు ఏమిటో కూడా సూచనగా చెప్పడం జరిగింది. అవి

1) ప్రథమ 2) ద్వితీయ 3) తృతీయ 4) చతుర్థి 5) పంచమి 6) షష్ఠి 7) సప్తమి ప్రథమావిభక్తి - సంబోధనపరంగా ఉన్నప్పుడు సంబోధన ప్రథమ అని కూడా అంటారు. ఈ విభక్తులకు అర్థాలేమిటి? ఆ అర్థాలనే కారకాలని వ్యాకరణశాస్త్రం నిర్దేశిస్తున్నది.

1) ప్రథమా కారకం 2) ద్వితీయాకారకం 3) తృతీయా కారకం
4) చతుర్థీ కారకం 5) పంచమీ కారకం 6) సప్తమీ కారకం అని ఒక వ్యవహారం.

షష్ఠీవిభక్తికి 'సంబంధ'మనే అర్థం ఉంది. దీన్ని కారకంగాకూడా వ్యవహరించడం ఉంది.

ఒక్కొక్కప్పుడు షష్ఠీవిభక్తి, ఇతర విభక్తుల చేత బోధింపబడే కారకాలను కూడ తాను బోధిస్తూ ఉంటుంది. ఈ అంశం విశేషంగా ముందు ముందు తెలుస్తుంది. ప్రస్తుతం విభక్తులకు - ఆరు కారకాలకు ఉన్న సంబంధం తెలుసుకుందాం.

కారకాలకు పాణిని ఆరుపేర్లను నిర్దేశించాడు.

1) కర్తృ కారకం 2) కర్మ కారకం 3) కరణ కారకం 4) సంప్రదాన కారకం 5) అపాదాన కారకం 6) అధికరణ కారకం అని. వీటినే ప్రథమాది కారకాలుగా పైని నిర్దేశించడం జరిగింది.

అసలు కారకం అంటే ఏమిటి? క్రియతో సంబంధించి ఉన్నది కారకం. ఈ సంబంధం రెండు రకాలుగా ఉంటుంది.

1) సాక్షాత్ సంబంధం(Direct relation) 2) పరంపరా సంబంధం (Indirect relation) సాక్షాత్తుగా క్రియా పదంతో అన్వయించేవన్నీ కారకాలని అంటారు. ఈ కారకాల గురించి విడివిడిగా తెలిసికొనే ముందు వీటిని ఎలా ప్రయోగిస్తామో ఉదాహరణల ద్వారా తెలుసుకుందాం.

**(A) కర్తృకారకం :-** ఏదైనా ఒక పనిని స్వతంత్రంగా నిర్వహించేవాడు కర్త అని లోక వ్యవహారం ఉంది. భాషలో సాధారణంగా కర్తృకారకం ప్రథమా విభక్తిలోను, తృతీయా విభక్తిలోను ప్రయోగింపబడుతూ ఉంటుంది.

ఉదా :- దేవాః అమృతం మథ్నన్తిస్మ

దేవతలు అమృతాన్ని మథించారు.

ఇక్కడ మథించడం అనేది క్రియ. ఈ క్రియను స్వతంత్రంగా నిర్వహించిన వారు దేవతలు, కనుక వీరే కర్తలు. ఇక్కడ 'మథించారు' అనే క్రియా పదం వినగానే ఆ మథించిన వారు ఎవరు? అనే ప్రశ్న పుడుతుంది. అప్పుడు సాక్షాత్తుగా క్రియలో అన్వయించేది 'దేవాః' అనే పదం. కనుక 'దేవాః' అనే పదం కర్తృకారకం. ఇది ప్రథమా విభక్తిలో ప్రయోగింపబడింది. ఇలాగే -

1) రామః రావణం హన్తి - రాముడు రావణుని చంపుతున్నాడు.
2) కృష్ణః నవనీతం ముష్ణాతి - కృష్ణుడు వెన్నను దొంగిలిస్తున్నాడు.
3) గాయకః గీతం గాయతి - గాయకుడు గీతాన్ని గానం చేస్తున్నాడు.
4) చిత్రకరః చిత్రం లిఖతి - చిత్రకారుడు చిత్రాన్ని గీస్తున్నాడు.

ఇక్కడ రామః, కృష్ణః, గాయకః, చిత్రకరః అనే పదాలు కర్తృకారకాలు. ప్రథమావిభక్తిలో ప్రయోగింపబడ్డాయి.

ఈ కర్తృకారకం తృతీయా విభక్తిలో కూడా ప్రయోగింపబడవచ్చు.ఎలాగంటే -

1) రామేణ పఠ్యతే - రామునిచే చదువబడుతున్నది.
2) వృక్షేణ వర్ధ్యతే - వృక్షంచేత వృద్ధి పొందబడుతున్నది.
3) బాలేన పీయతే - బాలునిచే త్రాగబడుతున్నది.

ఈ వాక్యాల్లో 'రామేణ' 'వృక్షేణ' 'బాలేన' అనే పదాలు కర్తృకారకాలు. తృతీయావిభక్తిలో ప్రయోగింపబడ్డాయి. వేరే పాఠంలో దీన్ని వివరించడం జరిగింది.

**B) కర్మకారకం (The object of an action)**

వాక్యంలో క్రియాపదం వినగానే దేనిని? ఎవరిని? అనే ప్రశ్నపట్టినప్పుడు - అన్వయించేది కర్మకారకం అంటారు. ఇది ద్వితీయా విభక్తిలో ప్రయోగింపబడుతుంది.

**ఉదా : అన్నం బాలా భుంజన్తి** - అన్నాన్ని బాలురు తింటున్నారు.

ఇక్కడ తింటున్నారు. అనే క్రియాపదం వినగానే ఎవరు? అనే ప్రశ్నకు బాలురు కర్తలుగా అన్వయించిన తరువాత దేన్ని తింటున్నారు? అన్న పశ్న పుడుతుంది. దానికి 'అన్నం' అనే పదం అన్వయిస్తుంది. దీన్ని కర్మకారకం అంటారు.

ఇలాగే వెనుక కర్తృకారకానికి ఇచ్చిన వాక్యాల్లో - కర్తృకారకానికి ప్రక్కనే ఉన్నదే కర్మకారకం- ఇది ద్వితీయావిభక్తిలోను, ప్రథమావిభక్తిలోను ప్రయోగింపవచ్చు. కృష్ణః నవనీతం ముష్ణాతి - కృష్ణుడు వెన్నను దొంగిస్తున్నాడు - ఇక్కడ కృష్ణుడు కర్త దేన్ని దొంగిలించాడు? వెన్నను - ఇది కర్మ కారకం.

రామః రావణం హన్తి - రాముడు రావణుని చంపుతున్నాడు. అనే వాక్యంలో కర్త రాముడు. రావణుడు చంపబడ్డాడు. కనుక కర్మ. ఇలాగే మిగతా వాక్యాల్లో 'గీతం' అనేది, 'చిత్రం' అనేది కర్మకారకం. కర్మకారకం ప్రథమా విభక్తిలోకూడా ప్రయోగింప బడుతుంది. దీన్నికూడా వేరే పాఠంలో విశేషంగా వివరించడం జరిగింది.

రామేణ రావణః హతః రామునిచే రావణుడు చంపబడ్డాడు. ఇక్కడ రాముడు కర్త. రామునిచే చంపబడిన రావణుడు కర్మ. ప్రథమావిభక్తిలో ప్రయోగింపబడ్డాడు.

బాలేన పానీయం పీయతే - బాలునిచే పానీయం త్రాగబడుతున్నది. ఇక్కడ బాలుడు కర్త. త్రాగబడే 'పానీయం' కర్మ. సాధారణంగా 'కర్త' - 'కర్మ' అనే రెండు కారకాలు వాక్యాల్లో తరచుగా ప్రయోగింపబడుతుంటాయి.

**C) కరణ కారకం - (An instrument or means of an action)**

'కరణం' అంటే సాధనం. ఏదైనా పనిని (క్రియను) సాధించడానికి సాధనం లేదా ఉపకరణం ఉండాలి. ఉదాహరణకు చెట్టును నరకాలంటే సాధనం ఏమిటి? గొడ్డలి. ఇతర సాధనాలు ఏవి ఉన్నా లేకపోయినా గొడ్డలి ఉండి తీరాలి. దీన్ని 'సాధకతమం' అన్నారు. అన్ని సాధనాలకంటే తప్పనిసరిగా ఉండవలసిందన్నమాట. ఈ సాధనాన్ని వాక్యంలో తృతీయావిభక్తితో నిర్దేశిస్తారు.

ఉదా :- రామేణ బాణేన మృగః హతః.

రామునిచే బాణంచేత మృగం చంపబడింది.

ఇక్కడ 'చంపడం' అనేది క్రియ (పని). దీన్ని చేసిన వాడు రాముడు కర్త. చంపబడింది మృగం. అది 'కర్మ'. దాన్ని చంపడానికి ఉపకరించిన సాధనం 'బాణం'. ఇది తృతీయా విభక్తి చేత నిర్దేశింపబడింది. దీన్నే కరణ కారకం అంటారు.

లేఖిన్యా పత్రం లిఖతి - పెన్నుతో పత్రం వ్రాస్తున్నాడు.

ఇక్కడ వ్రాయడం అనే క్రియను సాధించడానికి పెన్ను సాధనం. ఇది తృతీయా విభక్తిచే నిర్దేశింపబడిన కరణకారకం.

**d) సంప్రదాన కారకం :- (Giving or handing over completely)**

ఏదైనా వస్తువును పూర్తిగా సర్వాధికారాలతోనూ దానం చేసేటప్పుడు ఈ సంప్రదాన కారకం చతుర్థీ విభక్తిలో ప్రయోగింపబడుతుంది. ఇవ్వబడే వస్తువును పుచ్చుకొనే వ్యక్తి - సంప్రదానకారకం.

ఉదా : జనకః సీతాం రామాయ దదౌ.

జనకుడు సీతను రామునికొరకు దానం చేశాడు.

ఇక్కడ కన్యాదానం చేసినవాడు జనకుడు - కర్త. ఇవ్వబడిన వస్తువు 'సీత' . కనుక కర్మ కారకం - దాన్ని పుచ్చుకోవడానికి ఉద్దేశింపబడ్డ రాముడు - సంప్రదాన కారకం. దీనికి చతుర్థీ విభక్తి వాడబడుతుంది.

ఉపాధ్యాయః విద్యార్థినే విద్యాం దదాతి.

ఉపాధ్యాయుడు - విద్యార్థికొరకు - విద్యను దానం చేస్తున్నాడు. ఇక్కడ 'దానం' అనేది క్రియం - దానిలో కర్త ఉపాధ్యాయుడు. ఇవ్వబడే వస్తువు విద్య. ఇది కర్మ. దీన్ని ఇవ్వడానికి ఉద్దేశింపబడినవాడు విద్యార్థి. ఈతడే సంప్రదాన కారకం. చతుర్థీ విభక్తి చేత నిర్దేశింపబడ్డాడు.

**e) అపాదాన కారకం :-**

ఏదైనా ఒక వస్తువు మరొక వస్తువు నుంచి విడిపోతే, ఏ వస్తువు నుండి రెండో వస్తువు విడిపోయిందో ఆ వస్తువును 'అపాదానం' అని వ్యవహరిస్తారు. ఈ అపాదానం అనే సంజ్ఞకల వస్తువును గుర్తించడానికి పంచమీ విభక్తి వాడాలి.

ఉదా : అయోధ్యాయాః రామః వనమ్ - అగాత్

అయోధ్యనుండి - రాముడు - వనాన్ని గురించి - వెళ్ళాడు.

ఇక్కడ రామునికి అయోధ్యా వియోగం ఏర్పడింది. కనుక అయోధ్య అపాదాన కారకం - దానికి పంచమీ విభక్తి వచ్చింది.

వృక్షాత్ - పర్ణం - పతతి - చెట్టునుండి ఆకు పడుతున్నది. ఇక్కడ ఆకుకు చెట్టునుండి ఎడబాటు కలిగింది. కనుక 'చెట్టు (వృక్షాత్) అపాదాన కారకం. దీనికి పంచమీ విభక్తి వచ్చింది.

**f) సంబంధాన్ని బోధించే షష్ఠీ విభక్తి :-**

షష్ఠీ విభక్తిని సంబంధషష్ఠి, కారకషష్ఠి అని రెండు రకాలుగా వ్యవహరిస్తున్నారు. రెండువస్తువుల మధ్య ఉన్న సంబంధాన్ని బోధించే షష్ఠీ విభక్తిని సంబంధ షష్ఠి అంటారు.

ఉదా : బాలస్య - పుస్తకమ్ - బాలునియొక్క పుస్తకము. ఇక్కడ బాల శబ్దానికి షష్ఠీవిభక్తి చేర్చబడింది. బాలునికి సంబంధించిన పుస్తకం అని అర్థం. ఇక్కడ

బాలుడు పుస్తకానికి స్వామి. పుస్తకం అతని స్వమ్ము (సొమ్ము) కనుక ఈ రెంటికి గల సంబంధం స్వస్వామిభావం. ఇలాగే అనేక సంబంధాలు షష్ఠీ విభక్తిచే బోధింపబడతాయి. షష్ఠిని కారకషష్ఠి అనికూడా వ్యవహరిస్తారు -

మాతుః స్మరతి - తల్లిని స్మరించుతున్నాడు.

ఇక్కడ మాతుః అనే పదం షష్ఠీ విభక్తితో కూడి ఉంది. ఈ షష్ఠీ విభక్తి కర్మార్థంలో వచ్చింది. కనుక ఇది కర్మ కారకషష్ఠి

**g) అధికరణకారకం. (దీన్ని ఆధారం అనికూడా అంటారు)**

ఏదైనా ఒక క్రియ జరిగితే ఆ క్రియలో అన్వయించిన కర్తకు, కర్మకు ఆధారమైనదేదో దాన్నే అధికరణం అని అంటారు. దీన్ని సప్తమీ విభక్తి ద్వారా తెలిసికోవలసి ఉంటుంది. ఉదా :

(1) పాత్రే జలమ్ అస్తి. పాత్రలో జలం ఉన్నది

ఇక్కడ జలానికి ఆధారం పాత్రం. దీన్ని అధికరణ కారకం అంటారు. దీన్ని సప్తమీ విభక్తి ద్వారా గుర్తించవలసి ఉంది.

రామే - భక్తిః - అస్తిరామునియందు భక్తి ఉంది. ఇక్కడ భక్తికి విషయమై ఆధారమైన వాడు రాముడు. కనుక అధికరణకారకం - దీన్ని గుర్తించడానికి 'రామే' అని సప్తమీ విభక్తి వాడబడింది.

ఈ ఆరుకారకాలు, షష్ఠీ విభక్తి ఒకే వాక్యంలో ప్రయోగించవచ్చు. ఎలాగో చూడండి.

1. ఉపాధ్యాయః పాఠశాలాయాం కుడ్యలంబితాత్ ప్రపంచ చిత్ర పటాత్ భారతదేశం బాలానాం పరిజ్ఞానాయ హస్తదండేన - దర్శయతి. ఉపాధ్యాయుడు పాఠశాలలో గోడకువ్రేలాడ గట్టిన ప్రపంచ చిత్ర పటం నుండి భారత దేశాన్ని బాలురయొక్క పరిజ్ఞానం కొరకు చేతికర్రతో చూపిస్తున్నాడు.

1) ఉపాధ్యాయః - ప్రథమావిభక్తి (కర్తృకారకం) 2) భారతదేశం - ద్వితీయావిభక్తి (కర్మకారకం) 3) హస్తదండేన - తృతీయావిభక్తి (కరణకారకం) 4) పరిజ్ఞానాయ చతుర్థీవిభక్తి - సంప్రదానకారకం 5) కుడ్యలంబితాత్ - ప్రపంచ చిత్ర పటాత్ పంచమీ విభక్తి అపాదాన కారకం 6) బాలానాం - షష్ఠీ విభక్తి సంబంధాన్ని బోధిస్తుంది. 7) పాఠశాలాయాం - సప్తమీవిభక్తి - అధికరణ కారకం 8) దర్శయతి - క్రియాపదం. ఈ కారకాలకు సంబంధించి అనే విశేషాలున్నప్పటికీ, ఇక్కడ సామాన్యంగా మాత్రమే కారకాలు - విభక్తులు పరిచయం చేయబడ్డాయి. విశేషాలు ముందు ముందు గ్రహించవచ్చు. (ఈ ఆరు కారకాలు,ఏడువిభక్తులు విడివిడిగా వివరించడం జరిగింది.

## విభక్తుల సాధారణ ప్రయోగాలు :-

ఇంతవరకు కర్త, కర్మ, కరణం, సంప్రదానం, అపాదానం, అధికరణం అనే ఆరు కారకాలు, 'సంబంధం' అనే 1అర్థం వీటి గురించి సామాన్యంగా చెప్పుకున్నాం. ఇవికాక, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి అనే విభక్తుల్లో వేటిచేత ఏ కారకాలు లేదా ఏ అర్థాలు బోధింపబడతాయో విడివిడిగా చెప్పుకున్నాం. ఇప్పుడు ఈ విభక్తులను ఒక దానితో ఒకటి కలిపి ప్రయోగించే విధానం ఎలా ఉంటుందో సామాన్య లోకవ్యవహారానికి అన్వయించి చూద్దాం. కొన్ని దైనందిన (ప్రతిరోజు) వ్యవహారంలో మనం వాడే వాక్యాలు సంస్కృతంలో ఎలా ఉంటాయో చూడండి. తెలుగు నామవాచకానికి, లేదా గ్రామ నగరాది శబ్దాలకు చివర పుంలింగంగా చెప్పదలచుకుంటే పుంలింగ శబ్దాల్లాగా లేదా స్త్రీలింగ నపుంసకలింగాల్లో చెప్పదలచుకుంటే సంస్కృతంలో ఉండే ఆ శబ్దాల్లాగా ప్రత్యయాలు చేర్చితే సరిపోతుంది. ఉదా: రామయ్య, కృష్ణప్ప, నాయుడు, రెడ్డి, ఇలాంటి శబ్దాలను వాడేటప్పుడు చివర 'విసర్గ' (:) చేరిస్తే కృష్ణప్పః, రామయ్యః, నాయుడుః, రెడ్డిః, ఇలా మల్లమ్మ మొదలైన శబ్దాలను 'మల్లమ్మా' అని ఆకారాన్త స్త్రీలింగంగానో లేక మల్లాంబా అనే శబ్దంగానో వాడవచ్చు. గ్రామనామాలూ అంతే. కొవ్వూరు - కొవ్వూరుః ఏలూరు - ఏలూరుః, తుని - తునిః కొన్నిటిని యథాతథంగా వాడవచ్చు. విజయనగరం - విజయనగరమ్ - విజయనగరే, విజయనగరస్య, విశాఖ పట్టణస్య, ఇలా విభక్తులు మార్చవచ్చు. పట్టణం అనేది సంస్కృతంలో 'పత్తనం' అని ఉంటుంది. అయినా 'పట్టణ' అనేది నామంలో (పేరులో) ఒక భాగంగా ఉంది కనుక, దాన్ని మార్చనక్కర్లేదు. ఇలాగే 'రాజమహేంద్రవరం' ఇత్యాది నామాలు వాడవచ్చు.

ఇప్పుడు కొన్ని వాక్యాలు చూద్దాం.

1) రామయ్యః ధూమ శకటేన (రైలయానేన అని కూడా అంటున్నారు) గచ్ఛతి. రామయ్య రైలుబండిద్వారా - వెళ్తున్నాడు.

2) విశాఖపట్టణే, ఆంధ్రవిశ్వవిద్యాలయం:, అస్తి - తత్ర, మమ, కార్యమ్, అస్తి. విశాఖపట్టణంలో, ఆంధ్రవిశ్వవిద్యాలయం, ఉంది - అక్కడ, నాకు, పని, ఉంది.

3) అహమ్, అద్య, రాత్రౌ, హైదరాబాదం, గమిష్యామి-నేను, ఈ రాత్రి హైదరాబాద్ వెళ్తున్నాను.

4) గోపాలనాయుడుః హైదరాబాదే, ఉద్యోగం, కరోతి - గోపాలనాయుడు, హైదరాబాద్‌లో, ఉద్యోగాన్ని చేస్తున్నాడు.

5) హైదరాబాదః, ఆంధ్రప్రదేశస్య, రాజధానీ, కిల-హైదరాబాదు ఆంధ్రప్రదేశానికి రాజధాని కదా!

6) కృష్ణప్పేన, రామిరెడ్డయే, ధనం, దత్తమ్ - కృష్ణప్పచేత, రామిరెడ్డికొరకు, డబ్బు, ఈయబడింది.

7) గోవర్ధనరావః, ఏలూరౌ, వ్యాపారం, కరోతి - గోవర్ధనరావు ఏలూరులో, వ్యాపారం చేస్తున్నాడు.

8) ప్రాథమిక పాఠశాలాయాం, పంచ, ఉపాధ్యాయాః సన్తి - ప్రాథమిక పాఠశాలలో ఐదుగురు ఉపాధ్యాయులు ఉన్నారు.

10) బస్‌యానే ప్రయాణం సులభమ్అస్తి - బస్సుద్వారా ప్రయాణం సులభంగా ఉన్నది.

12) విజయవాడా - మద్రాసయోః మధ్యే విద్యున్మార్గః అస్తి - విజయవాడ మద్రాసుల మధ్య విద్యున్మార్గం ఉంది.

13) దూరప్రయాణే, ఇదానీం, శ్రమః నాస్తి - దూరప్రయాణంలో ఇప్పుడు శ్రమలేదు.

14) కర్మాగారేభ్యః విషవాయుః నిస్సరతి - ఫ్యాక్టరీలనుండి విషవాయువు వెలువడుతున్నది.

15) కర్మాగారాణి కలుషజలం విసృజన్తి - ఫ్యాక్టరీలు కలుషజలాన్ని విడుస్తున్నాయి.

16) విషవాయుభిః నాగరకాః జనాః పీడ్యన్తే - విషవాయువులచే నగరజనులు పీడింపబడుతున్నారు.

17) విషవాయూన్ నిరోద్ధుమ్ వృక్షారోపణం కార్యమ్-విషవాయువులను అడ్డగించడానికి చెట్లు నాటడం చెయ్యాలి.

18) గ్రామ జీవనం ప్రశాన్తం భవతి - గ్రామజీవనం ప్రశాన్తంగా ఉంటుంది.

19) నగరేషు శకట ఘోషః దుర్భరః కిల - నగరాల్లో బండ్ల ధ్వని దుర్భరం (భరింపరానిది) కదా!

20) మమ, లేఖినీ, సమ్యక్ లిఖతి - నా పెన్ను బాగా వ్రాస్తుంది.

21) తవ ముఖే తిలకం నాస్తి - నీముఖం మీద బొట్టులేదు.

22) గౌర్యాః వస్త్రం మనోజ్ఞమ్ అస్తి - గౌరియొక్క వస్త్రం అందంగా ఉంది.

23) కక్ష్యాయాం బాలికాః సుష్ఠు పఠన్తి - క్లాసులో ఆడపిల్లలు బాగా చదువుతున్నారు. (చదువుతారు).

24) విద్యార్థినాం వినయః వృద్ధికరఃభవతి. విద్యార్థులకు వినయం వృద్ధికారకం అవుతుంది.

25) సర్వేభ్యః వృక్షేభ్యః నారికేళః - బహూపకారీ - అన్నివృక్షాల కంటే కొబ్బరిచెట్టు బాగా ఉపకరిస్తుంది.

26) సర్వాభ్యః వృత్తిభ్యః కృషిః మహత్తరా - అన్ని వృత్తులకంటే వ్యవసాయం చాలా గొప్పది.
27) కృషకాః (కృషీవలాః,) లోకస్య బుభుక్షాం పూరయన్తి - కృషీవలులు లోకంయొక్క ఆకలిని తీరుస్తారు.
28) ప్రతిదినం స్నానాత్అనన్తరం భోక్తవ్యమ్ - ప్రతిరోజూ స్నానం తరువాత భోజనం చేయాలి.
29) ధవలాని వస్త్రాణి ధరణీయాని భవన్తి - తెల్లని వస్త్రాలు ధరింపదగి ఉన్నాయి.
30) శరీరశౌచేన సాకం మనశ్శౌచమ్ అత్యావశ్యకమ్, శరీరశుభ్రతతోపాటు మనస్సు యొక్క శుభ్రత చాలా అవసరం.
31) రథ్యాయామ్ వామభాగే గన్తవ్యమ్ - రోడ్డుమీద ఎడమవైపున నడవాలి.
32) సంస్కృతాధ్యయనం - సంస్కారాయ భవతి - సంస్కృతాధ్యాయనం సంస్కారం కలుగజేస్తుంది.
33) ప్రాచీన కాలే అపి సాంకేతిక విద్యాః అభూవన్ - ప్రాచీనకాలంలో కూడా సంకేతిక విద్యలుండేవి.
34) శుద్ధం జలం అస్ఫుటరసం నిర్గంధంచ భవతి - శుద్ధమైన జలం స్పష్టమైన రుచిలేనిదై గంధరహితంగా ఉంటుంది.
35) పరాశర - గర్గ - వరరుచి ప్రభృతయః ప్రాణివిజ్ఞాన గ్రంథకారాః - పరారుడు గర్గుడు వరరుచి మొదలైనవారు ప్రాణి శాస్త్రగ్రంథకారులు
36) మహీస్థస్య జలస్య షడ్గుణాః భవన్తి - భూమిపైనున్న నీటికి ఆరు గుణాలుంటాయి.

ఇలా వేరువేరు విభక్తుల్ని వేరువేరు వాక్యాల్లో ప్రయోగించవచ్చు.

ఈ విభక్తి ప్రయోగాలనే భాషలో 'శబ్దాలు' అని అంటారు. క్రొత్తగా సంస్కృతం చదువుకోవడం ప్రారంభించే విద్యార్థి ముందుగా 'శబ్దాలు' 'ధాతువులు' నేర్చుకోవాలని ఉపాధ్యాయులు చెబుతారు. ధాతువులు అంటే క్రియాపదాలు వాటి గురించి విడిగా తెలుసుకుందాం. ముందు "శబ్దాల"ను (వీటినే సుబన్తాలని అంటారని గుర్తించుకుందాం. శబ్దాలు సాధారణంగా 1) అజన్త శబ్దాలు (పుంలింగాలు - స్త్రీలింగాలు - నపుంసకలింగాలు) 2) హలన్త శబ్దాలు (ఇవి కూడా మూడు లింగాల్లో ఉంటాయి) 3) సర్వనామ శబ్దాలు

ఈ శబ్దాలకు సంబంధించి ప్రాతిపదికాల చివళ్లను బట్టి ఆ శబ్దాల అంతాలు గుర్తించడవలసి ఉంటుంది. ముందు ఇవ్వబోయే టేబుళ్లను బట్టి శబ్దాల తేడాలను గుర్తించండి.

ఈ క్రింది టేబుల్ ద్వారా అజన్త - హలన్త శబ్దాలను వాటికి విభక్తి ప్రత్యయాలు చేర్చినప్పుడు ఉన్న తేడాను పోలికను గుర్తించండి. 1) అజన్త పుంలింగ శబ్దాలు కొన్ని.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | అ | రామః | హేరామ | రామం | రామేణ | రామాయ | రామాత్ | రామస్య | రామే |
| ఏ | ఇ | హరిః | హేహరే | హరిం | హరిణా | హరయే | హరేః | హరేః | హరౌ |
| క | ఉ | గురుః | హేగురో | గురుం | గురుణా | గురవే | గురోః | గురోః | గురౌ |
| వ | ఋ | పితా | హేపితః | పితరం | పిత్రా | పిత్రే | పితుః | పితుః | పితరి |
| చ | ఏ | స్మృతేః | హేస్మృతే | స్మృతయం | స్మృతయా | స్మృతయే | స్మృతేః | స్మృతేః | స్మృతయి |
| న | ఐ | రాః | హేంః | రాయం | రాయా | రాయే | రాయః | రాయః | రాయి |
| మ్ | ఓ | గౌః | హేగౌః | గామ్ | గవా | గవే | గోః | గోః | గవి |
| | ఔ | గ్లౌః | హేగ్లౌః | గ్లావమ్ | గ్లావా | గ్లావే | గ్లావః | గ్లావః | గ్లావి |
| | అ | రామౌ | హేరామౌ | రామౌ | రామాభ్యాం | రామాభ్యాం | రామాభ్యాం | రామయోః | రామయోః |
| ద్వి | ఇ | హరీ | హేహరీ | హరీ | హరిభ్యాం | హరిభ్యాం | హరిభ్యాం | హర్యోః | హర్యోః |
| వ | ఉ | గురూ | హే గురూ | గురూ | గురుభ్యాం | గురుభ్యాం | గురుభ్యాం | గుర్వోః | గుర్వోః |
| చ | ఋ | పితరౌ | హేపితరౌ | పితరౌ | పితృభ్యాం | పితృభ్యాం | పితృభ్యాం | పిత్రోః | పిత్రోః |
| న | ఏ | స్మృతయౌ | హేస్మృతయౌ | స్మృతయౌ | స్మృతేభ్యాం | స్మృతేభ్యాం | స్మృతేభ్యాం | స్మృతయోః | స్మృతయోః |
| మ్ | ఐ | రాయౌ | హేరాయౌ | రాయౌ | రాభ్యాం | రాభ్యాం | ంభ్యాం | రాయోః | రాయోః |
| | ఓ | గావౌ | హేంగంవౌ | గావౌ | గోభ్యాం | గోభ్యాం | గోభ్యాం | గవోః | గవోః |
| | ఔ | గ్లావౌ | హేగ్లావౌ | గ్లావౌ | గ్లౌభ్యాం | గ్లౌభ్యాం | గ్లౌభ్యాం | గ్లావోః | గ్లావోః |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ | అ | రామాః | హేరామాః | రామాన్ | - రామైః | - రామేభ్యః | - రామేభ్యః | - రామాణామ్ | - రామేషు |
| హు | ఇ | హరయః | హే॰హ॰రయః | హరీన్ | - హరిభిః | - హరిభ్యః | - హరిభ్యః | - హరీణామ్ | - హరిషు |
| వ | ఉ | గురవః | హేగురవః | గురూన్ | - గురుభిః | - గురుభ్యః | - గురుభ్యః | - గురూణామ్ | - గురుషు |
| చ | ఋ | పితరః | హేపితరః | పితౄన్ | - పితృభిః | - పితృభ్యః | - పితృభ్యః | - పితౄణామ్ | - పితృషు |
| న | ఏ | స్మృతయః | హేస్మృతయః | స్మృతయః | స్మృతేభిః | స్మృతేభ్యః | స్మృతేభ్యః | స్మృతయామ్ | స్మృతేషు |
| మ్ | ఐ | రాయః | హేరాయః | రాయః | రాభిః | రాభ్యః | రాభ్యః | రాయామ్ | - రాసు |
| | ఓ | గావః | హేగావః | గాః | గోభిః | గోభ్యః | గోభ్యః | - గవామ్ | - గోషు |
| | ఔ | గ్లావః | హేగ్లావః | గ్లావః | గ్లాభిః | గ్లాభ్యః | గ్లాభ్యః | గ్లావామ్ | - గ్లాసు |

## 2 అజన్త స్త్రీ లింగ శబ్దాలు కొన్ని

| | | ప్ర. | ద్వి. | తృ. | చ. | పం. | ష. | సప్త. | సం.ప్ర. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఏ | ఆ | రమా | రమామ్ | రమయా | రమాయై | రమాయాః | రమాయాః | రమాయామ్ | హేరమే | లతా,గీతా |
| క | ఈ | గౌరీ | గౌరీమ్ | గౌర్యా | గౌర్యై | గౌర్యాః | గౌర్యాః | గౌర్యామ్ | హేగౌరి | పత్నీ,వాణీ |
| వ | ఊ | వధూః | వధూమ్ | వధ్వా | వధ్వై | వధ్వాః | వధ్వాః | వధ్వామ్ | హేవధు | తనూఃచమూః |
| చ | ఋ | మాతా | మాతరం | మాత్రా | మాత్రే | మాతుః | మాతుః | మాతరి | హేమాతః | తనుః |
| న | ఉ | ధేనుః | ధేనుం | ధేన్వా | ధేన్వై,ధేనవే | ధేన్వాఃధేనోః | ధేన్వాః,ధేనోః | ధేన్వాం,ధేనౌ | హేధేనో | ఇత్యాదులు |
| మ్ | ఇ | మతిః | మతిమ్ | మత్యా | మత్యై,మతయే | మత్యాః,మతేః | మత్యాః,మతేః | మత్యాం,మతౌ | హేమతే | |
| | ఔ | ద్యౌః | ద్యామ్ | ద్యావా | ద్యవే | ద్యోః | ద్యోః | ద్యవి | హేద్యౌః | |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ద్వివచనమ్ | ఆ | రమే | రమే | రమాభ్యాం | రమాభ్యాం | రమాభ్యాం | రమయోః | రమయోః | హేరమే |
| | ఈ | గౌర్యౌ | గౌర్యౌ | గౌరీభ్యాం | గౌరీభ్యాం | గౌరీభ్యాం | గౌర్యోః | గౌర్యోః | హేగౌర్యౌ |
| | ఊ | వధ్వౌ | వధ్వౌ | వధూభ్యాం | వధూభ్యాం | వధూభ్యాం | వధ్వోః | వధ్వోః | హేవధ్వౌ |
| | ఋ | మాతరౌ | మాతరౌ | మాతృభ్యాం | మాతృభ్యాం | మాతృభ్యాం | మాత్రోః | మాత్రోః | హేమాతరౌ |
| | ఉ | ధేనూ | ధేనూ | ధేనుభ్యాం | ధేనుభ్యాం | ధేనుభ్యాం | ధేన్వోః | ధేన్వోః | హేధేనూ |
| | ఇ | మతీ | మతీ | మతిభ్యాం | మతిభ్యాం | మతిభ్యాం | మత్యోః | మత్యోః | హేమతీ |
| | ఔ | ద్యావౌ | ద్యావౌ | ద్యోభ్యాం | ద్యోభ్యాం | ద్యోభ్యాం | ద్యవోః | ద్యవోః | హేద్యావౌ |
| బహువచనమ్ | ఆ | రమాః | రమాః | రమాభిః | రమాభ్యః | రమాభ్యః | రమాణామ్ | రమాసు | హేరమాః |
| | ఈ | గౌర్యః | గౌరీః | గౌరీభిః | గౌరీభ్యః | గౌరీభ్యః | గౌరీణామ్ | గౌరీషు | హేగౌర్యః |
| | ఊ | వధ్వః | వధూః | వధూభిః | వధూభ్యః | వధూభ్యః | వధూనామ్ | వధూషు | హేవధ్వః |
| | ఋ | మాతరః | మాతౄః | మాతృభిః | మాతృభ్యః | మాతృభ్యః | మాతౄణామ్ | మాతృషు | హేమాతరః |
| | ఉ | ధేనవః | ధేనూః | ధేనుభిః | ధేనుభ్యః | ధేనుభ్యః | ధేనూనామ్ | ధేనుషు | హేధేనవః |
| | ఇ | మతయః | మతీః | మతిభిః | మతిభ్యః | మతిభ్యః | మతీనామ్ | మతిషు | హేమతయః |
| | ఔ | ద్యావః | ద్యాః | ద్యోభిః | ద్యోభ్యః | ద్యోభ్యః | ద్యవామ్ | ద్యాషు | హేద్యావః |

# హలన్త పుంలింగ శబ్దాలు - 3

| అన్తం | ప్ర | ద్వి | తృ | చ | పం | ష | స | అర్థం | వీటికి సమాన శబ్దాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చ | పయోముక్ | పయోగుచం | పయోముచా | పయోముచే | పయోముచః | పయోముచః | పయోముచి | మేఘం | సువాక్ |
| జ | భిషగ్ | భిషజం | భిషజా | భిషజే | భిషజః | భిషజః | భిషజి | వైద్యుడు | ఋత్విక్ |
| త | మరుత్ | మరుతం | మరుతా | మరుతే | మరుతః | మరుతః | మరుతి | వాయువు | జాగ్రత్,దధత్ |
| ద | దివిషద్ | దివిషదం | దివిషదా | దివిషదే | దివిషదః | దివిషదః | దివిషది | దేవత | క్రవ్యాత్ |
| న | రాజా | రాజానం | రాజ్ఞా | రాజ్ఞే | రాజ్ఞః | రాజ్ఞః | రాజ్ఞి | రాజు | మహిమన్ |
| న | గుణీ | గుణినం | గుణినా | గుణినే | గుణినః | గుణినః | గుణిని | గుణవంతుడు | దండిన్,శాస్త్రిన్ |
| శ | విట్ | విశం | విశా | విశే | విశః | విశః | విశి | వైశ్యుడు | తాదృశ్ |
| ష | ద్విట్ | ద్విషం | ద్విషా | ద్విషే | ద్విషః | ద్విషః | ద్విషి | శత్రువు | రత్నముష్ |
| స | వేధాః | వేధసం | వేధసా | వేధసే | వేధసః | వేధసః | వేధసి | బ్రహ్మ | సుమనాః |
| హ | ధుక్ | దుహం | దుహా | దుహే | దుహః | దుహః | దుహి | పితుకువాడు | మొదలైనవి. |
| ణ | సుగణ్ | సుగణం | సుగణా | సుగణే | సుగణః | సుగణః | సుగణి | మంచిగణముకలవాడు | |
| న | శ్వా | శ్వానం | శునా | శునే | శునః | శునః | శుని | కుక్క | |
| ప | గుప్ | గుపం | గుపా | గుపే | గుపః | గుపః | గుపి | రక్షించువాడు | |

ద్వివచనం

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| చ | పమోముచౌ | పయోముచౌ | పయోముగ్భ్యాం | పయోముగ్భ్యాం | పయోముగ్భ్యాం | పయోముచోః | పయోముచోః | హలన్తశ |
| జ | భిషజౌ | భిషజౌ | భిషగ్భ్యాం | భిషగ్భ్యాం | భిషగ్భ్యాం | భిషజోః | భిషజోః | బ్దాలకు ఈ |
| త | మరుతౌ | మరుతే | మరుద్భ్యాం | మరుద్భ్యాం | మరుద్భ్యాం | మరుతోః | మరుతోః | ప్రథమా ద్వి |
| ద | దివిసదౌ | దివిషదౌ | దివిషద్భ్యాం | దివిషద్భ్యాం | దివిషద్భ్యాం | దివిషదోః | దివిషదోః | వచనం లో |
| న | రాజ్ఞౌ | రాజ్ఞే | రాజభ్యాం | రాజభ్యాం | రాజభ్యాం | రాజ్ఞోః | రాజ్ఞోః | చివర ఉన్న |
| న | గుణినౌ | గుణినౌ | గుణిభ్యాం | గుణిభ్యాం | గుణిభ్యాం | గుణినోః | గుణినోః | హల్లును |
| శ | విశౌ | విశే | విడ్భ్యాం | విడ్భ్యాం | విడ్భ్యాం | విశోః | విశోః | బట్టి ఈ |
| ష | ద్విషౌ | ద్విషే | ద్విడ్భ్యాం | ద్విడ్భ్యాం | ద్విడ్భ్యాం | ద్విషోః | ద్విషోః | శబ్దాల అన్తాన్ని |
| స | వేధసౌ | వేధసౌ | వేధోభ్యాం | వేధోభ్యాం | వేధోభ్యాం | వేధసోః | వేధసోః | నిర్ణయించాలి. |
| హ | దుహౌ | దుహౌ | ధుగ్భ్యాం | ధుగ్భ్యాం | ధుగ్భ్యాం | దుహోః | దుహోః | ఈ శబ్దాలకు |
| ణ | సుగణౌ | సుగణౌ | సుగణ్భ్యాం | సుగణ్భ్యాం | సుగణ్భ్యాం | సుగణోః | సుగణోః | ముందు ఇచ్చిన |
| న | శ్వానౌ | శ్వానౌ | శ్వభ్యాం | శ్వభ్యాం | శ్వభ్యాం | శునోః | శునోః | అక్షరాలు ఈ |
| ప | గుపౌ | గుపౌ | గుబ్భ్యాం | గుబ్భ్యాం | గుభ్యాం | గుపోః | గుపోః | శబ్దాలఅంతాలు |

ఇంతవరకు ఇచ్చిన కొన్ని శబ్దాల రూపాలు ఆయా విభక్తుల్లో ఎలా ఉన్నాయో తులనాత్మకంగా (పోల్చి) పరిశీలించండి. శబ్దాల సాధారణ స్వరూపాలు అవగతం అవుతాయి. ఇక్కడ గ్రహించవలసిన కొన్ని విశేషాలున్నాయి. హలన్త శబ్దాల దగ్గర 'సుప్' ప్రత్యయాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. శబ్దాల చివరి భాగాలు గమనించండి.

బహువచనం

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| చ | పయోముచః | పయోముచః | పయోముగ్భిః | పయోముగ్భ్యః | పయోముగ్భ్యః | పయోముచాం | పయోముక్షు |
| జ | భిషజః | భిషజః | భిషగ్భిః | భిషగ్భ్యః | భిషగ్భ్యః | భిషజాం | భిషక్షు |
| త | మరుతః | మరుతః | మరుద్భిః | మరుద్భ్యః | మరుద్భ్యః | మరుతాం | మరుత్సు |
| ద | దివిషదః | దివిషదః | దివషద్భిః | దివిషద్భ్యః | దివిషద్భ్యః | దివిషదాం | దివిషత్సు |
| న | రాజానః | రాజ్ఞః | రాజభిః | రాజభ్యః | రాజభ్యః | రాజ్ఞాం | రాజసు |
| న | గుణినః | గుణినః | గుణిభిః | గుణిభ్యః | గుణిభ్యః | గుణినాం | గుణిషు |
| శ | విశః | విశః | విడ్భిః | విడ్భ్యః | విడ్భ్యః | విశాం | విట్సు |
| ష | ద్విషః | ద్విషః | ద్విడ్భిః | ద్విడ్భ్యః | ద్విడ్భ్యః | ద్విషాం | ద్విట్సు |
| స | వేధసః | వేధసః | వేధోభిః | వేధోభ్యః | వేధోభ్యః | వేధసాం | వేధస్సు |
| హ | దుహః | దుహః | దుగ్భిః | దుగ్భ్యః | దుగ్భ్యః | దుహాం | ధుక్షు |
| ణ | సుగణః | సుగుణః | సుగుణ్భిః | సుగణ్భ్యః | సుగణ్భ్యః | సుగణామ్ | సుగణ్ట్సు |
| న | శ్వానః | శునః | శ్వభిః | శ్వభ్యః | శ్వభ్యః | శునామ్ | శ్వసు |
| ప | గుపః | గుపః | గుబ్భిః | గుబ్భ్యః | గుబ్భ్యః | గుపామ్ | గుప్సు |

ఈ హలంత శబ్దాలన్నింటిలోను పోలికలు స్పష్టంగా కనిపిస్తాయి.

| క్ర. సం. | శబ్దము అంతము | ప్రథమా విభక్తి | ద్వితీయా విభక్తి | తృతీయా విభక్తి | చతుర్థీ విభక్తి | పంచమీ విభక్తి | షష్టీ విభక్తి | సప్తమీ విభక్తి |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ద.పుం<br>అస్మద్ శబ్దం - నేను | అహమ్<br>నేను | మామ్, మా<br>నన్ను | మయా<br>నాచే | మహ్యమ్; మే<br>నా కొరకు | మత్<br>నావలన | మమ, మే<br>నాకు, నాయొక్క | మయి<br>నాయందు |
| 2 | ద.పుం.<br>యుష్మద్శబ్దం నీవు | త్వమ్-నీవు | త్వామ్-త్వా<br>నిన్ను | తయా<br>నీచే | తుభ్యమ్,తే<br>నీకొరకు | త్వత్<br>నీవలన | తవ;తే<br>నీకు,నీయొక్క | త్వయి<br>నీయందు |
| 3 | ఇదమ్,మకారాన్త:<br>పుం.వీడు | అయమ్<br>వీడు,ఇది | ఇమమ్,ఏనమ్<br>వీనిని,దీనిని | అనేన,ఏనేన<br>వీనిచే,దీనిచే | అస్మై<br>వానికొరకు | అస్మాత్<br>వీనివలన | అస్య<br>వీనికి | అస్మిన్<br>వీనియందు |
| 4 | ఇదస్<br>మకా.స్త్రీ. | ఇయమ్<br>ఈమె/ఇది | ఇమామ్<br>ఏనామ్<br>ఈమెను దీనిని | అనయా<br>ఏనయా<br>ఈమెచే,దీనిచే | అస్యై<br>ఈమె/దీని<br>కొరకు | అస్యా:<br>ఈమె/దాని<br>వలన | అస్యా:<br>ఈమె/దీనికి<br>యొక్క | అస్యామ్<br>ఈమె/దీని<br>యందు |
| 5 | అదస్.సకారాన్త:<br>పుం<br>వాడు,అది | అసౌ<br>వాడు,అది | అముమ్<br>వానిని,దానిని | అమునా<br>వానిచే,దానిచే | అముష్మై<br>వానికొరకు | అముష్మాత్<br>వానివలన | అముష్య వానికి<br>వానియొక్క | అముష్మిన్<br>వానియందు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తత్-తకారాన్తః ఏతత్-దకారాన్తః పుంలింగః నీడు.ఇది | ఏషః | ఏతమ్/ఏనమ్ | ఏతేన/ఏనేన | ఏతస్మై | ఏతస్మాత్ | ఏతస్య | ఏతస్మిన్ |
| 1 ద.పుం అస్మద్‌శబ్దం | ఆవామ్ మేమిరు వురము | ఆవామ్,నౌ మీఇద్దరిచేత | ఆవాభ్యాం వామ్ మీ | ఆవాభ్యాంనౌ మీ ఇద్దరి కొరకు | ఆవాభ్యామ్, మాఇద్దరివలన | ఆవయోః,నౌ మాఇద్దరికి | ఆవయోః మా ఇద్దరి యందు |
| 2 యుష్మద్ | యువామ్ మీరిరువురు | యువామ్,వామ్ మీఇద్దరను | యువాభ్యాం మీ ఇద్దరిచేత | యువాభ్యాం, వామ్, మీ ఇద్దరికొరకు | యువాభ్యాం మీ ఇద్దరి వలన | యువయోః వామ్ మి ఇద్దరికి | యువయోః మీ ఇద్దరియందు |
| 3 ఇదమ్-మ కారాన్తః పుం. | ఇమౌ,వీరిరు వురు,ఈ రెండు | ఇమే,ఏనౌ వీరిరువురును | ఆభ్యామ్ వీరిరువురిచే | ఆభ్యామ్ వీరిరువుకు | ఆభ్యామ్ వీరిరువురి వలన | అనయోః ఏనయోః వీరిరువురకు | అనయోః ఏనయోః వీరిరువురియందు |

ఇదమ్ అనేమకారాన్త నపుంసకలింగం తృతీయావిభక్తినుండి పుంలింగ శబ్దంలాగానే చెప్పాలి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఇదమ్ ॥స్త్రీ ఇది,ఈమె | ఇమే వీరిద్దరు | ఇమే,ఏనే వీరిద్దరిని | ఆభ్యామ్ వీరిద్దరిచే | ఆభ్యామ్ వీరిద్దరికొరకు | ఆభ్యామ్ వీరిద్దరివలన | అనయోః ఏనయోః | అనయోః,ఏనయోః వీరిద్దరియందు |
| 4 అదస్.సకా-స్త్రీ. | అమూ | అమూ | అమూభ్యాం | అమూభ్యాం | అమూభ్యాం | అముయోః | అముయోః |
| 5 అదస్-సకా. పుం. | అమూ వారిద్దరు/ | అమూ వారిద్దరిని | అమూభ్యామ్ వారిద్దరిచే | అమూభ్యామ్ వారిద్దరికొరకు | అమూభ్యామ్ వారిద్దరివలన | అముయోః వారిద్దరికి | అముయోః వారిద్దరియందు |
| 5 కిమ్-మకారాన్తః పుం. | కౌ / తౌ | కౌ / తౌ | కాభ్యాం/ తాభ్యాం | కాభ్యాం/ తాభ్యాం | కాభ్యాం తాభ్యాం | కయోః/ తయోః | కయోః/తయోః |
| తత్.దకారాన్తః పుం.ఏతత్.ద. పుం. | తౌ | ఏతౌ/ఏనౌ | ఏతాభ్యాం | ఏతాభ్యామ్ | ఏతాభ్యాం | ఏతయోః | ఏతయోః |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 అస్మద్ శబ్దం | వయమ్ మేము | అస్మాన్,నః మమ్ములను | అస్మాభిః మాచే | అస్మభ్యమ్ నః మాకొరకు | అస్మత్ మా వలన | అస్మాకం;నః మాకు,మాయొక్క | అస్మాసు మాయందు |
| 2 యుష్మద్శబ్దం | యూయమ్ మీరు | యుష్మాన్,వః మిమ్ములను | యుష్మాభిః మీచే | యుష్మభ్యం వః మీకొరకు | యుష్మత్ మీవలన | యుష్మాకం వః మీకు,మీయొక్క | యుష్మాసు మీయందు |
| 3 ఇదమ్.మకారాన్త: స్త్రీ /ఇది,ఈమె | ఇమాఃవీరు అమీ | ఇమాః,ఏనాః వీరిని | ఆభిః వీరిచే | ఆభ్యః వీరికొరకు | ఆభ్యః వీరివలన | ఆసామ్ వీరికి/యొక్క | ఆసు వీరియందు |
| అదస్ మకా. స్త్రీ. | అమూః వీరు | అమూః వీరిని | అమూభిః వీరిచే | అమూభ్యః వీరికొరకు | అమూభ్యః వీరివలన | అమూషాం వీరికి | అమూషు వీరియందు |
| 4 అదస్.సకా పుం.వీడు | వారు,అని | అమూన్ వారిని/వాటిని | అమీభిః వారిచే/వాటిచే | అమీభ్యః వారికొరకు | అమీభ్యః వారివలన | అమీషామ్ వారికి/యొక్క | అమీషు వారియందు |
| 5 కిమ్-మకారాన్త: పుం.తత్.ద. ఏతద్-దకారాన్త: పుం. | ఏతే | ఏతాన్/ఏనాన్ | ఏతైః | ఏతేభ్యః | ఏతేభ్యః | ఏతేషామ్ | ఏతేషు |
| | కే/తే | కాన్/తాన్ | కైః/తైః | కేభ్యః/తేభ్యః | కేభ్యః/తేభ్యః | కైషామ్/తేషామ్ | కేషు/తేసు |

పై శబ్దాల్లో కిమ్ అంటే ఏమిటి అని అర్థం. దీనిలాగానే తత్ ఏతత్ శబ్దాలు సమానంగా రూపాలుండటం గమనించండి. యుష్మద్ అస్మద్ శబ్దాలకు కూడా చివళ్లు సమానంగా ఉండటం గమనించండి. ఇలాగే ఇదమ్, అదస్ శబ్దాలు. ఏకవచన రూపాలన్నీ ఒకచోట, ఇలాగే ద్వివచన - బహువచనరూపాలు వేరుగాను ఇవ్వడం జరిగింది. వాక్యాల్లో ప్రయోగించదలచినప్పుడు వీటి అర్థాలను గమనించి వాడవచ్చు.

# వాక్య ప్రయోగాల్లోని భేదాలు

వెనుక,వాక్యం అంటే కొన్ని పదాల సముదాయం అని, ఆపదాలు, సుబన్త పదాలు తిజన్త పదాలు అని రెండురకాలుగా ఉంటాయని, కనీసం, ఒక సుబన్త శబ్దం ఒక తిజన్త శబ్దం ప్రయోగిస్తేనే వాక్యం అవుతుందని చెప్పడం జరిగింది. ఈవాక్య ప్రయోగాల్లో సుబన్త శబ్దాలను కర్త, కర్మ మొదలైన కారకాలుగా క్రియాపదంతో అన్వయించడం జరుగుతుందని, ఈ కారకపదాలే ప్రథమ మొదలైన విభక్తుల్లో ప్రయోగింప బడతాయని కూడా చెప్పడం జరిగింది. ఇప్పుడు వాక్యప్రయోగాలు ఎన్ని రకాలుగా ఉంటాయో చూద్దాం.

వాక్యాల్లో ప్రధానంగా ఉండే అంశాన్ని బట్టి వాక్యప్రయోగాల్లోని భేదాన్ని శాస్త్రకారులు గుర్తించి నిర్దేశించారు. ఈ వాక్య ప్రయోగాలు మూడు రకాలుగా ఉంటాయి.

1) కర్తకు ప్రాధాన్యం ఉన్న వాక్య ప్రయోగం - దీన్ని 'కర్తరి ప్రయోగః' అని అంటారు. దీన్నే ఆంగ్లంలో (Active voice) అని అంటారు.

2) కర్మకు ప్రాధాన్యం ఉన్న ప్రయోగం - దీన్ని 'కర్మణిప్రయోగః' అని అంటారు. దీన్నే 'Passive Voice' అని అంటారు.

3) క్రియకే ప్రాధాన్యం ఉన్న ప్రయోగం. దీన్ని 'భావే ప్రయోగః' అని అంటారు. 'భావం' అంటే ధాతువుయొక్క అర్థమైన క్రియ (పని).

**1) కర్తరి ప్రయోగః (కర్తకు ప్రాధాన్యం ఉన్న వాక్యప్రయోగం)** (Active Voice) ఏ వాక్యాన్ని విన్నప్పుడు ఆ వాక్యంలోని క్రియాపదం కర్తనే బోధిస్తూ, కర్తతోనే ప్రధానంగా అన్వయిస్తుందో ఆ వాక్యం కర్తృప్రాధాన్యం గల వాక్యం. కనుక అక్కడ 'కర్తరి ప్రయోగః' అని వ్యవహారం. ఉదా : రామః అన్న భునక్తి - రాముడు అన్నం తింటున్నాడు.

ఇక్కడ 'తింటున్నాడు' అనే క్రియాపదం, కర్తతో అన్వయించిన క్రియను బోధించింది. అంటే ఇక్కడ క్రియాపదానికి కర్త ఎవరో (అంటేతినేవారెవరో) వాని ఆకాంక్ష (అవసరం) కలిగి, ఆ కర్తతోనే అన్నింటి కంటే ముందుగా అన్వయిస్తున్నది. కనుక - రామః భునక్తి (రాముడు తింటున్నాడు) అని రామునికే తినడం అనే క్రియతో సాక్షాత్ సంబంధం. ఆ తరువాతే ఏమి తింటున్నాడు? అనే ప్రశ్న, అన్నాన్ని **తింటున్నాడు** 'అన్నం భునక్తి' అని సమాధానం.

ఇలాగే పశ్యతి - చూస్తున్నాడు. కః పశ్యతి? ఎవడు చూస్తున్నాడు.

బాలః పశ్యతి - బాలుడు చూస్తున్నాడు. ఇలా క్రియకు కర్తతో అన్వయం, పూర్తయిన తరువాతనే దేన్ని చూస్తున్నాడు? కిం పశ్యతి? ఎక్కడ చూస్తున్నాడు? కుత్ర పశ్యతి? ఇలా ప్రశ్నలు వాటి సమాధానాలు అన్వయిస్తాయి. మరికొన్ని వాక్యాలు చూడండి. ఇక్కడ కర్తృపదం ప్రథమావిభక్తిలోనే ప్రయోగింపబడుతుంది.

1) కృష్ణః పఠతి - కృష్ణుడు చదువుతున్నాడు.
2) బాలికా క్రీడతి - బాలిక ఆడుతున్నది.
3) ఉపాధ్యాయః అధ్యాపయతి - ఉపాధ్యాయుడు బోధిస్తున్నాడు.
4) శిష్యాః శ్రుణ్వన్తి - శిష్యులు వింటున్నారు.
5) అశ్వాః ధావన్తి - గుర్రాలు పరుగెత్తుతున్నాయి.
6) గావః చరన్తి - గోవులు మేస్తున్నాయి. ఈ వాక్యాల్లో క్రియా పదం వినగానే ఆ క్రియను నిర్వహిస్తున్నవారెవరు? అని - కర్తయొక్క ఆకాంక్ష కలిగి కర్తను అన్వయించగానే వాక్య పరిసమాప్తి అవుతున్నది. కనుక ఇది 'కర్త ప్రయోగం' .

2) కర్మణిప్రయోగః- 'కర్మ' యొక్క అన్వయానికి యోగ్యత కలవి, కర్మాకాంక్ష (కర్మయొక్క అవసరం) కలవి అయిన ధాతువులు సకర్మక ధాతువులని వెనుక చెప్పడం జరిగింది. ఈ ధాతువులు కల వాక్యాల్లో, ధాతువును (క్రియాపదాన్ని) వినగానే కర్మపదమే సాక్షాత్తుగా క్రియతో అన్వయిస్తే, అక్కడ కర్మకు ప్రాధాన్యం ఉన్నట్లు. ఇలా కర్మ ప్రాధాన్యం కల వాక్యాన్ని 'కర్మణిప్రయోగః' అని అంటారు. కర్మ ప్రాధాన్యం గల వాక్యంలో కర్మవాచకం ప్రథమా విభక్తిలోనే ఉంటుంది.

ఈ క్రింది ఉదాహరణలు చూడండి.

1) రామేణ అన్నం భుజ్యతే - రామునిచే అన్నము తినబడుతున్నది.
2) బాలేన చిత్రం దృశ్యతే - బాలునిచే చిత్రం చూడబడుతున్నది.
3) కృష్ణేన పాఠః పఠ్యతే - కృష్ణునిచే పాఠం చదవబడుతున్నది.
4) రామేణ వాలీ హతః - రామునిచే వాలి చంపబడినాడు.
5) శిష్యైః పాఠాః శ్రూయన్తే - శిష్యులచే పాఠాలు వినబడుతున్నాయి.

ఈవాక్యాల్లో దేనికిప్రాధాన్యం అనేది క్రియాపాన్ని బట్టి నిర్ణయించాలి.

ఈ వాక్యాల్లో క్రియాపదాలు వినగానే తినబడేది, చూడబడేది, చదువబడేది, చంపబడేది, వినబడేది ఏమిటో వాటి గురించిన ప్రశ్నే పుడుతుంది. కనుక అన్నం,

చిత్రం, పాఠః, వాలీ, పాఠాః అనే ప్రథమావిభక్తిలో ప్రయోగింపబడినవేవో అవే సాక్షాత్తుగా అన్వయించాయి. ఇక్కడ క్రియాపదం వినగానే కర్తను గురించిన ప్రశ్న, ఎవరు? అనేది పట్టలేదు. దేనిని/ఎవరిని? అనే ప్రశ్నే ముందు పుడుతున్నది. అంటే కర్త ఎవరనే ఆకాంక్షకంటే ముందే, కర్మను గురించిన ఆకాంక్ష పుట్టి, కర్మవాచకాన్ని క్రియాపదంతో కలిపి అన్వయించగానే, వాక్య పరిసమాప్తి అవుతున్నది. ఆ తరువాతే కర్తను గురించిన ప్రశ్నపుట్టి, తృతీయా విభక్తిచే నిర్దేశింపబడిన కర్తృపదం అన్వయిస్తున్నది.

ఇక్కడ ఈ రెండురకాల ప్రయోగాల్లోనూ, అంటే 'కర్తరిప్రయోగం' 'కర్మణిప్రయోగం' ఈ రెండుచోట్లా ప్రథమావిభక్తిచే నిర్దేశింపబడిందేదో అదే ప్రధానమైందని గుర్తించాలి. కర్తరి ప్రయోగంలో కర్త ప్రథమావిభక్తిలో ఉంటుంది. కర్మణిప్రయోగంలో కర్మ-ప్రథమావిభక్తిలో ఉంటుంది. కర్తరి ప్రయోగాన్ని కర్మప్రయోగంగాను, కర్మణి ప్రయోగాన్ని కర్తరి ప్రయోగంగాను మార్చవచ్చు. తెలుగులోను, ఇంగ్లీషులోను ఇలాంటి మార్పు ఉంటుంది. చూడండి-

The man killed the tiger మనిషి పులిని చంపాడు. (Active Voice - కర్తరి ప్రయోగం) దీన్ని కర్మణి ప్రయోగంగా మారిస్తే - The tiger was killed by the man పులిమనిషిచే చంపబడింది. దీన్ని సంస్కృతంలో అయితే 1) మనుష్యఃవ్యాఘ్రం జఘాన (A.V) వ్యాఘ్రః మనుష్యేణహతః। (P.V) ఇలాగే

'కృష్ణః కంసం హన్తి' - కృష్ణుడు కంసుని చంపుతున్నాడు. ఇక్కడ కృష్ణుడు చంపుతున్నవాడు కనుక కర్త. చంపబడినవాడు కంసుడు కర్మ. ఇక్కడ కర్తకే క్రియతో సాక్షాత్తుగా సంబంధం ఉండి హన్తి (చంపుతున్నాడు) అనగానే ఎవడు? అనే ప్రశ్నపుట్టి, కృష్ణః (కృష్ణుడు) అనే పదం అన్వయిస్తున్నది. ఆ తరువాతే ఎవరిని? అనే ప్రశ్నపుట్టి కంసుడు కర్మగా అన్వయిస్తున్నాడు. ఇక్కడ కర్తకు ప్రాధాన్యం ఉంది కనుక కర్తరి ప్రయోగం. దీన్ని కర్మణిప్రయోగంగా మార్చితే-

'కృష్ణేన కంసః హతః' కృష్ణునిచే కంసుడు చంపబడినాడు. ఇక్కడ హతః (చంపబడినాడు) అనే క్రియాపదాన్ని వినగానే, ఎవడు చంపబడినాడు? అనే ప్రశ్న పుట్టి, కంసః (కంసుడు) అను కర్మవాచకం అన్వయించింది. ఆ తరువాతే ఎవరిచేత చంపబడ్డాడు? అనే ప్రశ్నపుడితే 'కృష్ణేన' (కృష్ణునిచే) అనే కర్తృవాచకం అన్వయించింది. కనుక ఈ వాక్యంలో ప్రధానమైన 'కర్మ', ప్రథమా విభక్తిలో ప్రయోగింపబడింది. కర్తృ వాచకం తృతీయా విభక్తిలోనికి మారింది. కర్మ అప్రధానమైనప్పుడు ద్వితీయా విభక్తిలోను, ప్రధానమైనప్పుడు ప్రథమావిభక్తిలోను ప్రయోగింపబడుతుంది.

ఇటువంటి మార్పు మరికొన్ని వాక్యాల్లో చూడండి.

1) రామః వస్త్రం ధరతి - రాముడు వస్త్రమును ధరించుచున్నాడు. (కర్తరి.ప్ర) రామేణ వస్త్రం ధ్రియతే - రామునిచే వస్త్రము ధరింపబడుచున్నది (కర్మణి.ప్ర.) ఇక్కడ పై వాక్యంలో కర్మ అయిన వస్త్రం ద్వితీయలోను, రెండవ వాక్యంలో ప్రథమలోను ఉన్నది. ప్రథమా - ద్వితీయా విభక్తుల్లో 'వస్త్రం' అనే రూపం సమానం.

2) విష్ణుః లక్ష్మీం పశ్యతి - విష్ణువులక్ష్మిని చూచుచున్నాడు (కర్తరి ప్రయోగం) విష్ణునా లక్ష్మీః దృశ్యతే - విష్ణువుచే లక్ష్మిచూడబడుచున్నది (కర్మణి ప్రయోగం)

3) హనుమాన్ సీతాం దృష్టవాన్ - హనుమంతుడు సీతను దర్శించినాడు (కర్తరి.ప్ర.) హనుమతా సీతా దృష్టా - హనుమంతునిచే సీత చూడబడినది (కర్మణి.ప్ర.)

4) రావణః లంకాం పాలయతి - రావణుడు లంకను పాలించుచున్నాడు (కర్తరి.ప్ర) రావణేన లంకా పాల్యతే - రావణునిచే లంక పాలింపబడినది. (కర్మణి.ప్ర.)

శ్లోకం కంఠస్థం చేయండి.

శ్లో॥ పీయూషేణ కృతార్థితా దివిషదో, లక్ష్మ్యా హరిః ప్రీణితః,
చంద్రార్ధేన విభూషితః పశుపతిః, కల్పద్రుమై ర్వాసవః।
ప్రాప్యాప్యున్మథనం స్వయం జలధినా తైఃతైశ్చ తే ప్రీణితాః
తస్యాగస్త్యమునౌ ప్రహర్తరి పరం కేనాపి నోక్తం వచః ॥

తా :- అమృతదానం ద్వారా దేవతలంతా కృతార్థులు చేయబడ్డారు. లక్ష్మీదేవిని ఈయడం ద్వారా శ్రీహరి ఆనందింపజేయబడ్డాడు. అర్ధచంద్రకళను ఈయడం ద్వారా పశుపతి అలంకరింపబడ్డాడు. కల్పవృక్షాలద్వారా దేవేంద్రుడు ఆనందింప జేయబడ్డాడు. స్వయంగా మథనాన్ని పొందిన సముద్రునిచే ఆయా వస్తువులచేత వారు ఆనందింపచేయబడ్డారు. (కాని) ఆ సముద్రునికే అగస్త్యమునివల్ల ఆత్మహరణం ఏర్పడ్డప్పుడు ఎవ్వనిచేత పలుకైనా పలుకబడలేదుకదా!

ఈ శ్లోకంలో కర్మణిప్రయోగాలు ఈ క్రిందివిధంగా ఉన్నాయి.

1) పీయూషేణ దేవాః కృతార్థితాః 2) లక్ష్మ్యా హరిః ప్రీణితః 3)చంద్రార్ధేనపశుపతిః విభూషితః 4) కల్పద్రుమైః వాసవః (విభూషితః) 5) జలధినా తైఃతైశ్చ తే ప్రీణితాః 6) కేనాపి వచః నోక్తమ్. ఇవన్నీ కర్మప్రయోగాలు. వీటిని కర్తరి ప్రయోగాలుగా మార్చవచ్చు ఎలాగో చూడండి.

1)ఎ) జలధినా - పీయూషేణ - దివిషదః - కృతార్థితాః । (కర్మణి.ప్రయోగః)

సముద్రునిచే అమృతంద్వారా దేవతలు కృతార్థులు చేయబడ్డారు. ఇక్కడ సముద్రుడు కర్త. అమృతంసాధనం - దేవతలు కర్మ. కృతార్థులు చేయబడటంక్రియ.

బి) జలధి:- పీయూషేణ - దివిషద: - కృతార్థయతిస్మ । (కర్తరిప్రయోగ:)

సముద్రుడు అమృతంద్వారా దేవతలను కృతార్థులనుచేశాడు.

ఇక్కడ కర్త ప్రథామావిభక్తిలోనికి (జలధి) కర్మ ద్వితీయావిభక్తిలోనికి (దేవతా:) మారింది. క్రియా పదం కూడా కర్తకు అన్వయించే విధంగా మారింది.

2)ఎ) జలధినా - లక్ష్మ్యా - హరి: ప్రీణిత: । (కర్మణి ప్రయోగ:)

సముద్రునిచే లక్ష్మీద్వారా, హరి, సంతోషపరుపబడినాడు.

బి) జలధి:- లక్ష్మ్యా - హరిం - ప్రీణాతిస్మ । (కర్తరి ప్రయోగ:)

సముద్రుడు లక్ష్మీద్వారా శ్రీహరిని ఆనందింపజేసెను.

3)ఎ) జలధినా - చంద్రార్ధేన - పశుపతి: - విభూషిత: । (కర్మణిప్రయోగ:)

సముద్రునిచే అర్ధచంద్రునిద్వారా ~~ఈశ్వరుడు~~ అలంకరింపబడినాడు.

బి) జలధి: చంద్రార్ధేన - పశుపతిం - విభూషయతిస్మ । (కర్తరిప్రయోగ:)

సముద్రుడు అర్ధచంద్రునిద్వారా ~~ఈశ్వరుని~~ అలంకరించెను.

4)ఎ)జలధినా - కల్పద్రుమై: - వాసవ: - విభూషిత: । (కర్మణిప్రయోగ:)

సముద్రునిచే కల్పవృక్షములద్వారా దేవేంద్రుడు అలంకరింపబడినాడు.

బి) జలధి:- కల్పద్రుమై: - వాసవం - విభూషితవాన్ । (కర్తరి ప్రయోగ:)

సముద్రుడు కల్పవృక్షములద్వారా దేవేంద్రుని అలంకరించినాడు.

5) ఎ) జలధినా - తై:తైశ్చ - తే - ప్రీణితా: । (కర్మణి ప్రయోగ:)

సముద్రునిచే ఆయా వస్తువులచే వారు ఆనందింపబడినారు.

బి) జలధి: :- తై: తైశ్చ - తాన్ - ప్రీణాతిస్మ । (కర్తరిప్రయోగ:)

సముద్రుడు ఆయావస్తువులచే వారిని ఆనందింపజేసినాడు.

6) (పరం) కేనఅపి - వచ: - న. ఉక్తమ్ (కర్మణి ప్రయోగ:)

(కాని) ఎవ్వనిచేతగూడ మాట పలుకబడలేదు.

బి) (పరం) కోఽపి - వచ: - న ఉక్తవాన్ (కర్తరిప్రయోగ:)

(కాని) ఎవ్వడును - మాటను - పలుకలేదు.

పై వాక్యాల్లో "జలధి" (సముద్రం) కర్త. అది, కర్తరిప్రయోగంలో ప్రథమావిభక్తిలోను, కర్మణిప్రయోగంలోతృతీయావిభక్తిలోను నిర్దేశింపబడింది. "పీయూషేణ" "లక్ష్మ్యా", "చంద్రార్ధేన, "కల్పద్రుమై:" "తై: తైశ్చ" "అనే పదాలు

సాధన వాచకాలు అంటే కృతార్థులను చేయడం మొదలైన క్రియల్లో సాధనంగా ఉపకరించాయన్నమాట. కనుక వాటికి కూడా తృతీయా విభక్తి వాడబడింది. ప్రథమావిభక్తిలో నిర్దేశింపబడిన 1) దివిషదః 2) హరిః 3)పశుపతిః 4) వాసవః 5) తే (వారు) 6) 'వచః' అనేవి కర్మవాచకాలు ప్రథమావిభక్తిలో వాడబడటం వల్ల కర్మకు ప్రాధాన్యం కలిగి ఈ వాక్యాలు (ఎ) అని నిర్దేశింపబడినవాక్యాలు "కర్మణి ప్రయోగాలు' ' ఇక్కడ కర్మను బట్టి క్రియా పదాలు ప్రయోగింపబడ్డాయి. (బి) అనినిర్దేశించినవి, కర్తరి ప్రయోగాలు. ఇక్కడ కర్తప్రథమా విభక్తిలో ఉంది.

ఇంతవరకు కర్తరి ప్రయోం (Active voice) కర్మణిప్రయోగం (Passive Voice) అనే రెండురకాల ప్రయోగాలు గురించి, అవి పరస్పరం మార్పుచెందే విధానం గురించి తెలుసుకున్నాం. ఇప్పుడు మూడవ కోవకు చెందిన భావే ప్రయోగాల గురించి తెలుసుకుందాం.

**3) భావేప్రయోగః :-** 'భావం' అంటే ధాతువు యొక్క అర్థమైనక్రియ. క్రియకు ప్రాధాన్యం స్ఫురించేలా వాక్యప్రయోగం చేస్తే దాన్ని 'భావేప్రయోగం' అంటారు. అంటే కర్తకు కూడా ప్రాధాన్యం ఉండదన్నమాట. ఉదాహరణాలు చూడండి.

1) శేషపర్యంకే విష్ణునా నిద్రాయతే - శేషశయనం పై విష్ణువుచే నిద్రింపబడినది. ఇక్కడ నిద్రించడం అనే క్రియకే ప్రాధాన్యం ఉంటుంది.

2) నద్యా-క్షీయతే - నదిచే క్షయింపబడుతున్నది. (నది క్షీణిస్తున్నదనే అభిప్రాయం. అయితే ఇక్కడ కర్త కంటే క్రియకే ప్రాధాన్యం ఉన్నది)

3) పశుభిః పక్షిభిశ్చ జీవ్యతే - పశువులచేతను పక్షులచేతను బ్రతుకబడుతున్నది.

4) మయా భూయతే - నాచే ఉండబడుచున్నది. తేనభూతమ్-ఆతనిచే ఉండబడినది.

5) దేవదత్తేన మ్రియతే - దేవదత్తునిచే మరణింపబడుచున్నది.

ఈ క్రింది శ్లోకంలో భావేప్రయోగం ఎలా ఉన్నదో చూడండి-

శ్లో॥ బీజైరంకుతం, లతాభిరుదితం, వల్లీభిరుజ్జృంభితమ్,
కందైః కందలితం, జనైఃప్రముదితం, ధారాధరే వర్షతి ।
భ్రాతశ్చాతక! పాతకం కిమపితే నమ్యఙ్ నజానీమహే
యేనాస్మిన్ నపతన్తి చంచుపుటకే ద్విత్రాః పయోబిందవః ॥

తా :- 'బీజాలు అంకురించాయి. లతలు ఆవిర్భవించాయి. వల్లులు విజృంభించాయి, దుంపలు మొలకలెత్తాయి - జనులు ఆనందించారు, ఎప్పుడు? మేఘం వర్షించగానే. కానీ ఓ సోదరా! చాతకమా! నీపాపం ఏమిటో మాకు అర్థం కావడంలేదు.ఎందువల్లనంటే (ఇంతవర్షంపడుతున్నా) నీ ముక్కుపుటాల్లో (నోటిలో) రెండు మూడు నీటిచుక్కలు కూడా పడటం లేదు.

ఈ శ్లోకంలో మొదటి రెండు పాదాల్లో భావే ప్రయోగాలున్నాయి.

1) బీజై: అంకురితమ్ - విత్తనములచే మొలకెత్తబడింది.

2) లతాభి: ఉదితమ్ - లతలచే ఉదయింపబడింది (పుట్టబడింది)

3) వల్లీభి: ఉజ్జృంభితమ్ - (ఇదివరకే పుట్టి ఉన్న) లతలచే ఉజ్జృంభింపబడింది. (ఉజ్జృంభం అంటే పెరుగుదల)

4) కందై: కందలితమ్ - దుంపలచే మొలకెత్తబడింది.

5) జనై: ప్రముదితమ్ - జనులచే ఆనందింపబడింది.

తెలుగుభాషలో భావేప్రయోగం అంతగా సుందరంకాదు. కాని, సంస్కృతంలో ఇలాంటి వాక్యప్రయోగాలు కోకొల్లలు. పై భావే ప్రయోగాలను కర్తరి ప్రయోగాలుగా మార్చవచ్చు. ఎలాగంటే.

1) బీజాని అంకురన్తి - బీజాలు అంకురిస్తున్నాయి.

2) లతా: ఉదియన్తి - లతలు పుడుతున్నాయి.

3) వల్ల్య: జృంభంతే - వల్లులు (లతలు) వికసిస్తున్నాయి.

4) కందా: కందలన్తి - దుంపలు మొలకెత్తుతున్నాయి.

5) జనా: ప్రమోదన్తే - జనులు ఆనందిస్తున్నారు. ఈ ప్రయోగాల్లో వెనుక భావేప్రయోగాలుగా ఇవ్వబడిన వాక్యాలు, కర్తరి ప్రయోగాలుగా మారితే ఎలా ఉంటుందో చూపబడింది.

ఇంకొక శ్లోకంలో భావే ప్రయోగాలు ఎలా ఉంటాయో చూడండి.

## సంస్కృత విజ్ఞానశాస్త్రజ్ఞులు :

1. ఆపస్తంబుడు - కాత్యాయనుడు వీరు క్రీ.పూ. వారు గణితంలోని జ్యామెంట్రీకిసంబంధించిన ట్రయాంగిల్స్, రెక్టాంగిల్స్, స్క్వేర్స్ గురించి నిరూపించారు.

2.'ఆల్జీబ్రా' కు సంబంధించిన నిరూపణ - వినియోగం ఆర్యభట్టుని గ్రంథాల్లో ఉంది.

3.భాస్కరాచార్యుని లీలావతీగణితం భారతీయ ప్రాచీన గణితజ్ఞానికి ప్రత్యక్ష నిదర్శనం. ఈగ్రంథాలన్నీ అరబ్బీభాషలోనికి అనువదింపబడ్డాయి.

4. భోజుడు ఇంజనీరింగ్‌కు సంబంధించిన వాస్తు గ్రంథాలో రచించాడు. సూరాంగణసూత్రధారంవాటిలో ఒకటి.

5. ప్రాచీన నౌకానిర్మాణంపై 'యుక్తి కల్పితం' అనే గ్రంథం వ్రాయబడింది.

6. ఆయుర్వేదం - ప్రాచీనభారతీయ రసాయనశాస్త్రానికి నిదర్శనం.

7. ఖగోళవిజ్ఞానంలోను ప్రాచీనభారతీయునులో ముందున్నారు.

# కర్తృకారకం - (ప్రథమా - తృతీయా విభక్తులు)

ఏదైనా ఒకపని జరగాలంటే, దాన్ని నిర్వహించేవాడొకడుండాలి. ఎవడు/ఏది - లేకపోతే ఒక పనిజరగదో ఆ పనిలో వాడు, అది కర్త. కర్త అంటే చేయువాడు అని అర్థం. పనినే సంస్కృతంలో 'క్రియ' అంటారు. దీన్ని బోధించే పదాన్ని క్రియాపదం అని అంటారు. ఈ క్రియాపదంతో అన్నింటికంటే ముందు అన్వయించే యోగ్యత ఒక్క కర్తను బోధించే పదానికే ఉంటుంది. వాక్యంలో ఈ కర్త ఒక్కొక్కప్పుడు ప్రధానంగాను, ఒక్కొక్కప్పుడు అప్రధానంగాను క్రియతో అన్వయించడం ఉంటుంది. ప్రధానంగా అన్వయించినప్పుడు కర్తృవాచకం ప్రథమా విభక్తిలో ఉంటుంది. ఉదా : రామః భునక్తి - రాముడు తింటున్నాడు. ఈ కర్త అప్రధానం అయినప్పుడు తృతీయా విభక్తిలో ప్రయోగింపబడటం ఉంటుంది. రామేణ అన్నం భుజ్యతే - రామునిచే అన్నం తినబడుతున్నది. ఇక్కడ తినబడే అన్నానికి ప్రాధాన్యం. తినేకర్తకు (రామునికి) అప్రాధాన్యం. కనుక కర్త-తృతీయా విభక్తిచే నిర్దేశింపబడింది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) | వృక్షః | సమేధతే | చెట్టు | పెరుగుతున్నది. | (ప్ర.వి.ఏక) |
| 2) | విద్యుత్ | విద్యోతతే | మెరుపు | మురుస్తున్నది. | (ప్ర.వి.ఏక) |
| 3) | మేఘాః | వర్షంతి | మేఘాలు | వర్షిస్తున్నవి. | (ప్ర.వి.బహు) |
| 4) | ఫలమ్ | పతతి | పండు | పడుతున్నది. | |

ఈ వాక్యాల్లో ముందువరుసలో ఉన్న పదాలన్నీ కర్తృకారకాలు. ప్రథమా విభక్తిలో వాడబడ్డాయి. ఈ కర్తృకారకాలు లేకపోతే ప్రక్కన ఉన్న క్రియలకు అన్వయం ఉండదు. అందువల్లనే పాణిని 'కర్త'ను నిర్వచిస్తూ "స్వతంత్రః కర్తా" స్వతంత్రంగా (వేరేవాటి అవసరంలేకుండా) క్రియలో అన్వయించే వాడు, అన్వయించేది, కర్తృకారకం అని అన్నాడు. ఏ శబ్దాలనైనా పుంలింగ శబ్దాలను గాని, స్త్రీలింగ శబ్దాలను గాని, నపుంసక శబ్దాలను గాని) కర్తగా ప్రథానంగా అన్వయింపదలచినప్పుడు ప్రథమా విభక్తిలో వాడాలి.

బాలః- క్రీడతి - అనేచోట 'బాల' శబ్దం అకారాన్త పులింగం.

నదీ - ప్రవహతి - అనేచోట 'నదీ' శబ్దం ఈకారాన్త స్త్రీలింగం.

ఫలమ్ ఉదేతి - అనేచోట 'ఫల' శబ్దం అకారాన్త నపుంసకలింగం.

ఈ కర్తను బోధించే శబ్దాలు ఏకవచనంలోను, ద్వివచనంలోను, బహువచనం లోను ప్రయోగించవచ్చు. పై ఉదాహరణాల్లో ఏకవచన ప్రయోగం ఉంది.

ద్వివచనంలో అయితే - బాలౌ క్రీడతః ఇద్దరు బాలురు క్రీడిస్తున్నారు.
నద్యౌ ప్రవహతః రెండునదులు ప్రవహిస్తున్నాయి.
ఫలే పతతః రెండు పళ్లు పడుతున్నాయి.

ఇక్కడ కర్తను బోధించే బాలౌ, నద్యౌ, ఫలే అనే శబ్దాలు ద్వివచనంలో ఉండటంచేత క్రియాపదం (తిజన్తపదం) కూడా ద్వివచనంలో ప్రయోగింపబడింది. ఇలాగే కర్తను బోధించే పదాలు బహువచనంలో ఉంటే క్రియాపదం కూడా బహువచనంలోకి మారుతుంది. చూడండి -

| | | | |
|---|---|---|---|
| బాలాః | - | క్రీడంతి, | బాలు రు ఆడుకొంటున్నారు. |
| నద్యః | - | ప్రవహన్తి | నదులు ప్రవహిస్తున్నాయి. |
| ఫలాని | - | పతన్తి | పండ్లు పడుతున్నాయి. |

| | (కర్త) | క్రియ |
|---|---|---|
| ఏక. | బాలః | క్రీడతి |
| ద్వి. | బాలౌ | క్రీడతః |
| బహు. | బాలాః | క్రీడన్తి. |

ఈ ప్రయోగాలు పరిశీలిస్తే ప్రథమావిభక్తిలో ప్రయోగింపబడిన కర్తృవాచకాలను బట్టి క్రియాపదాలకు వచనాలు మారాయని గమనించవచ్చు.

ఇక్కడ ఇంకొక విషయం గమనించాలి. కర్తృ పదాలకు లింగాలు కూడా వేరువేరుగా ఉండవచ్చు. పైన ఇచ్చిన బాల శబ్దం పుంలింగం, నదీశబ్దం స్త్రీలింగం, ఫలశబ్దం నపుంసకలింగం అని చెప్పాం కదా! అయితే క్రియా పదాలకు మాత్రం లింగాలు ఉండవు. సుబన్త పదాలకు లింగాలు ఉంటాయి (సుబన్తాలైన అవ్యయపదాలకు తప్ప). తిజన్త పదాలకు వచనాలుంటాయి కాని స్త్రీం - పుం - నపుంసకాలు ఉండవు. అందువల్లనే కర్తృపదాలకు లింగాలు మారినా క్రియా పదాలు మార్పులేకుండానే ఉంటాయి. ఈ క్రింది ఉదాహరణం చూడండి.

| | | |
|---|---|---|
| (పుం) | బాలః | క్రీడతి |
| (స్త్రీ) | బాలికా | క్రీడతి |
| (నపుం) | సైన్యమ్ | క్రీడతి |

ఇక్కడ కర్తృవాచకాలకు మూడులింగాలు మారినా, 'క్రీడతి' అనే క్రియాపదం మారలేదు. దీనికే పుంలింగ పదంతో అన్వయించినప్పుడు

ఆడుతున్నాడు అని, స్త్రీ లింగ - నపుంసకలింగ పదాలతో అన్వయించినప్పుడు ఆడుతున్నది అని అర్థం చెప్పుకుంటున్నాం. అంటే తిఙన్త క్రియాపదాలకు లింగాలు లేవు. క్రియాపదాలకు వచనాలున్నాయి.

1) అదృష్టమ్/భాగ్యమ్ - భవతి     అదృష్టం ఉన్నది.

2) అదృష్టే / భాగ్యే - భవతః     రెండదృష్టాలు ఉన్నాయి.

3) అదృష్టాని / భాగ్యాని - భవన్తి   చాలా అదృష్టాలు ఉన్నాయి.

ఇక్కడ అదృష్టం/భాగ్యమ్ అనే నపుంసలింగ శబ్దాలు మార్చి కన్యా కన్యే - కన్యకాః అని క్రియా పదాలకు అన్వయించినా క్రియాపదాలకు లింగ సంబంధమైన మార్పు ఉండదు. అంటే సుబన్త శబ్దాలవచనాలను బట్టి, తిఙన్తాల వచనాలు మారుతా యన్నమాట.

దీన్ని బట్టి మనం గ్రహించవలసింది ఏమిటి? క్రియాపదాలకు లేదాతిఙన్త పదాలకు లింగాలు లేవు, వచనాలు మాత్రమే ఉన్నాయి. ఇంతేకాదు తిఙాన్త పదాలకు పురుషాలున్నాయి. ప్రథమ పురుషం, మధ్యమపురుషం, ఉత్తమ పురుషం అని. పైని ఇచ్చిన క్రియాపదాలు ప్రథమ పురుషానికి సంబంధించిన ఏక-ద్వి-బహు వచనాలు. మిగిలిన రెండు పురుషాలకు కర్తృపదాలను అన్వయించడం ఎలాగో చూడండి.

(కర్తృ) - (క్రియ)

ఏక. త్వం - క్రీడసి (నువ్వు ఆడుతున్నావు) ఇక్కడ 'త్వం' (నువ్వు) అనేది కర్తృకారకం.

ద్వి.యువామ్-క్రీడథః (మీరిద్దరు ఆడుతున్నారు) ఇక్కడ 'యువామ్' (మీరిద్దరు) అనేది కర్తృకారకం.

బహు.యూయమ్-క్రీడథ (మీరందరు ఆడుతున్నారు) ఇక్కడ 'యూయమ్' (మీరందరు) అనేది కర్తృవాచకం.

ఇక్కడ మధ్యమపురుష - క్రియా ప్రయోగం జరిగింది.

ఉత్తమపురుష-క్రియాపదప్రయోగంలో 'అస్మద్' అనే శబ్దాన్ని కర్తగా అన్వయించాలి. చూడండి.

(కర్త) (క్రియ)

(ఏక.వ.) అహమ్-క్రీడామి-నేను ఆడుతున్నాను (ఇక్కడ 'అహమ్' 'నేను' అనేది కర్తృకారకం)

(ద్వి.వచ.) ఆవామ్ - క్రీడావః మేమిరువురం ఆడుతున్నాము (ఇక్కడ 'ఆవామ్' అనేది కర్తృవాచకం)

(బహు.వ)వయమ్ - క్రీడామః - మేము ఆడుతున్నాము.

ఈ మధ్యమ - ఉత్తమపురుషాల్లో కూడా ద్వివచన-బహువచన ప్రయోగాలున్నాయని ఈ పేర్కొన్న ప్రయోగాలు తెలియజేస్తున్నాయి కదా! ఇంతవరకూ ఇచ్చిన కర్తృకారకప్రయోగం ప్రథమావిభక్తిలోనే ఇవ్వబడింది. ఈ కర్తను ఒక్కొక్కప్పుడు తృతీయా విభక్తిలో కూడా వాడవచ్చు అని పూర్వమే చెప్పడం జరిగింది.

1) బాలేన-క్రీడితమ్ - బాలునిచేత ఆడబడినది. (బాలాభ్యాం-బాలైః అని కూడా వచ్చును.)

2) బాలికయా - క్రీడితమ్ - బాలికచేత ఆడబడినది. (బాలికాభ్యాం - బాలికాభిః అని చేర్చవచ్చు)

3) సైన్యేన - క్రీడితమ్ - సైన్యంచేత ఆడబడింది. (సైన్యాభ్యాం, సైన్యైః అనవచ్చు)

4) త్వయా/యువాభ్యాం/యుష్మాభిః క్రీడితమ్ నీచేత/మీఇద్దరిచేత/ మీ అందరిచేత ఆడబడింది. (ఇక్కడ కర్తృపదాలవచనాలు మారినా క్రియాపదం మార్పు లేకుండా ఉంది. ఇది విశేషం

అంటే 'క్రీడితం' అనేది ఎక్కడా మారకపోవడం గమనించారు కదా!

5) మయా/ఆవాభ్యాయ్/అస్మాభిః - క్రీడితమ్ (నాచేత/ మాఇద్దరిచేత / మా అందరిచేత ఆడబడింది. ఇక్కడ కూడా కర్తృపదాల వచనాలు మారినా క్రియాపదం మారలేదు.

ఇంతవరకు కర్తృపదాన్ని ప్రథమావిభక్తిలోను, తృతీయా విభక్తిలోను ప్రయోగించాలని తెలిసింది. కర్తృపదం ప్రథామావిభక్తిలో వాడినప్పుడు క్రియాపదం మూడు పురుష ప్రయోగాల్లోను కర్తృపదాన్ని బట్టి - ఏక-ద్వి-బహువచనాలు మారతాయని గుర్తించాం. కర్తృపదాన్ని తృతీయా విభక్తిలో వాడినప్పుడు,దానికి లింగాలు వచనాలు మార్చినా క్రియాపదం మార్పు లేకుండా ఒకేవిధంగా ఉన్నదని గ్రహించాలి. త్రిజన్త క్రియాపదాలకు లింగాలు లేవని గుర్తించాలి.

ఇక్కడ ఇంకొక విషయం గుర్తించాలి. క్రియా పదాలు తిజన్త రూపాలుగా మాత్రమే కాక, సుబన్త శబ్దాలుగా కూడా ఉండవచ్చు. ఉదా : క్రీడితమ్ (క్రీడింపబడినది) శయితమ్ (పరుండబడినది) గతమ్ (వెళ్లబడినది మొ॥ ఇవన్నీ నపుంసక లింగాలు. అంటే తిజన్త క్రియాపదాలకు లింగాలు లేకపోయినా, సుబన్త క్రియాపదాలకు లింగాలున్నాయి.

శ్లో॥ కృష్ణేనాత్ర సుభాషితం, సుచరితం, గోపైస్సహానందితమ్
యాతం తేన, సుఖాసితం, భగవతా భుక్తం, సుపీతం, హృతమ్ ।
సుప్తం యాదవ నందనేన సుచిరంప్రేమ్ణా సుషిక్తం కలే
రారంభే వసుదేవనందనతనయా జాతేన కంసారిణా ॥

1) అత్ర కృష్ణేన సుభాషితమ్ - ఇక్కడ కృష్ణునిచే బాగుగా మాటాడబడినది.
2) అత్ర కృష్ణేన సుచరితమ్ - ఇక్కడ కృష్ణునిచే బాగుగా సంచరింపబడినది.
3) అత్ర కృష్ణేన గోపైః సహ ఆనందితమ్ - ఇక్కడ కృష్ణునిచే గోపకులతోబాటు ఆనందింపబడినది.
4) తేన యాతమ్ - ఆతనిచే నడువబడినది.
5) భగవతా సుఖాసితమ్ - భగవానునిచే సుఖముగ నుండబడినది.
6) భగవతా సుపీతమ్ - భగవానునిచే బాగుగ త్రాగబడినది.
7) భగవతా భుక్తమ్ - భగవానునిచే బాగుగ తినబడినది.
8) భగవతా హృతమ్ - భగవానునిచే హరింపబడినది.
9) యాదవనందనేన సుప్తం - యదునందనునిచే నిద్రింపబడినది.
10) యాదవనందనేన ప్రేమ్ణా-సుషిక్తమ్ - యదునందనునిచే ప్రేమతో తడుపబడినది.

ఇంతవరకూ ఇచ్చిన కర్తరిప్రయోగాలు, కర్మణి ప్రయోగాలు, భావేప్రయోగాలు ముఖ్యంగా వాక్య ప్రయోగానికి సంబంధించినంతవరకు విశేషంగా తులనాత్మక దృష్టితో పరిశీలిస్తే ఈ ప్రయోగాలను కావ్యాల్లోను ఇతరత్ర సులువుగా గుర్తించవచ్చు.

# ప్రథమా - తృతీయలలో కర్తృ వాచకప్రయోగం భగవద్గీత నుండి

శ్లో॥ సీదన్తి మమ గాత్రాణి, ముఖంచ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే, రోమహర్షశ్చ జాయతే (1-28)

ఎ) (మమ) - గాత్రాణి - సీదన్తి = (నా) అవయవాలు నశిస్తున్నాయి.
ఇక్కడ 'గాత్రాణి' కర్తృవాచకం - 'సీదన్తి' - అనేది క్రియాపదం (తిజన్తపదం)

బి) ముఖం (చ), పరిశుష్యతి = ముఖం (కూడా) ఎండిపోతున్నది.
ఇక్కడ 'ముఖం' కర్తృవాచకం 'పరిశుష్యతి' అనేది క్రియాపదం

సి) (మే-శరీరే) వేపథుశ్చ జాయతే=(నాశరీరంలో) వణుకు కూడా పుడుతున్నది.
ఇక్కడ 'వేపథు:' అనేది కర్తృవాచకం. 'జాయతే' అనేది క్రియాపదం.

డి) రోమహర్ష: (చ) జాయతే = గగ్గురుపాటు (కూడా) పుడుతున్నది.
ఇక్కడ 'రోమహర్ష:' అనేది కర్తృవాచకం ప్రథమావిభక్తిలోనే ప్రయోగింపబడింది. క్రియాపదం ప్రథమ పురుషంలో ప్రయోగింపబడింది.

ఇప్పుడు తృతీయా విభక్తిలో ప్రయోగింపబడిన కర్తృవాచకాలు. వాటితో అన్వయించిన క్రియాపదాలు ఈ క్రింది శ్లోకంలో గుర్తించండి.

2) ధూమేనా వ్రియతేవహ్ని:, యథాదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భ:, తథా తేనేద మావృతమ్ ॥ (3-38)

ఎ) (యథా) ధూమేన (వహ్ని:) ఆవ్రియతే - )ఏవిధంగా) పొగచే (నిప్పు) ఆవరింపబడుతున్నదో

బి) (యథా) మలేన ఆదర్శ:, ఆవ్రియతే (ఏ విధంగా) మాలిన్యంచేత అద్దం ఆవరింపబడుతున్నదో

సి) (యథా) ఉల్బేన (గర్భ:) ఆవ్రియతే ( ఏవిధంగా) ఉమ్మనీటిచే గర్భం ఆవరింపబడుతున్నదో

డి) (తథా) తేన (ఇదమ్) ఆవృతమ్ (అలాగే) దీనినే (కామంచే) ఇది (ఈజగత్తు) ఆవరింపబడింది. ఇక్కడ 'ఆవృతం' అనేది క్రియాపదం.

ఈ వాక్యాల్లో ధూమేన, మలేన, ఉల్బేన, తేన అనేవి కర్తృవాచకాలు. తృతీయా విభక్తి ఏకవచనంలో ప్రయోగింపబడ్డాయి. ఆవ్రియతే, ఆవృతమ్ అనేవి క్రియాపదాలు. మరికొన్ని ఉదాహరణాలు చూడండి.

| ప్రథమా విభక్తి | తృతీయా విభక్తి |
|---|---|
| 1) నైనం శస్త్రాణి ఛిందన్తి (2-23)<br>దీనిని శస్త్రాలు ఛేదించవు. | 1) అజ్ఞానేన జ్ఞానమ్ ఆవృతమ్ (5-15)<br>అజ్ఞానముచే జ్ఞానము ఆవరింపబడినది. |
| 2) పావకః న దహతి.<br>అగ్ని దహింపదు. | 2) (సః) పాపేన నలిప్యతే<br>అతడు పాపముచే పూయబడడు(5-10) |
| 3) ఆపః న క్లేదయన్తి.<br>జలాలు తడుపవు. | 3) (ఇహైవ) తైః సర్గఃజితః (5-19)<br>ఇక్కడనే వారిచే ప్రాకృతికసృష్టి జయింపబడినది. |
| 4) మారుతః నశోషయతి<br>వాయువు ఎండింపదు. | 4) మయా చాతుర్వర్ణ్యం సృష్టమ్ (4-13<br>నాచే నాల్గువర్ణముల స్వభావము సృజింపబడినది. |
| 5) యే (యథా-మాం) ప్రపద్యన్తే<br>ఎవ్వరు (ఎట్లుగా-నున్న) శరణుపొందుదురో | 5) (సః) కర్మభిః నబధ్యతే<br>(అతడు) కర్మలచే బంధింపబడడు(4-14) |
| 6) (తాన్-తథైవ) అహం భజామి (4-11)<br>(వారిని అట్లే) నేను అనుగ్రహింతును. | 6) త్వయా తతం విశ్వమ్ (అనంత రూప!) (11-38)<br>ఓ అనన్తరూపా! నీచే విశ్వమంతయు వ్యాప్తమైనది. |
| 7) (మాం) కర్మాణి నలింపంతి<br>(నన్ను, కర్మలు స్పృశింపవు. | 7) ఋషిభిః బహుధా గీతమ్ (13-5)<br>ఋషులచే బాగుగా గానమొనర్చ బడినది. |
| 8) (తేన) జంతవః ముహ్యంతి<br>(అజ్ఞానముచే ప్రాణులు మోహపడుచున్నవి. | |

పై వాక్యాలు చూస్తే కర్తృకారకం ప్రథమావిభక్తిలోను, తృతీయా విభక్తిలోను ఎలా ప్రయోగింపబడిందో తెలుస్తుంది.

# కర్మకారకం - (ప్రథమా - ద్వితీయా విభక్తులు)

వ్యాకరణ శాస్త్రనిర్ణయం ప్రకారం కర్మ అంటే నిర్దుష్టమైన నిర్వచనం ఉన్నప్పటికీ మనం సాధారంగా గుర్తించడానికి ఒక విధానం ఉంది. క్రియను బోధించే తిజన్త ప్రయోగాన్ని విన్న వెంటనే దేనిని? ఎవరిని? అనే ప్రశ్న పుట్టినప్పుడు ఆ ప్రశ్నకు సమాధానంగా అన్వయించేదే కర్మ. ఈ ఉదాహరణం చూడండి. 'భునక్తి' =తింటున్నాడు. ఈ క్రియాపదాన్ని వినగానే, ఎవడు తింటున్నాడు? అనే ప్రశ్న కలిగినట్లే, దేనిని తింటున్నాడు? అనే ప్రశ్నకూడా పుడుతుంది. ఆ తినే వాడెవ్వడో వాడు (లేదా అది) కర్త. తినబడే అన్నం - కర్మ, 'తినడం' అనేది క్రియ (పని) కర్మపదం ద్వితీయా విభక్తిలో ఉంటుంది. క్రియాపదం విన్నవెంటనే అన్నిచోట్లా దేనిని? ఎవరిని? అనే ప్రశ్నపుట్టకపోవచ్చు. ఉదాహరణానికి - నిద్రాతి=నిద్రిస్తున్నాడు అన్నప్పుడు ఎవడు? అని కర్తను గురించిన ప్రశ్నపుట్టింది తప్ప, దేనిని, ఎవరిని అనే అనే ప్రశ్న పుట్టలేదు కదా! అందువల్ల ఈ క్రియాపదం 'కర్మ' యొక్క సంబంధం (అవసరం) లేనిది. దీన్నే 'అకర్మక క్రియ' అని అంటారు. పశ్యతి= చూస్తున్నాడు అనగానే దేన్ని? ఎవరిని? అనే ప్రశ్న పుడుతున్నది. 'చిత్రం పశ్యతి' 'బొమ్మను చూస్తున్నాడు! అనో 'గామ్‌పశ్యతి' గోవును చూస్తున్నాడు అనో కర్మవాచక పదాన్ని తెచ్చుకొని అన్వయించుకుంటాం. కనుక, కర్మ గురించి అవగాహన చేసికొనేముందు క్రియాపదాల్లో - అసలు ఏ క్రియాపదాల దగ్గర కర్మ గురించిన ప్రశ్న, అంటే, దేనిని? ఎవరిని? అనే ప్రశ్న పుడుతుంది? ఎక్కడ పుట్టదు? అనేది తెలిసికోవాలి. కర్మగురించి ప్రశ్నపుట్టే క్రియాపదాలు చాలా ఉన్నాయి. ప్రశ్నపుట్టనివి తక్కువగా ఉన్నాయి. అందువల్ల కర్మ గురించిన ప్రశ్నపుట్టని క్రియాపదాలు తెలుసుకోవడం సులువు. సంప్రదాయ సిద్ధంగా ఒక శ్లోకం ఉన్నది.

'వృద్ధి - క్షయ - భయ - జీవిత - మరణం
లజ్జా - సత్తా - స్థితి - జాగరణమ్ ।
శయన-క్రీడా- రుచి - దీప్త్యర్థం
ధాతుగణం తమ కర్మ కమాహుః ॥ అని.

వృద్ధిని, క్షయాన్ని, భయాన్ని, బ్రతుకును, మరణాన్ని, సిగ్గును, ఉనికిని, ఉండటాన్ని (స్థిరంగా), మేల్కొనడాన్ని, నిద్రను, ఆడుకోవడాన్ని, రుచిని (ఇష్టపడడాన్ని), దీప్తిని

ప్రకాశించడాన్ని, బోధించే ధాతువులన్నీ అకర్మకాలు. ధాతువు అంటే క్రియాపదానికి (తిజన్త పదానికి) చెందిన మౌళికశబ్దం (Root) అని వెనుకచెప్పడం జరిగింది. పైన పేర్కొన్న అర్థాలు కలధాతువులో తయారైన క్రియాపదాలను ప్రయోగించినప్పుడు అక్కడ దేనిని? ఎవరిని? అని కర్మకు సంబంధించిన ప్రశ్న పుట్టదు. ఇవి తప్ప మిగిలినచోట ఆ ప్రశ్న పుడుతుంది. కనుక అవి సకర్మకాలు. అంటే అక్కడ కర్మ కారకపదం ఉండి తీరుతుంది. పైన పేర్కొన్న అర్థాలు కల ధాతువులకు ఈ ప్రశ్నలు పుట్టవు.

అకర్మ ధాతువుల ప్రయోగం ఉన్నచోట, కర్మ గురించిన ప్రశ్న ఉండదు అన్నదానికి 1,2 ఉదాహరణాలు చూద్దాం.

1. వృక్షః వర్ధతే, ఏధతే - చెట్టు వృద్ధి చెందుతున్నది. ఇక్కడ వృద్ధి చెందేది ఏదో, అంటే 'కర్త' అయిన వృక్షం, ఉంది తప్ప, దేనిని? ఎవరిని? అనే ప్రశ్నపుట్టడం లేదుకదా!

2 రోగః- క్షీయతే= రోగం క్షీణిస్తున్నది. ఇక్కడ కూడ దేనిని? అనే ప్రశ్నలేదు. ఈ అకర్మక ధాతువుల గురించి ముందు ముందు స్పష్టపరుప బడుతుంది.

ఇప్పుడు కర్మ గురించిన ప్రశ్న కలధాతువుల ప్రయోగంలో కర్మ ఎలా ప్రయోగింప బడుతుందో కొన్ని ఉదాహరణాలు చూద్దాం.

1. బాలః గ్రంథం పఠతి - బాలుడు గ్రంథాన్ని చదువుతున్నాడు.
2. శిష్యాః గురూన్ పూజయన్తి - శిష్యులు గురువులను పూజిస్తున్నారు.
3. వృద్ధౌ ఫలాని ఖాదతః ఇద్దరు వృద్ధులు ఫలాలను తింటున్నారు.
4. మానవేన కేవలౌ అర్థకామౌ నస్వీకరణీయౌ - మానవునిచేత కేవల అర్థ-కామాలు (డబ్బు-కోరికలు) స్వీకరింపదగవు. ఇక్కడ క్రియాపదం 'న స్వీకరణీయౌ' అని సుబన్తపదంగానే నిర్దేశింపబడింది. ఇక్కడ 'స్వీకరింపక పోవడం' క్రియ. అలా స్వీకరింపనివాడు అంటే కర్త - మానవుడు. కర్తృపదం తృతీయా విభక్తిలో వాడబడింది. వేనిని స్వీకరింపరాదు? అని ప్రశ్నపుట్టినప్పుడు 'అర్థకామాలు' కర్మగా అన్వయిస్తున్నాయి. 'అర్థకామౌ' అనే పదం ద్వితీయా విభక్తిలో నిర్దేశింపబడింది. కర్మపదం సాధారణంగా ద్వితీయా విభక్తిలో నిర్దేశింపబడుతుంది. ఒక్కొకప్పుడు కర్మవాచకం ప్రథమావిభక్తిలో

కూడా ప్రయోగింప బడుతుంది. ఆ విషయం ముందు స్పష్టపడగలదు. ఇక్కడ క్రియాపదం తిజన్తపదంగానే ఉండనవసరం లేదని తెలుస్తున్నది.

5. రామాయణంలోని ఈ క్రింది ప్రయోగాలు చూడండి.

తప:స్వాధ్యాయ నిరతం, తపస్వీ, వాగ్విదాంవరం ।
నారదం, పరిపప్రచ్ఛ, వాల్మీకి:, ముని పుంగవమ్ ॥ (బాల.రా.1-1)

ఈ శ్లోకంలో ముందు క్రియా పదం ఏమిటో గుర్తించాలి. పరిపప్రచ్ఛ=వినయపురస్సంగా ప్రశ్నించెను. ఇలా ప్రశ్నించడమే ఇక్కడ క్రియ. 'పరిపప్రచ్ఛ' అనేది 'ప్రచ్ఛ్' అనే ధాతువుపై ఏర్పడిన తిజన్త రూపం. దీన్ని లిట్ అంటారు. భూతకాలాన్ని బోధిస్తుంది. ఇటువంటి ధాతులగురించి ప్రత్యేకంగా చెప్పుకుందాం. ఇలా ఎవరు ప్రశ్నించారు? వాల్మీకి:- ఈయన కర్త. ఈయన ఎటువంటివాడు? తపస్వీ=తపో నిష్ఠ కలవాడు. ఇది వాల్మీకికి విశేషణం. కనుక ఇదీ కర్తనే బోధిస్తుంది. తపస్వీ వాల్మీకి: - పరిపప్రచ్ఛ (తాపసుడైన వాల్మీకి వినయపురస్సరంగా ప్రశ్నచేసినాడు) ఎవరిని? నారదం=నారదుని; ఆయన ఎటువంటివాడు? తపస్స్వాధ్యాయనిరతం, వాగ్విదాంవరం, మునిపుంగవం అనే మూడు విశేషణాలు నారదునికి చేర్చబడ్డాయి, ఆయన తపస్సు వేదాధ్యయనములు నిత్యం కలవాడు, వాగ్వేత్తలలో శ్రేష్ఠుడు, మునులలో గొప్పవాడు. ఇటువంటి నారదుడు కర్మ. 'నారదం' అనే పదంతో పాటు ఆయనకు వేసిన విశేషణాలు కూడా కర్మనే బోధిస్తాయి. కనుక, ఇవన్నీ ద్వితీయావిభక్తి చేత నిర్దేశింప బడ్డాయి. తెలుగులో ద్వితీయా విభక్తిగా ని,ను,ల,కూర్చి గురించి అనేవి వాడతారు. నిన్ను, వారిని, రాముని, హరిని, వానిగురించి, నిన్ను గూర్చి ఇలా. వీటిని అమ్-ఔట్ - శస్ అనే ప్రత్యయాలుగా సంస్కృతంలో నిర్దేశిస్తారని వెనుక చెప్పడం జరిగింది.

# రామాయణంలో ద్వితీయా విభక్తి ప్రయోగాలు

రామాయణంలోని కిష్కింధాకాండంలో సముద్రలంఘనానికి ఉద్యమించిన హనుమంతుని వాక్యాల్లో ద్వితీయా విభక్తిలో ప్రయోగించిన కర్మశబ్దాలకు ఎన్నో ఉదాహరణాలున్నాయి. చూడండి. (67 వ సర్గ)

ఉత్సహేయ మతిక్రాన్తుం సర్వానాకాశ గోచరాన్ ।
సాగరం క్షోభయిష్యామి, దారయిష్యామి మేదినీమ్ ॥ 17
పర్వతాన్ కంపయిష్యామి, ప్లవమానః ప్లవంగమాః ।
హరిష్యామ్యూరువేగేన ప్లమానో మహార్ణవమ్ ॥ 18
ద్రక్ష్యన్తి నిపతన్తం చ సర్వభూతాని వానరాః ।
మహామేఘ ప్రతీకాశం మాంచద్రక్ష్య థ వానరాః ॥
21 దివమావృత్య గచ్ఛన్తం గ్రసమాన మివాంబరమ్ ।
విధ మిష్యామి జీమూతాన్, కంపయిష్యామి పర్వతామ్ ॥ 22

పై శ్లోకాల్లో ఈ క్రింది వాక్యాలు గుర్తించండి.

1) సర్వాన్ ఆకాశగోచరాన్ అతిక్రాంతుమ్ ఉత్సహేయమ్ ।
ఆకాశంలో ఉండేవారందర్నీ దాటడానికి ఉత్సాహపడుదునుగాక!
2) సాగరం క్షోభయిష్యామి-సముద్రాన్ని క్షోభింప జేయగలను.
3) మేదినీం దారయిష్యామి-భూమిని చీల్చగలను.
4) ప్లవమానః పర్వతాన్ కంపయిష్యామి - ఎగురుతూ పర్వతాలను వణికించ గలను.
5) ఊరువేగేన మహార్ణవమ్ హరిష్యామి - తొడలవేగంచేత మహా సముద్రాన్ని హరించగలను.
6) సర్వభూతాని నిపతన్తం (మాం) ద్రక్ష్యన్తి - సమస్తభూతాలు ఎగురుతున్న (నన్ను) చూడగలరు.
7) వానరాః మహామేఘప్రతీకాశం మాం ద్రక్ష్యథ - వానరులారా! మహామేఘ సమానుణ్ణైన నన్ను చూడండి.

8) జీమూతాన్ విధమిష్యామి మేఘాలను నలిపివేయగలను.

ఈ వాక్యాల్లో అధోరేఖాంకితాలైన పదాలన్నీ కర్మను బోధిస్తాయి. క్రియాపదాలన్నీ భవిష్యత్కాలాన్ని బోధించేవిగా వాడబడ్డాయి. దీన్ని 'లృట్' లకారం అంటారు. ముందుముందు దీనిని గమనించవచ్చు.

ఈ క్రింది శ్లోకం ద్వివచనంలో ఉన్న కర్మవాచకాలకు ఉదాహరణం.

తౌ తు దృష్ట్వా మహాత్మానౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ।
వరాయుధధరౌ వీరౌ సుగ్రీవః శంకితోభవత్ ॥

ఆ మహాత్ములు, గొప్ప ఆయుధాలు ధరించినవారు, సోదరులు అయిన రామలక్ష్మణులను, చూచి (దృష్ట్వా) సుగ్రీవుడు శంకించినవాడయ్యెను. ఇక్కడ 'రామలక్షణౌ' అనే పదం, దాని విశేషణాలు నాలుగు కర్మవాచకాలే. సుగ్రీవుడు కర్త. దర్శించడం క్రియ. కర్మవాచక శబ్దాలకు సంబంధించిన ద్వితీయా విభక్తి-బహువచన ప్రయోగాలకు సుందర కాండంలో ఎన్నో ఉదాహరణాలున్నాయి.

1) దదర్శ కాంతాశ్చ సమాలపంత్యః, తథాపరాస్తత్ర పునస్స్వ పంత్యః ।
సురూప వక్త్రాశ్చ తథా హసంత్యః, క్రుద్ధాః పరాశ్చాపి వినిఃశ్వసంత్యః ॥

ఇక్కడ అధోరేఖాంకితాలైన పదాలు ద్వితీయాబహువచనంలో ఉన్న కర్మవాచకాలు. స్త్రీలింగాలు.

2) బుద్ధిప్రధానాన్ రుచిరాభిధానాన్ సంశ్రద్దధానాన్ జగతఃప్రధానాన్ ।
విద్యోతమానాన్ సతదానురూపాన్ దదర్శ కాంశ్చిచ్చ పునర్ విరూపాన్ ॥

ఇక్కడ అధోరేఖాంకిత పదాలన్నీ కర్మబోధకాలు, ద్వితీయా బహువచనంలో ఉన్నాయి. పుంలింగాలు.

కర్మవాచక శబ్దం ప్రథమావిభక్తిలో కూడా ప్రయోగింపబడుతుంది. ఉదాహరణం చూస్తే ఇది స్పష్టపడుతుంది.

1) రామేణ పుస్తకం పఠితమ్ । రామునిచే పుస్తకం పఠింపబడింది.
పుస్తకాన్ని పఠించినవాడు రాముడు కర్త. పఠింపబడిన పుస్తకం కర్మ. ఇది ప్రథమావిభక్తిలో నిర్దేశింపబడింది.

2) రామేణ మాయామృగః హతః - రామునిచే మాయామృగం చంపబడింది.
ఇక్కడ మాయామృగం కర్మ. ప్రథమా విభక్తిలో నిర్దేశింపబడింది.

ఇప్పుడు శ్రీరామాయణంలోని మరి కొన్ని ఉదాహరణాలు చూడండి.

1) నిర్జితా అహం త్వయా వీర. (వీర త్వయా అహం నిర్జితా=వీరుడా నీచే నేను జయింపబడితిని. (ఇక్కడ జయించినవాడు కర్త. జయింపబడినదేదో అది కర్మ. ప్రథమా.విభక్తి

2) స్వయంభువా పురా దత్తం వరదానంయథామమ. (మమ పురా స్వయంభువా వరదానం దత్తమ్ - నాకు, పూర్వము, బ్రహ్మచే వరదానము ఈయబడినది. 'వరదానం' కర్మ. ప్రథమా విభక్తిలో నిర్దేశింపబడింది.

3) ప్రతిజ్ఞా చమయా దత్తా (మయా ప్రతిజ్ఞా దత్తా = నాచే ప్రతిజ్ఞ ఈయబడినది. హనుమంతుడు కర్త. ప్రతిజ్ఞ-కర్మ)

4) ఏవముక్తః కపిశ్రేష్ఠః (ఇక్కడ తేన = మైనాకునిచే అని కర్తృపదం తెచ్చి అన్వయించుకోవాలి. (తేన) కపిశ్రేష్ఠః ఏవమ్ ఉక్తః మైనాకునిచే కపిశ్రేష్ఠుడు ఇట్లు చెప్పబడినాడు. చెప్పినవాడు కర్త. చెప్పబడినవాడు కర్మ)

5) క్షిప్తః శ్వసనేన మహాత్మనా (మహాత్మనా శ్వసనేన (మైనాకః) క్షిప్తః = మహాత్ముడైన వాయువుచే (మైనాకుడు) (నీటిలో) పడవేయబడినాడు. పడవేయబడినవాడు కర్మ.

6) సాహ్యం కృతం త్వయాసౌమ్య। (సౌమ్య త్వయా సాహ్యం కృతమ్ = సౌమ్యుడా! నీచే సాహాయ్యము చేయబడినది) ఇక్కడ 'సాహ్యం' అనేది కర్మ. 'త్వయా' నీచే అనేది కర్త. 'కృతం' చేయబడినది అనేది క్రియ.

7) మమ భక్షః ప్రతీష్టస్త్వ మీశ్వరైః వానరర్షభ (వానరర్షభ! త్వమ్ ఈశ్వరైః మమ భక్షః ప్రతీష్టః - ఓ వానర శ్రేష్ఠ! నీవు దేవతలచే నాకు ఆహారముగా ఇవ్వబడితివి. ఇక్కడ 'త్వమ్' 'భక్షః' అనే రెండు ప్రథమా విభక్తి పదాలు కర్మవాచకాలు. ఆహారంగా ఇచ్చిన దేవతలు కర్తలు. ఇవ్వబడటం క్రియ.

8) యథారాఘవ నిర్ముక్తః శరః శ్వసన విక్రమః గచ్ఛేత్ - ఇక్కడ ఒక చమత్కారం ఉంది. కర్మగాను, కర్తగాను ఒకే వస్తువు అన్వయిస్తోంది.

'రాఘవనిర్ముక్తః శరః' అనేచోట రాఘవునిచే విడుబడిన శరము అని అర్థం. ఇక్కడ రాఘవుడు శరాన్ని విడిచిపెట్టాడని అర్థం. రాఘవుడు కర్త. విడువబడిన శరం కర్మ. 'శరః గచ్ఛేత్' అనేచోట ఈ శరమే గమనక్రియలో కర్త అయింది.

9) సాగరేణనియోజితః మైనాకః శృంగాణి దర్శయామాస - ఈ వాక్యంలో కూడా కర్మగా అయినదే కర్త కూడా అయింది. సాగరేణ నియోజితః మైనాకః సాగరునిచే మైనాకుడు నియోగింపడినాడు. అన్నప్పుడు నియోగించినవాడు కర్త. నియోగింపబడినవాడు కర్మ. నియోజించడంక్రియ. ఇలా నియోజితుడైన మైనాకుడు 'శృంగాణి దర్శయామాసః' శిఖరాలు చూపినాడు అన్నప్పుడు కర్త అయ్యాడు. అంటే ఒక క్రియలో కర్మగా అన్వయించిన వస్తువే, మరొక క్రియలో కర్తగా అన్వయించవచ్చున్నమాట.

ఈ భేదాన్ని గుర్తించాలి. ముందు ముందు కర్మకు, ద్వితీయా విభక్తికి చెందిన విశేషాలు తెలుసుకుందాం.

ద్వితీయా విభక్తి ప్రయోగాన్ని ఈ క్రింది శ్లోకాలు కంఠస్థం చేసి గుర్తించండి.

1 నమామి నారాయణ పాదపంకజం, (నారాయణుని పాద పద్మాన్ని నమస్కరిస్తాను)
కరోమి నారాయణ పూజనం సదా । (ఎల్లప్పుడూ నారాయణ పూజ చేస్తాను)
వదామి నారాయణనామ-నిర్మలం, (నారాయణుని నిర్మలమైన నామాన్ని పలుకుతాను)
స్మరామి నారాయణ తత్త్వమ్-అవ్యయమ్ ॥ (శాశ్వతమైన నారాయణ తత్త్వాన్నిస్మరిస్తాను)

ఈ శ్లోకంలో 'నమామి' 'కరోమి' 'వదామి' స్మరామి అనే నాలుగు శబ్దాలు క్రియాపదాలు. మిగిలిన నాలు పాదాల్లోని 1)నారాయణ పాదపంకజం 2) నారాయణ పూజనం 3) నారాయణ తత్త్వమ్ 4) అవ్యయమ్ 5) నిర్మలం అనే పదాలు అకారాన్త నపుంసకలిం. ద్వితీయా - ఏకవచనం 6) నారాయణనామ అనేశబ్దం నకారాన్త నపుంసకలింగం. ద్వి.ఏక.

2) జిహ్వే! కీర్తయ కేశవం, మురరిపుం చేతో! భజ, శ్రీధరం
పాణి ద్వంద్వ! సమర్చయ; అచ్యుతకథాః శ్రోత్రద్వయ! త్వంశ్రుణు।
కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛ అంఘ్రియుగ్మ! ఆలయం ।
జిఘ్ర ఘ్రాణ, ముకుందపాదతులసీం; మూర్ధన్! నమ అధోక్షజమ్ ॥

ఓ నాలుకా! కేశవుని కీర్తించుము, మురారిని ఓ మనస్సా భజించుము, శ్రీధరుని ఓహస్తద్వయమా! అర్చించుము, ఓ శ్రోత్రద్వయమా! అచ్యుతుని కథలను నీవు వినుము; ఓ కన్నులజంటా! కృష్ణుని చూడుము; పాదద్వంద్వమా! శ్రీహరిమందిరాన్ని గురించి నడువుము; ఓ ఘ్రాణమా! ముకుందుని పాదాలపై వేసిన తులసిని మూర్కొనుము; ఓ శిరమా! అధోక్షజుని ప్రణమిల్లుము.

ఈ శ్లోకంలో 1) కేశవమ్ - అకా.పుం.ద్వి.ఏకవచనం

2) మురరిపుమ్ - ఉ.పుం. ద్వి.ఏక.

3) శ్రీధరమ్ - అ.పుం. ద్వి.ఏక.

4) అచ్యుతకథా:- ఆకా. స్త్రీ. ద్వి. బహువచనం.

5) కృష్ణమ్ - అకా.పుం.ద్వి.ఏక.

6) ఆలయమ్ - అకా.పుం.ద్వి.ఏక.

7) ముకుందపాద తులసీమ్ - ఈకా. స్త్రీ. ద్వి.ఏక.

8) అధోక్షజమ్ - అకా.పు.ద్వి.ఏ.

3) మనందరికీ బాగా తెలిసిన 'శాన్తాకారం భుజగశయనం • నాభం సురేశమ్' ఇత్యాదిశ్లోకంలో ద్వితీయ ఏకవచనాంతాలు. 'విష్ణుమ్' అనే ఉకారాన్త. పుం. శబ్దం ఒక్కటి మినహా మిగిలినవి అన్నీ అకా.పుం. ద్వి.ఏకవచనాలే. 'వందే' నమస్కరింతును అనేది క్రియాపదం.

4) 'లక్ష్మీంక్షీరసముద్ర రాజతంయామ్' ఇత్యాది లక్ష్మీస్తుతిలో శ్రీరంగధామేశ్వరీమ్, త్రైలోక్యకుటుంబినీమ్ అనే రెండు శబ్దాలు ఈకా. స్త్రీ. ద్వి.ఏకవచనాంతాలు. మిగిలిన శబ్దాలన్నీ ఆకా.స్త్రీ.ద్వి.ఏకవచనాంతాలు. 'త్వాం' అనేది 'యుష్మద్' శబ్దం ద్వి.ఏకవచనాన్తం. 'వందే' నమస్కరిస్తున్నాను. అనేది క్రియాపదం.

5)శ్లో॥ లక్ష్మీం, పద్మాం, రమాం, లోకమాతరం, శ్రియ మన్వహమ్ ।
అబ్దేః దుహితరం, రమ్యభ్రువం మామ్ ఆశ్రయే ముదా॥ (స్వీయం)

1) లక్ష్మీం - లక్ష్మ్యౌ - లక్ష్మీః - ఈకా. స్త్రీ.

2) పద్మాం - పద్మే - పద్మాః - ఆకా. స్త్రీ.

3) రమాం - రమే - రమాః - ఆకా.స్త్రీ.

4) శ్రియం - శ్రియౌ - శ్రియః - ఈకా.స్త్రీ.

5) లోకమాతరం - లోకమాతరౌ - లోకమాతౄః ఋకా.స్త్రీ.

6) దుహితరం - దుహితరౌ - దుహితౄః ఋకా.స్త్రీ.

7) రమ్యభ్రువం - రమ్యభ్రువౌ - రమ్యభ్రువః ఊకా.స్త్రీ.

8) మామ్ - మే - మాః - ఆకా. స్త్రీ.

ఈ శబ్దాలను వెనుక ఇచ్చిన స్త్రీలింగ శబ్దాల టేబుల్ చూచి పోలిక గుర్తించండి. ఇతరరూపాలు గమనించండి.

# కరణకారకం - (తృతీయా విభక్తి)

'కరణం' అంటే ఏదైనా ఒక పనిని చేయడంలో ఉపకరించే సాధనం, అని తెలుసుకుంటే చాలు. ఏదైనా కనిపించే వస్తువు సాధనం కావచ్చు. కనిపించనిది, వస్తువు కానిది కూడా సాధనం కావచ్చు. ఈ సాధనాన్ని తృతీయా విభక్తి కల సుబన్త శబ్దంతో సూచించడం సాధారణంగా ఉంటుంది. తెలుగులో చేత, తోడ అనేవి చేర్చబడ్డ పదాలు కరణాలుగా గుర్తించవచ్చు. కర్త కూడా తృతీయావిభక్తిలో నిర్దేశింపబడతాడని వెనుక చెప్పాం. అయితే, కర్త, కరణం రెండూ తృతీయా విభక్తిలో ఉంటే తేడా గుర్తించడం ఎలా? గుర్తించవచ్చు. ఎలాగంటే. క్రియను ఎవ్వరు స్వతంత్రంగా నిర్వహిస్తున్నారు? ఆ క్రియను నిర్వహించేవానికి సాధనంగా ఉన్నదేది? దీన్ని గుర్తించడం ద్వారా తేడా తెలుసుకోవచ్చు. ఉదాహరణం చూడండి.

కృష్ణేన, ముష్టినా, మల్లః, నిహతః కృష్ణుని చేత, పిడికిలిచే (తో), మల్లుడు, చంపబడ్డాడు.

అన్నప్పుడు చంపబడ్డవాడు కర్మ. చంపిన కృష్ణుడు కర్త. తృతీయా విభక్తిలో నిర్దేశింపబడ్డాడు. కృష్ణుడు మల్లుని చంపడానికి సాధనంగా చేసుకున్నది ముష్టి (పిడికిలి) అదే కరణం. దాన్ని కూడా తృతీయా విభక్తిలో చెప్పడం జరిగింది. ఒకే విభక్తిలో ఉన్నా, కర్తను, కరణాన్ని క్రియతో వాటికి ఉన్న అన్వయంలో తేడాను బట్టి భేదాన్ని గుర్తించవచ్చు. సాధనంగా ఉపయోగించేదేదో అదే కరణం అని గుర్తించవచ్చు.

ఉపాధ్యాయః- లేఖిన్యా-లిఖతి = ఉపాధ్యాయుడు పెన్నుతో వ్రాస్తున్నాడు.ఇక్కడ 'లేఖిని' అనే ఈకారాన్త స్త్రీలింగ శబ్దానికి తృతీయావిభక్తి 'లేఖిన్యా' అనేది. ఇది వ్రాయడానికి సాధనం కనుక 'కరణం' అని వ్యవహారం.

ఈ క్రింది శ్లోకం చూడండి.

'లోకః పశ్యతి నేత్రేణ, ప్రభుశ్చారేణ పశ్యతి ।
సన్తోధర్మేణ పశ్యన్తి విద్వాన్ శాస్త్రేణ పశ్యతి ॥' (స్వీయం)

1) జనుడు నేత్రంతో చూస్తాడు (లోకః నేత్రేణ పశ్యతి । ఇక్కడ చూడటానికి నేత్రం సాధనం. 2) ప్రభువు గూఢచారి ద్వారా చూస్తాడు (ప్రభుః చారేణ పశ్యతి) ఇక్కడ గూఢచారి సాధనం. 3) సజ్జనులు ధర్మంతో చూస్తారు (సన్తః ధర్మేణ పశ్యన్తి) ఇక్కడ ధర్మమే సజ్జనులకు దర్శనంలో సాధనం. 4) విద్వాంసుడు శాస్త్రంతో

చూస్తాడు (విద్వాన్ శాస్త్రేణ పశ్యతి) పండితునికి శాస్త్రమే దర్మన సాధనం. నేత్రము, చారుడు వస్తువులు. ధర్మం, శాస్త్రం వస్తువులుకావు. అయినా సాధనాలే.

ఇంకొక నీతి శ్లోకం చూడండి.

ప్రీణన్తి సతతం వృక్షాః ఫలైః పుష్పైశ్చ ఛాయయా ।
సజ్జనాః ప్రీణయన్త్యేవం వాచా దృష్ట్యాచ కర్మణా ॥ (స్వీయం)

1) వృక్షాః, ఫలైః, పుష్పైః, ఛాయయా, చ, సతతం, ప్రీణన్తి
చెట్లు పండ్లతోను, పుష్పాలతోను, నీడతోను, ఎల్లప్పుడు ప్రీతి కలిగిస్తాయి.
ఇక్కడ ప్రీతి కలిగించడంలో పండ్లు, పుష్పాలు, నీడ, సాధనాలు.

2) ఏవం, సజ్జనాః, వాచా - దృష్ట్యా - కర్మణా చ ప్రీణయన్తి
ఇలాగే, సజ్జనులు, మాటతో, చూపుతో, చేష్టచేత ప్రీతిని కల్గిస్తారు.

ఇతరులకు ప్రీతి కలిగించడంలో సజ్జనులకు వారి మాట, చూపు, చేష్ట సాధనాలు. సాధనాలనే శాస్త్ర పరిభాషలో కరణాలు అని అంటారు. ఇక్కడ తృతీయా విభక్తిలో ఇవి ప్రయోగింపబడ్డాయి.

సాధన వాచకాలను తృతీయా విభక్తిలో ప్రయోగించడంలో కవులు చక్కని నేర్పును ప్రదర్శిస్తారు.

ఈ క్రింది శ్లోకాన్ని చూస్తే కరణ (సాధన) బోధకాలైన పదాలను భిన్న లింగాలలో, వచనాలలో ఎలా ప్రయోగింపవచ్చునో తెలుస్తుంది. దీన్ని కంఠస్థం చేయండి.

శ్లో॥ మిత్రం స్వచ్ఛతయా, రిపుంనయబలై, ర్లుబ్ధం ధనై, రీశ్వరం
కార్యేణ, ద్విజ మాదరేణ, యువతింప్రేమ్ణా, శమైర్బాంధవాన్ ।
అత్యుగ్రంస్తుతిభి, ర్గురుం ప్రణతిభి, ర్మూర్ఖం కథాభి, ర్బుధం
విద్యాభీ, రసికం రసేన, సకలం శీలేన కుర్యాద్వశమ్ ॥

ఈ శ్లోకంలో ఈ క్రింది విధంగా కరణబోధకాలైన తృతీయావిభక్త్యన్త శబ్దాలను విడిగా గుర్తించవచ్చు. (ఇక్కడే కర్మవాచకాలను ద్వితీయావిభక్త్యంతాలుగా గుర్తించవచ్చు)

1) స్వచ్ఛతయా మిత్రం వశంకుర్యాత్ - స్వచ్ఛతచేత మిత్రుని వశపరచుకోవాలి. అక్కడ 'స్వచ్ఛతయా' అనేది ఆకారాన్త స్త్రీలింగం, వశపరచుకోవడంలో స్వచ్ఛత ఒక సాధనం. తృ.వి.ఏక.

2) నయబలైః రిపుం వశంకుర్యాత్ - నీతిబలాలచేత శత్రువును వశపరచుకోవాలి. ఇక్కడ 'నయబలైః' అనేది అకారాన్త నపుంసకలింగం, తృ.వి.బ.కరణవాచకం. నీతిబలాలు ఒక సాధనం.

3) ధనైః లుబ్ధం వశంకుర్యాత్ - ధనములచే లోభిని వశపరచుకోవాలి.
ఇక్కడ కరణవాచకమైన 'ధనైః' అనేపదం అకారాన్త నపుంసకలింగం. తృ.వి.బహు.వ.

4) కార్యేణ ఈశ్వరం వశంకుర్యాత్ - పనిచేత యజమానిని స్వాధీన పరచుకోవాలి.
ఇక్కడ 'కార్యేణ' అనేది అకారాన్త నపుంసకలింగం. తృ.వి.ఏక.వచనం.

5) ఆదరేణ ద్విజం వశంకుర్యాత్ - వేదవేత్త అయిన విజ్ఞుని ఆదరణచేత వశపరచుకోవాలి.

6) ప్రేమ్ణా యువతిం వశంకుర్యాత్ - ప్రేమచేత యువతిని వశపరచుకోవాలి.
ఇక్కడ 'ప్రేమ్ణా' అనే కరణ (సాధన) వాచకశబ్దం, నకారాన్త నపుంసకలింగం. తృ.ఏక.వ.

7) శమైః బాంధవాన్ వశంకుర్యాత్ - ఓర్పులతో బంధువులను వశపరచుకోవాలి.
ఇక్కడ 'శమైః' అనే కరణవాచకం అకారాన్త పుంలింగం తృ.బహు వచనం.

8) స్తుతిభిః అత్యుగ్రంవశంకుర్యాత్ స్తుతులచే అతితీవ్రస్వభావం కలవాణ్ణి. వశపరచుకోవాలి.

ఇక్కడ 'స్తుతిభిః' అనే కరణవాచకం ఇకారాన్త స్త్రీలింగం తృ.బహు. వచనం.

9) ప్రణతిభిః గురుం వశం కుర్యాత్ - స్తోత్రాలతో గురువును వశపరచుకోవాలి.
ఇక్కడ 'ప్రణతిభిః' అనే కరణవాచకం ఇకారాన్త స్త్రీలింగం తృ.బహు.వచనం.

10) కథాభిః- మూర్ఖం... మాటలచే మూర్ఖుని వశపరచుకోవాలి. 'కథాభిః' - ఆకా. స్త్రీ. తృ.బహు.వ.

11) విద్యాభిః బుధం.... విద్యలచే విద్వాంసుని వశపరచుకోవాలి. 'విద్యాభిః' అనేది ఆకా.స్త్రీ.తృ.ఏక.

12) రసేన రసికం..... రసంచేత రసికుని వశపరచుకోవాలి. 'రసేన' అనేది అకా.పుం.తృ.ఏక.

13) శీలేన సకలం... మంచినడువడిచేత అందర్నీ (అన్నీ) వశపరచుకోవాలి. 'శీలేన' అ.నపుం. తృ.ఏక.

ఈ ఉదాహరణాలచేత క్రియలో సాధనమైన అంటే శాస్త్ర పరిభాషలో 'కరణం' అయిన శబ్దాన్ని తృతీయా విభక్తిలో ప్రయోగించాలని తెలుసుకున్నాం. వెనుక 'కర్తను' కూడా తృతీయా విభక్తిలో ప్రయోగించాలని, సోదాహరణంగా ఆ రెండికీ గల తేడాను కూడా చెప్పడం జరిగింది. "కర్తృ - కరణయోః తృతీయా" 'కర్త-కరణం అనే రెండర్థాల్లో తృతీయా విభక్తి వస్తుందని పాణిని సూత్రీకరించాడు.

ఇక్కడొక విషయాన్ని గ్రహించాలి. ప్రథమా ద్వితీయా తృతీయాది విభక్తులు ఇంతవరకు చెప్పిన అర్థాల్లోనే కాక వేరే అర్థాల్లో కూడా వస్తాయి. ఆ విషయం సోదాహరణంగా ముందు చెప్పబడుతుంది.

**తృతీయా విభక్తికి సంబంధించిన కొన్ని విశేషాలు :**

1) సహ, సాకం, సార్థం, సమం, మొదలైన శబ్దాలు ప్రక్కన ఉంటే తృతీయావిభక్తి వాడాలి. పైశబ్దాలకు 'పాటు' 'కలసి' అనిఅర్థం. తేన సహ (సాకం, సార్థం, సమం) అహం గతవాన్ వానితోపాటు నేను వెళ్ళాను.

రామేణ సాకం లక్ష్మణః సీతాచ వనం జగ్మతుః

రామునితో పాటు లక్ష్మణుడు, సీతకూడా వనంగురించి వెళ్లారు.

2) ఏదైనా ఒక అంశం వేరొకదానికి 'హేతువు' (కారణం) అయినప్పుడు - ఆహేతువైనదాన్ని తృతీయా విభక్తితో సూచించాలి. పుణ్యేన స్వర్గః లబ్ధః - పుణ్యంచేత స్వర్గం లభించింది. విద్యయా వినయః లభ్యతే - విద్యచే వినయం లభిస్తుంది. అవివేకేన ఆపదః ప్రభవన్తి - అజ్ఞానంచే ఆపదలు ఏర్పడతాయి. మరికొన్ని విశేషాలు ముందు ముందు తెలుస్తాయి.

# సంప్రదానకారకం (చతుర్థీ విభక్తి)

సంప్రదానం' అనే అర్థాన్ని బోధిస్తూ చతుర్థీ విభక్తి వస్తుంది. సంప్రదానం అంటే ఏమిటి? ఎవరికైనా ఒక వస్తువును సంపూర్ణంగా (హక్కులతో) ఇస్తే, ఆ వస్తువును పుచ్చుకున్నవానిని 'సంప్రదానం' అని శాస్త్రకారులు నిర్ణయించారు. పాణిని ఈ అభిప్రాయాన్ని ఈ క్రింది సూత్రంలో చెప్పాడు. 'కర్మణా యమభిప్రై సనంప్రదానం' అని. ఇక్కడ 'కర్మ' అంటే ఇవ్వబడే వస్తువు. ఈ వస్తువులను ఇచ్చేవాడు కర్త. ఇవ్వడాన్ని 'దానం' లేదా 'త్యాగం' అన్నారు. ఈ దానాన్ని పుచ్చుకోవడానికి ఉద్దేశింపబడినవారు ఎవరో, వారినే 'సంప్రదానం' అని వ్యవహరించారు. ఈ సంప్రదాన కారకాన్ని చతుర్థీ విభక్తితో కూడిన పదం ద్వారా చెప్పాలి. 'చతుర్థీ సంప్రదానే' అనే సూత్రంచేత పాణిని ఈ అభిప్రాయాన్ని చెప్పాడు. ఇవ్వడం (దానం) అనే క్రియ ఉన్నచోట కర్మ (ఇవ్వబడేది); కర్త (ఇచ్చేవాడు) సంప్రదానం (పుచ్చుకునేవాడు) ఉండితీరాలి. ఇవ్వబడే వస్తువు, పుచ్చుకునేవాడు విధిగా ఉండితీరాలి. కర్తనుబోధించే పదం ఒకవేళ లేకపోయినా, సందర్భాన్ని బట్టి తెచ్చి అన్వయించుకోవచ్చు. ఈ 'సంప్రదాన' వాచకశబ్దం కూడా అన్ని లింగాల్లోను ఏక-ద్వి-బహువచనాల్లో నిర్దేశింపబడవచ్చును. ఉదాహరణాలు చూడండి.

1) రామాయ - రామాభ్యాం - రామేభ్యః - ఫలాని దీయన్తామ్.

రాముని కొరకు/ఇద్దరు రాముల కొరకు/రాముల కొరకు-ఫలములు ఈయబడునుగాక.

2)ఆచార్యాయ/ఆచార్యాభ్యాం/ఆచార్యేభ్యః - ప్రియధనం దదాతి.

ఆచార్యుని కొరకు/ఇద్దరు ఆచార్యులకొరకు/ఆచార్యులకొరకు-ప్రియమైన ధనమును ఇస్తున్నాడు.

3) యశోదా బాలకృష్ణాయ క్షీరం దదాతి - యశోద బాలకృష్ణుని కొరకు పాలను ఇస్తున్నది. ఇక్కడ కర్త్రి యశోద. బాలకృష్ణుడు సంప్రదానం. క్షీరం కర్మ. దానం క్రియ.

4) ఈ క్రింది శ్లోకం చూడండి.

శ్లో॥ కన్యాగుణవతే దేయా ;విద్యా శుశ్రూషవే సదా ।
దానం పాత్రాయ కర్తవ్యం; చిత్తం శ్రీహరయే ముదా ॥ (స్వీయం)

కన్య గుణవంతునికొరకు ఇవ్వబడాలి; విద్య-శుశ్రూష చేసేవానికొరకే ఎప్పుడు (ఇవ్వబడాలి)
దానము యోగ్యునికొరకే చేయాలి; మనస్సు శ్రీహరికొరకే సంతోషంతో (ఇవ్వబడాలి)
గుణవతే, శుశ్రూషవే, పాత్రాయ, శ్రీహరయే అనేవి సంప్రదాన వాచకాలు.
ఈ నాలుగు ఏకవచనాలు. చతుర్థీ విభక్తి. మిగతా వచనాల్లో ఇలా ఉంటాయి.
గుణవతే - గుణవద్భ్యాం - గుణవద్భ్యః - 'గుణవత్' శబ్దం, తకారాన్తం. పుం.చ.
శుశ్రూషవే - శుశ్రూషుభ్యాం - శుశ్రూషుభ్యః - శుశ్రూషు శబ్దం. ఉ.పుం.చ.వి.
శ్రీహరయే - శ్రీహరిభ్యాం - శ్రీహరిభ్యః - 'శ్రీహరి'శబ్దం. ఇకా. పుం.చ.వి.

చతుర్థీ విభక్తిని ప్రయోగించడంలో చాలా విశేషాలను వ్యాకరణ కర్తలు చెప్పారు. అయితే వ్యవహారంలో మనం బాగా చూచే 1,2 ప్రయోగ విశేషాలను మాత్రం సోదాహరణంగా తెలుసుకుందాం.

ఎ) "సంప్రదానమ"నే కారకం కాకపోయినా కొన్నిచోట్ల చతుర్థీ విభక్తి వస్తుంది. నమః, స్వస్తి, స్వాహా, స్వధా, అలం అనే శబ్దాలు ప్రక్కన ఉన్నప్పుడు చతుర్థీ విభక్తి వాడవలసి ఉంటుంది. మనందరికీ విష్ణుసహస్ర నామం మొదలైనవి చదవటం అలవాటుందికదా! ఆ నామాలకు చతుర్థీ విభక్తి చేర్చి ప్రక్కన 'నమః' అంటారు. విష్ణవే నమః. రామాయనమః, ఇలాగే గురవే నమః, ప్రజాభ్యః స్వస్తి ఇంద్రాయ స్వాహా. ఇలా ఈ క్రింది శ్లోకంలో చతుర్థీ విభక్తిలో ప్రయోగింపబడిన అనేక రకాల పుంలింగ శబ్దాలు అకారాన్తాలు, ఇకారాన్తాలు, ఉకారాన్తాలు, ఋకారాన్తాలు ఇలా చాలా శబ్దాలు కూర్చ బడ్డాయి. దీన్ని కంఠస్థం చేసి చతుర్థీ విభక్తి ప్రయోగాన్ని ఏకవచనంలో ఎలా ఉన్నదో గుర్తించండి.

శ్లో॥ నారాయణాయ, నలినాయతలోచనాయ,
జ్ఞానాత్మనే, నిఖిలభూతభృతే, ఽధికర్త్రే।
శ్రీ విష్ణవే, దనుజలోకభిదే, ఽజపిత్రే
మోహారయే, ఽఘహరయే, గురవే-నమస్తే ॥ (స్వీయం)

ఈ శ్లోకంలో 'నమస్తే' అనే ఒక్క పదం తప్ప మిగిలిన పదాలన్నీ చతుర్థీ విభక్తి ఏకవచనప్రయోగాలే.

పద్మంలా విశాలమైన నేత్రం కలవాడు, జ్ఞానస్వరూపుడు, అన్ని లోకాలను భరించేవాడు, నియమించేవాడు, సర్వవ్యాపకుడు, దనుజలోకాన్ని ఛేదించినవాడు,

బ్రహ్మకు తండ్రి, మోహాన్ని నశింపజేసేవాడు, పాపనాశకుడు, గురువు అయిన నారాయణుని కొరకు నమస్కారము (తెలుగులో చతుర్థికి బదులు షష్ఠి వాడటం ఉంది.)

1) నారాయణాయ-నారాయణాభ్యాం-నారాయణేభ్యః 'నారాయణ' అకా.పుం.
2) నలినాయతలోచనాయ-పైశబ్దంలాగానే. 'నలినాయతలోచన' అ.పుం. (పద్మంలాంటి పెద్ద కన్నులు కలవాడు.)
3) జ్ఞానాత్మనే-జ్ఞానాత్మభ్యాం-జ్ఞానాత్మభ్యః-'జ్ఞానాత్మన్' నకారాన్త.పుం. (జ్ఞాన స్వరూపుడు)
4) నిఖిలభూతభృతే.....భృద్భ్యాం.....భృద్భ్యః - 'నిఖిలభూతభృత్' తకా.పుం. (సమస్త భూతాల్నీ ధరించినవాడు.
5) అధికర్త్రే-అధికర్తృభ్యాం అధికర్తృభ్యః-'అధికర్తృ' ఋకారాన్త.పుం. (నియామకుడు)
6) శ్రీ విష్ణవే-శ్రీ విష్ణుభ్యాం-శ్రీవిష్ణుభ్యః-'శ్రీవిష్ణు' ఉకా. పుం. (లక్ష్మీవిశిష్టుడై సర్వవాపకుడు)
7) దనుజలోకభిదే.....భిద్భ్యాం.....భిద్భ్యః 'దనుజలోకభిద్' దకా.పు. (దానవలోకాన్ని ఛేదించినవాడు)
8) అజపిత్రే - అజపితృభ్యాం - అజపితృభ్యః 'అజపితృ' ఋకా.పుం. (బ్రహ్మయొక్క తండ్రి)
9) మోహారయే - మోహారిభ్యాం - మోహారిభ్యః - 'మోహారి' ఇకా.పుం. (మోహనాశకుడు,)
10) అఘహరయే - పై శబ్దంలాగానే 'అఘహరి' ఇకా.పుం. పాపనాశకుడు.
11) గురవే - గురుభ్యాం - గురుభ్యః - 'గురు' ఉకా.పుం. అజ్ఞానాన్ని పోగొట్టే ఆచార్యుడు. ఈ శబ్దాలన్నీ చతుర్థీ విభక్తి ఏకవచనాలు.

స్త్రీలింగ శబ్దాలను చతుర్థ్యన్తంగా ప్రయోగించిన ఈ శ్లోకం చూడండి.

సౌభాగ్యార్థమ్ ఉమాదేవ్యై, బుద్ధ్యర్థం సర్వదా శ్రియై ।
విద్యార్థం బ్రహ్మణో వధ్వై, గాయత్ర్యై వర్చసే నమేత్ ॥ (స్వీయం)

1) సౌభాగ్యార్థమ్ ఉమాదేవ్యై - సౌభాగ్యం కొరకు (ఎల్లప్పుడు), ఉమాదేవికి నమస్కరించాలి.

2) బుద్ధ్యర్థం సర్వదా శ్రియై - ఐశ్వర్యం కొరకు (ఎల్లప్పుడు, లక్ష్మీదేవికి నమస్కరించాలి. (తెలుగులో చతుర్థికి బదులు షష్ఠి వాడతారు)
3) వర్చసే గాయత్ర్యై (నమేత్) తేజస్సు కోసం గాయత్రి కొరకు నమస్కరించాలి. ఈ మూడుచోట్ల 'ఉమాదేవీ' 'శ్రీ' గాయత్రీ' అనే మూడు శబ్దాలు ఈకా.స్త్రీ.ప్ర.ఏ. శ్లోకంలో చతుర్థీ విభక్తిలో వాడబడ్డాయి.
4) విద్యార్థం బ్రహ్మణోవధ్వై-విద్యకోసం సరస్వతి కొరకు నమస్కరించాలి. 'వధూ' శబ్దం - ఊకా. స్త్రీ.చ.ఏ. ప్రయోగింపబడింది.

**చతుర్థీవిభక్తికి సంబంధించిన కొన్ని విశేషాలు:**

1) క్రోధం, ద్రోహం, ఈర్ష్య, అసూయ అనే అర్థాలు కల క్రియా పదాలను వాడినప్పుడు, ఎవరిపట్ల క్రోధాదులు ప్రదర్శిస్తున్నామో వారిని చతుర్థీవిభక్తిలో ప్రయోగించాలి.

**ఈ క్రింది వాక్యాలుచూడండి.**

1) కంసః కృష్ణాయ ద్రుహ్యతి
కంసుడు కృష్ణుని కొరకు ద్రోహం చేస్తున్నాడు.
2) యజమానః భృత్యాయ క్రుధ్యతి.
యజమానుడు సేవకునికొరకు క్రోధపడుతున్నాడు.
3) సుయోధనః భీమాయ అసూయతి.
దుర్యోధనుడు భీమునికొరకు అసూయపడుతున్నాడు.
4) నిర్ధనాః ధనిభ్యః ఈర్ష్యన్తి.
ధనహీనులు సంపన్నులకొరకు ఈర్ష్యపడుతున్నారు.

ఇక్కడ 'కొరకు' అనేది 'వారిపట్ల ' అనే అర్థంలో వాడబడుతున్నది.

మరికొన్ని విశేషాలు ముందుముందు గ్రహింపవచ్చును.

# అపాదాన కారకం - పంచమీ విభక్తి

ఇప్పుడు పంచమీ విభక్తి ఏ అర్థంలో వస్తుందో, పంచమీ విభక్తి ప్రయోగాలు ఎలా ఉంటాయో చూద్దాం. పాణిని మహర్షి తన వ్యాకరణ సూత్రాల్లో 'అపాదానం' అనే అర్థంలో పంచమీ విభక్తి వస్తుందని చెప్పాడు. 'అపాదానే పంచమీ' అనే సూత్రంచేత. 'అపాదానం' అంటే ఏమిటో కూడా 'ధ్రువమపాయే అపాదానమ్' అనే సూత్రంచేత చెప్పాడు. ఒక వస్తువు నుంచి మరొక వస్తువు వేరవడం అపాయం లేదా విశ్లేషం అని అంటారు. ఇలా ఒక వస్తువు నుంచి మరో వస్తువు వేరవుతున్నప్పుడు, ఏ వస్తువునుండి ఇంకొక వస్తువు విడివడుతున్నదో ఆ వస్తువును "అపాదానం" అంటారు. ఉదాహరణానికి "మేఘాత్ వర్షణం పతతి." మేఘం నుండి వర్షం పడుతున్నది. అనే వాక్యం తీసుకుందాం. ఇక్కడ పడుతున్న వర్షం. ఎక్కడనుండి పడుతున్నది? మేఘంనుండి? అంటే మేఘంనుండి జలానికి ఎడబాటు కలుగుతున్నది. ఇలా ఎడబాటును పొందే జలానికి, అవధి లేదా హద్దు - మేఘం, కనుక దానిని 'అపాదానం' అంటారు. కనుక మేఘశబ్దానికి పంచమీ విభక్తి చేరింది. ఇలాగే మరికొన్ని ఉదాహరణాలు చూడండి.

1 1) వృక్షాత్ - ఫలం - పతతి - చెట్టునుండి ఫలం పడుతున్నది.
2) ధనుషః - బాణాః - నిస్సరంతి - ధనుస్సు నుండి బాణాలు వెలువడు తున్నాయి.
4) అక్షిభ్యాం - భాష్పం - స్రవతి - రెండుకన్నుల నుండి కన్నీరు స్రవిస్తున్నది.
5) నగరేభ్యః - జనాః - నిర్గచ్ఛంతి - నగరాల నుండి జనులు వెలుపలికి వస్తున్నారు.

2) 'భయం' అనే అర్థాన్ని బోధించే క్రియాపదాలను ప్రయోగించి నప్పుడు, భయం కలగడానికి ఏది హేతువోదాన్ని కూడా అపాదానం' అని అంటారు.

1) వ్యాఘ్రాత్ బిభేతి - పెద్దపులి వల్ల భయపడుతున్నాడు.
2) ఉపాధ్యాయాత్ విద్యార్థీ బిభేతి - ఉపాధ్యాయునివలన విద్యార్థి బయపడు తున్నాడు.
3) పాపాత్ సజ్జనః బిభేతి - పాపం వల్ల సుజనుడు భయపడుతున్నాడు. ఈ ఉదాహరణాల్లో వ్యాఘ్రంవల్ల, ఉపాధ్యాయుని వల్ల, పాపంవల్ల భయం కలుగుతున్నది కనుక, వీటికి 'అపాదానం' అనే పేరు, పంచమీ విభక్తి వచ్చింది.

3) 'త్రాణం' లేదా 'రక్షణం' అనే అర్థం కల క్రియాపదం ప్రయోగించినప్పుడు కూడా ఎవరినుండి లేదా దేనినుండి 'రక్షణం' పొందాలని భావిస్తున్నా మోదానికి కూడా 'అపాదానం' అనే పేరు, పంచమీ విభక్తి వస్తుంది.
ఉదా:- 1) చోరాత్ త్రాయతే - చోరుని నుండి తనను రక్షించు కుంటున్నాడు.
2) రోగాత్ త్రాయతే - రోగం నుండి రక్షించుకుంటున్నాడు.

4) 'పరాజయం' పొందడం అనే అర్థం కల 'పరాజయతే' అనే క్రియాపదాన్ని ప్రయోగించినప్పుడు కూడా దేనినుండి పరాజయం పొందుతున్నామో దానికి 'అపాదాన'మనే పేరు పంచమీ విభక్తి వస్తుంది.

ఉదా: అధ్యయనాత్-పరాజయతే-చదువునుండి ఓడిపోయాడు. ఇక్కడ చదువువల్ల అలసిపోయాడని అభిప్రాయం.

5) జుగుప్స (ఏవగింపు) విరామము (ఆగుట) ప్రమాదము (ఏకాగ్రత తప్పుట) అనే అర్థాలు కల ధాతువులను (క్రియాపదాలను) ప్రయోగించినప్పుడు దేనివల్ల ఏవగింపు కలుగుతున్నదో, దేనినుండి విరమిస్తున్నాడో, దేనినుండి ప్రమాదాన్ని పొందుతున్నాడో దానికి 'అపాదానం' అనే పేరు పంచమీ విభక్తి వస్తుంది. ఉదా:

1) పాపాత్ - జుగుప్సతే - పాపమునుండి ఏవగించుకుంటున్నాడు. పాపం విషయంలో ప్రవర్తించడం లేదని అభిప్రాయం.

2) కామేభ్యః విరమతి - కామము నుండి విరమిస్తున్నాడు. 'కామం' అంటే కోరిక. కోరికల విషయంలో ప్రవర్తించడం లేదని అర్థం. ఇక్కడ 'కామం' అపాదానం. దానికే పంచమీ విభక్తి.

3) ధర్మాత్ - ప్రమాద్యతి - ధర్మం నుండి ప్రమాదపడుతున్నాడు. 'ప్రమాదం' అనే శబ్దానికి ఏకాగ్రత లేకపోవడం లేదా తప్పడం అని అర్థం. ధర్మాచరణం విషయంలో మోహాన్ని పొందుతున్నాడని అభిప్రాయం. ఉపనిషత్తు ల్లోకూడా ఇలాగే ప్రయోగం ఉంది చూడండి.

సత్యాత్ న ప్రమదితవ్యమ్ - సత్యమునుండి ప్రమాదాన్ని పొందరాదు.
ధర్మాత్ నప్రమదితవ్యమ్ - ధర్మమునుండి ప్రమాదాన్ని పొందరాదు.
కుశలాత్ నప్రమదితవ్యమ్ - ఆత్మరక్షణము నుండి ఏమరుపాటు పొందరాదు.

స్వాధ్యాయ ప్రవచనాభ్యాం నప్రమదితవ్యమ్ - స్వాధ్యాయము (వేదాధ్యయము) దాని ప్రవచనము (ఇతరులకు వేదాన్ని అధ్యాపనం చేయడం, - వీటినుండి ప్రమాదపడరాదు.

4) 'నివారించడం' అనే అర్థం కల క్రియాపదాలు ప్రయోగించి నప్పుడు దేనినుండి నివారిస్తున్నామోదానికి 'అపాదాన' మనే పేరు. పంచమీ విభక్తి వస్తుంది. ఉదా:

1) సస్యాత్ పశూన్ వారయతి పంటనుండి పశువులను వారిస్తున్నాడు. ఇక్కడ 'సస్యం' అపాదానం.

2) విష్ణుః దైత్యాన్ అధర్మాత్ నివారయతి - విష్ణువు దైత్యులను అధర్మం నుండి నివారిస్తున్నాడు. ఇక్కడ 'అధర్మం' అపాదానం.

5) ఎవరికి తాను కనబడ కూడదని దాగుకొంటున్నాడో వారికి కూడా అపాదాన మనేపేరు, పంచమీ విభక్తి. వస్తుంది.

ఉదా : 1) కృష్ణః మాతుః నిలీయతే కృష్ణుడు తల్లినుండి కనపడకుండా దాగుతున్నాడు. ఇక్కడ తల్లి 'అపాదానం' కనుక 'మాతృ శబ్దానికి పంచమీ విభక్తి వచ్చింది.

2) సుజనాః మూర్ఖేభ్యః నిలీయన్తే - మంచివారు మూర్ఖులనుండి కనపడకుండా దాగుతున్నారు.

6) 'వానికంటే అనేచోట 'కంటే', అనే అర్థాన్ని పంచమీ విభక్తి బోధిస్తున్నది. అలాగే హరేః ముక్తిదః పరః నాస్తి - హరికంటె ముక్తినిచ్చే వేరొకడు లేడు.

7) భక్తేః ముక్తికరీ నాస్తి - భక్తికంటే ముక్తి నిచ్చేది లేదు.

6 ఈ క్రింది శ్లోకంలో పంచమీ విభక్తి ప్రయోగాలు చూడండి.

శ్లో॥ యస్సృష్టవాన్ నిజముఖాదమరేంద్ర మగ్నిం
స్వాక్ష్ణో రవిం, నిజపదో నిఖిలాంచ పృథ్వీం ।
యశ్చేత సోమ్మృతకరం, జగతీః శ్రుతిభ్యాం
మూర్ధ్నో ద్యులోక, మమలాం కమలామురస్తః ॥
మనోశ్శివం, నిజమతే శ్చతురాననంచా
ప్యాత్మోజసో నరపతీన్, ఉదరాన్నభశ్చ,
లోమభ్య ఏవ సస్పృజే జగదండ జాతం
వాయూనసుప్రచయ తస్తమజం శ్రయామః ॥ (స్వీయం)

ఎవ్వడు తన ముఖం నుండి ఇంద్రాగ్నులను, కంటి నుండి సూర్యుని, తన పాదము నుండి సమస్త పృథివిని, మనస్సునుండి చంద్రుణ్ణి, చెవులనుండిలోకాలను, శిరస్సు నుండి ద్యులోకాన్ని, వక్షఃస్థలం నుండి నిర్మలయైన లక్ష్మిని, తన క్రోధం నుండి పరమశివుని, తన బుద్ధినుండి చతుర్ముఖ బ్రహ్మను, తనతేజస్సు నుండి పరిపాలకులను, ఉదరం నుండి ఆకాశాన్ని, వెంట్రుకల నుండి (శరీరంమీద ఉన్న రోమాల నుండి) సమస్త బ్రహ్మాండాలను, ప్రాణాలనుండి వాయువులను సృజించి స్వయంగా పుట్టుకలేనివాడో అట్టి పరమాత్మను ఆశ్రయింతుము. ఈ శ్లోకాల్లో ఈ వాక్యాలు చూడండి. అధోరేఖాంకితాలన్నీ పంచమీ విభక్తి: అపాదానాలు.

1) నిజముఖాత్ అమరేంద్రమ్ అగ్నిం సృష్టవాన్ - తన ముఖంనుండి ఇంద్రుని అగ్నిని సృజించెను. మధ్యలోని రెండు పదాలు కర్మవాచకాలు. చివరిది క్రియ.
2) స్వాక్ష్ణః రవిమ్ సృష్టవాన్ - తనకంటినుండి సూర్యుని సృజించెను.
3) నిజపదః నిఖిలాం పృథివీం సృష్టవాన్ - తన పాదంనుండి సమస్త భూమిని సృజించెను. మధ్యలోని రెండు పదాలు కర్మవాచకాలు. చివరిది క్రియ.
4) చేతసః అమృతకరం సృష్టవాన్ - మనస్సు నుండి చంద్రుణ్ణి సృజించాడు.
5) శ్రుతిభ్యాం జగతీః సృష్టవాన్ - రెండుచెవుల నుండి జగత్తులను సృజించాడు.
6) మూర్ధ్నః ద్యులోకం సృష్టవాన్ - శిరస్సునుండి దేవలోకాన్ని సృజించాడు.
7) ఉరస్తః కమలాం సృష్టవాన్ - వక్షః స్థలంనుండి లక్ష్మిని సృజించాడు.
8) మన్యోః శివం సృష్టవాన్ - క్రోధం నుండి శివుని సృజించాడు.
9) నిజమతేః చతురాననం సృష్టవాన్ - తనబుద్ధినుండి బ్రహ్మను సృజించాడు.
10) ఆత్మౌజసః నరపతీన్ సృష్టవాన్ - తనతేజస్సు (బలం) నుండి ప్రభువులను సృజించాడు. ఈ వాక్యాలన్నింటిలో కర్మను, క్రియనుకూడా గుర్తించండి.
11) ఉదరాత్ నభః సృష్టవాన్ - ఉదరం నుండి ఆకాశాన్ని సృజించాడు.
12) లోమభ్యః జగదండజాతం ససృజే - రోమాలనుండి బ్రహ్మాండాలు సృజించాడు.
13) అసుప్రచయతః వాయూన్ ససృజే - ప్రాణాలనుండి వాయువులను సృజించాడు.

ఈ వాక్యాల్లో మొదటి పదాలన్నీ 'అపాదానం' అనే పేరుపొంది పంచమీ విభక్తి పొందాయి. 1,2,3,4,6,8,9,10,11 ఈ అంకెలు కల పదాలు ఏకవచనాలు. 5సంఖ్య కల పదం ద్వివచనం. 12వ సంఖ్య - బహువచనం 'ఉరస్తః' అసు ప్రచయతః' అనే రెండుచోట్లా 'తః' (తస్) అని, పంచమీ విభక్తి యొక్క అర్థాన్నీ బోధించే 'తసిల్' ప్రయత్యయాన్ని ప్రయోగించడం జరిగింది.

# షష్ఠీ విభక్తి - సంబంధబోధనం

షష్ఠీ విభక్తిని రెండు వస్తువుల మధ్య లేదా రెండు విషయాల మధ్య ఉన్న సంబంధాన్ని బోధించడానికి ఉపయోగించాలి. ఈ సంబంధం అనేక రకాలుగా ఉండవచ్చు. ఈ షష్ఠీ విభక్తి చేత బోధింపబడే 'సంబంధం' అనేది కర్త, కర్మ మొదలైన కారకాల వంటిది కాదు. ఏది క్రియతో సంబంధం సాక్షాత్తుగా కలిగి ఉంటుందో, దాన్ని కారకం అని అంటారు. ఉదాహరణానికి - 'భార్యా పాకం కరోతి'- భార్య వంట చేస్తున్నది' అన్నప్పుడు, భార్య వంటచేస్తున్న వ్యక్తి, కనుక కర్త్రి. పాకం కర్మ. ఈ రెండు సాక్షాత్తు గానే క్రియతో అన్వయిస్తున్నాయి. ఎందువల్ల? చేస్తున్నది. ఎవరు? భార్య చేస్తున్నది దేన్ని.? పాకాన్ని అని క్రియాపదం విన్నప్పుడు పుట్టే ప్రశ్నలకు సమాధానంగా అన్వయిస్తున్నాయి. కారకాలన్నీ ఇలాగే క్రియాపదం విన్నప్పుడు కలిగే ప్రశ్నల్తో అన్వయిస్తాయి. ఉదాహరణానికి ఈ క్రింది క్రియాపదం చూడండి. 'దదాతి' = ఇస్తున్నాడు లేదా, పెడుతున్నాడు.

| కర్త | కర్మ | కరణం | సంప్రదానం | అపాదానం | అధికరణం | క్రియ |
|---|---|---|---|---|---|---|
| రామః | అన్నం | హస్తేన | యాచకాయ | పాత్రాత్ | పత్రే | దదాతి |
| రాముడు | అన్నాన్ని | చేతితో | బిచ్చగాని కొరకు | పాత్రనుండి | ఆకులో | పెడుతున్నాడు |
| ఎవడు? | దేన్ని? | దేనితో? | ఎవరికొరకు? | ఎక్కడనుండి? | దేనిలో? | పెడుతున్నాడు |

ఇక్కడ మూడవ వరుసలో ఉన్న ప్రశ్నలు, క్రియాపదాన్ని 'దదాతి' పెడుతున్నాడు అని వినగానే కలుగుతాయి. వాటికి సమాధానం మొదటి వరుసలో క్రమంగా ప్రథమ - ద్వితీయ - తృతీయ - చతుర్థి - పంచమీ - సప్తమి అనే ఆరు విభక్తుల్లో నిర్దేశింపబడ్డాయి. ఇక్కడ 'ఎవరికి' సంబంధించినది?' అనే సంబంధాన్ని గురించిన ప్రశ్న పుట్టలేదు. కనుక క్రియాపదంలో 'సబంధం' అనే అర్థం సాక్షాత్తుగా అన్వయించదు. అయితే ఇతర కారకాల ద్వారా అన్వయం పొందవచ్చు. ఎలాగంటే "రామస్య పుస్తకమ్ అస్తి రామునియొక్క పుస్తకం ఉన్నది అనే వ్యాక్యాన్ని విశ్లేషించి చూడండి. పుస్తకమ్ అస్తి - పుస్తకం ఉంది. (ఇక్కడ పుస్తకం కర్తృకారకం)

కస్య పుస్తకమ్ అస్తి? ఎవనికి చెందిన (సంబంధించిన) పుస్తకం ఉంది? రామస్య-పుస్తకమ్-అస్తి-రామునికి చెందిన పుస్తకం ఉంది అని ఇలా 'రామస్య' అనేచోట 'స్య' అనే షష్ఠీ విభక్తి ద్వారా పుస్తకం ఎవరికి సంబంధించినదో తెలుస్తున్నది.

పుస్తకానికి రామునికి సంబంధం ఉందని షష్ఠీ విభక్తి వల్ల తెలుస్తుంది. ఈ సంబంధం ఏమిటి? స్వ-స్వామి భావసంబంధం. స్వమ్ అంటే వస్తువు (సొత్తు). స్వామి అంటే ఆ వస్తువు కదా సొత్తు కలవాడు. అంటే ఆ వస్తువు పై సంపూర్ణాధికారం కలవాడు. ఇలాంటి స్వస్వామిభావ సంబంధాన్నిషష్ఠీవిభక్తి ఇక్కడ బోధిస్తున్నది షష్ఠీవిభక్తి సాక్షాత్తుగా క్రియాపదంతో అన్వయాన్ని పొందలేదు. బోధిస్తుంది. మరికొన్ని షష్ఠీవిభక్తి ప్రయోగాలు చూద్దాం. స్వస్వామి భావాన్నే కాక అనేక సంబంధాలను షష్ఠి - బోధిస్తుంది.

1) ఇంద్రస్య వాహనమ్ ఐరావతః - ఇంద్రునియొక్క వాహనము ఐరావతము.
2) విష్ణోః ఆయుధం చక్రమ్ - విష్ణువుయొక్క ఆయుధము చక్రము.
3) శిశోః చేష్టాః ప్రీతిదాః భవన్తి - శిశువు యొక్క చేష్టలు ప్రీతిని కలిగిస్తాయి.
4) శివస్య అభిషేకః లోకప్రియః - శివుని అభిషేకం లోకప్రీతిని కలిగించును.
5) హరేః అలంకారః లోకదర్శనీయః - విష్ణువుయొక్క అలంకారం లోకం చూడదగినది.
6) లక్ష్మ్యాః అనుగ్రహాత్ సర్వసంపదః భవన్తి - లక్ష్మియొక్క అనుగ్రహం వలన సర్వ సంపదలు కల్గును.

2. ఈ క్రింది శ్లోకంలో షష్ఠీ - ఏకవచన ప్రయోగాలు చూడండి.

శ్లో॥ సర్వాశుచినిధానస్య, కృతఘ్నస్య, వినాశినః,
శరీరక స్యాపి కృతే మూఢాః పాపానికుర్వతే ॥ (నాగానంద నాటకం)

1 సర్వాశుచినిధానస్య - సమస్త అశుచులకు (దోషాలకు) నెలవైనది - అకా. నపుం.ష.ఏక.
2 కృతఘ్నస్య - చేసిన మేలు మరిచేది, కృతఘ్న శబ్దం నపుం.ష.ఏక.
3 శరీరకస్య - తుచ్ఛమైన శరీరం కోసం (శరీరక శబ్దం - నపుం.ష.ఏక.)
4) వినాశినః - నశించే స్వభావం కలది (వినాశిన్ శబ్దం-నకా.నపుం.ష.ఏక) (సమస్త దోషాలకు నెలవైంది. ఎంత పోషించినా కృతజ్ఞత ఏ మాత్రం లేనిది, నశించే స్వభావం కలది అయిన ఈ తుచ్ఛశరీరం కోసం మూఢులు పాపాలు చేస్తారు.)

3. ఇంకొక శ్లోకం చూడం. ఈ శ్లోకంలో వేరువేరు అంతాలు (చివరి అక్షరాలు) కలిగిన శబ్దాలున్నాయి.

శ్లో॥ వైకుంఠనాథస్య, దయామృతాబ్ధే
రమాపతేః, పార్థగురోః, విధాతుః ।
విష్ణే, రజస్యాత్మ భువః, సుకీర్తేః
సతాం గతేః, నందకినః సునామ్నః ॥ (స్వీయం)

శ్లో॥ గదాధరస్యార్తి, హృతః, పరేశో
పత్యుస్సతాం, దేవద్రుహాం, నిహన్తుః ।
హృతైనసో, విశ్వప, ఈడ్యభూతేః
అనుగ్రహో ముక్తిద ఇత్యవేహి ॥ (స్వీయం)

వైకుంఠనాథుడు, దయామృత సాగరుడు, రమాపతి, పార్థునకు గురువు, సమస్తలోక నిర్మాత, సర్వవ్యాపకుడు (విష్ణువు) పుట్టకలేనివాడు (అజుడు) తనంతతానే తన సంకల్పం చేత అవతరించేవాడు, మంచి యశస్సు కలవాడు, సజ్జనులకు గతియైనవాడు, నందకమనే ఖడ్గాన్ని ధరించినవాడు, మంచి నామం కలవాడు, గదాధరుడు, ఆర్తిని హరించేవాడు, పరేశుడు, సజ్జనుల రక్షించేవాడు, దేవద్రోహులైన రాక్షసుల చంపేవాడు, పాపాన్ని హరించినవాడు, లోకపాలకుడు, స్తుతింపదగిన వైభవం కలవాడు, అయిన శ్రీహరి యొక్క అనుగ్రహమే ముక్తిని ఇస్తుందని గ్రహించు. ఈ శ్లోకంలో వేరువేరు అంతాలు గల పదాలు షష్ఠీ ఏకవచనంలో ప్రయోగింపబడ్డాయి. మిగతా వచనాలలో కూడా ఎలా ఉంటాయో ఈ పదాలను గమనించండి. ఒకే అంతం గల శబ్దాలను అకారాది క్రమంలో ఒక వరుసలో ఇవ్వడం జరిగింది చూడండి.

1 వైకుంఠనాథస్య వైకుంఠనాథయోః - వైకుంఠనాథానామ్ అకా.పుం.(వైకుంఠనాయకుడు)
2 అజస్య-అజయోః-అజానామ్ అకా.పుం. (పుట్టుక లేనివాడు)
3 గదాధరస్య-గదాధరయోః -గదాధరాణామ్ అకా.పుం. (గదను ధరించువాడు)
4 దయామృతాబ్ధేః-దయామృతాబ్ధ్యోః-దయామృతాబ్ధీనామ్.ఇకా. పుం. (దయాసాగరుడు)
5 రమాపతేః - రమాపత్యోఃరమాపతీనామ్ ఇకా.పుం. (లక్ష్మికి భర్త)
6 సుకీర్తేః-సుకీర్త్యోః - సుకీర్తీనామ్ ఇకా.పుం.(మంచికీర్తి కలవాడు)
7 గతేః - గత్యోః - గతీనామ్ ఇకా.స్త్రీ (దిక్కు,ఆశ్రయం)
8 పత్యుః పత్యోః - పతీనామ్ ఇకా.పుం. (పాలకుడు)

9 ఈడ్య భూతేః - ఈడ్యభూత్యోః - ఈడ్య భూతీనామ్ ఇకా.పుం.(స్తుతింపదగిన ఐశ్వర్యం కలవాడు)

10 పార్థగురోః - పార్థగుర్వోః - పార్థగురూణామ్ ఉకా.పుం.(పార్థునకు గురువు)

11 విష్ణోః - విష్ణ్వోః - విష్ణూనామ్ ఉకా.పుం.(సర్వవ్యాపకుడు)

12 ఆత్మభువః - ఆత్మభువోః - ఆత్మభువామ్. ఊకా.పుం.(తనంత తానుపుట్టినవాడు)

13 విధాతుః - విధాత్రోః - విధాతౄణామ్ ఋకా.పుం. (లోకధాత)

14 నిహన్తుః - నిహంత్రోః - నిహన్తౄణామ్ ఋకా.పుం. (చంపువాడు)

15 విశ్వపః - విశ్వపోః - విశ్వపామ్ ఆకా.పుం.(లోకరక్షకుడు)

16 సతః - సతోః - సతామ్ (సత్‌శబ్దః తకా.పుం. సజ్జనులకు)

17 ఆర్తిహృతః-ఆర్తిహృతోః-ఆర్తిహృతామ్ - తకా.పుం. (ఆర్తినిహరించువాడు)

18 నందకినః - నందకినోః - నందకినామ్ - నకా.పుం. (నందకముకలవాడు)

19 సునామ్నః - సునామ్నోః - సునామ్నామ్ - నకా.పుం. (మంచిపేరులు కలవాడు)

20 పరేశః - పరేశోః - పరేశామ్ (పరేశ్‌శబ్దః) శకా.పుం. (సర్వోత్కృష్టుడైన నియామకుడు)

21 హృతైనసః - హృతైనసోః - హృతైనసామ్ (హృతైనస్‌శబ్దః సకా.పుం.(పాపాన్ని హరించినవాడు)

22 దేవద్రుహః - దేవద్రుహోః-దేవద్రుహామ్ (దేవద్రుహ్)హకా.పుం.(దేవతలకు ద్రోహంచేసేవాడు)

4 ఈ క్రింది శ్లోకంలో షష్ఠీ విభక్తిలో ఉన్న పదాలు వాక్యాల్లో ఎలా ప్రయోగింపబడ్డాయో చూడండి.

శ్లో॥ నీతిర్భూమిభుజాం, నతిర్గుణవతాం, హ్రీరంగనానాం, రతి
ర్దంపత్యోః, శిశవోగృహస్య, కవితా బుద్ధేః ప్రసాదో గిరామ్ ।
లావణ్యం వపుషః, శ్రుతం సుమనసః, శాంతి ర్ద్విజస్య, క్షమా
శక్తస్య, ద్రవిణం గృహాశ్రమవతాం స్వాస్థ్యం సతాం మండనమ్ ॥

1 భూమిభుజాం నీతిః మండనమ్ - పరిపాలకులకు నీతి అలంకారం. (జ.పుం.ష.బహు) భూమిభుజ్ శబ్దం.

2 గుణవతాంనతిః మండనమ్-గుణవంతులకు నమ్రత అలంకారం (త.పుం.షబహు) గుణవత్ శబ్దం.

3 అంగనానాం హ్రీః మండనమ్ -స్త్రీలకు సిగ్గు అలంకారం (ఆ.స్త్రీ.ష.బహు)

4 దంపత్యోఃరతిః మండనమ్-దంపతులకు ప్రీతి అలంకారం (ఇకా.పుం.ష.ద్వివ)

5 గృహస్య శిశవః మండనమ్ -ఇంటికి పిల్లలు అలంకారం (అకా.నపుం.షఏక)

6 బుద్ధేః కవితా మండనమ్ - బుద్ధికి కవిత్వం అలంకారం (ఇకా.స్త్రీ. షఏక)

7 గిరాం ప్రసాదః మండనమ్-వాక్కులకు ప్రసన్నత అలంకారం (రేఫాన్త.స్త్రీ.ష.బహు)

8 వపుషః లావణ్యం మండనమ్ - శరీరానికి సౌందర్యం అలంకారం (షకా.నపుం.షఏక) వపుష్ శబ్దం.

9 సుమనసః శ్రుతం మండనమ్ - విద్వాంసునికి శాస్త్రజ్ఞానం అలంకారం (సకా.పుం.షఏక)

10 ద్విజస్య శాంతిః మండనమ్ - ద్విజునికి శాంతి అలంకారం (అకా.పుం.షఏక)

11 శక్తస్య క్షమా మండనమ్ - సమర్థునికి సహనం అలంకారం (అకా.పుం.షఏక)

12 గృహాశ్రమవతాం ద్రవిణం మండనమ్ - గృహస్థులకు ఐశ్వర్యం అలంకారం (తకా.పుం.ష.బహు) గృహాశ్రమవత్ శబ్దం.

13 సతాం స్వాస్థ్యం మండనమ్ - సజ్జనులకు ఆరోగ్యం అలంకారం (తకా.పుం.ష.బహు) సత్ శబ్దం.

**భారతీయ దర్శనాని - భారతీయ దర్శనాలు**

పాణినేః,జైమినేశ్చైవవ్యాసస్య కపిలస్య చ ।
కణాదస్య అక్షపాదస్య దర్శనాని షడేవ హి ॥

1) పాణినేః వ్యాకరణ దర్శనమ్ (పాణినే.ఇకా.పు.షఏ)
2) జైమినేః పూర్వ మీమాంసా దర్శనమ్ (జైమినేః - ఇ.పు.షఏ)
3) వ్యాసస్య వేదాన్త దర్శనమ్ - (వ్యాసస్య - అకా.పు.షఏ)
4) కపిలస్య సాంఖ్యదర్శనం (కపిలస్య - అ.పు.షఏ)
5) కణాదస్య వైశేషిక దర్శనం (కణాదస్య - అ.పు.షఏ)
6) అక్షపాదస్య (గౌతమస్య) న్యాదర్శనం (అక్షపాదస్య - అ.పు.షఏ)

ఏతాని షట్ ప్రాచన భారతీయ విజ్ఞాన శాస్త్రాణి.
ఈ ఆరు ప్రాచీన భారతీయ విజ్ఞానశాస్త్రాలు.

# సప్తమీ విభక్తి - అధికరణ కారకం

ఆధారం - లేదా అధికరణం అనే అర్థాన్ని బోధించడానికి సప్తమీ విభక్తి వాడబడుతుంది. లోకంలో ఒక వస్తువుపై మరొకవస్తువు ఆధారపడి ఉండడం మనం ప్రత్యక్షంగా చూస్తూ ఉంటాం.

వృక్షే ఫలమ్ అస్తి - వృక్షముపై (మీద) ఫలం ఉంది. అనే వాక్యం వినగానే, ఫలానికి వృక్షం ఆధారమని, వృక్షాన్ని ఆశ్రయించి ఫలం ఉంటుందని తెలుస్తుంది. ఇక్కడ వృక్షాన్ని ఆధారమని, దాన్ని ఆశ్రయించి ఉన్న ఫలాన్ని ఆధేయం అని అంటారు. ఆధారానికే వ్యాకరణ శాస్త్రంలో 'అధికరణం' అని కూడా పేరు. ఒక వస్తువుకు మరొకవస్తువు ఆధారమైనప్పుడు ఆ ఆధారమైన వస్తువును బోధించే శబ్దానికి సప్తమీవిభక్తి వాడాలి. సంస్కృతంలో ఙి- ఓస్ - సుప్ అనే మూడు విభక్తి ప్రత్యయాలు చేరిస్తే వరుసగా ఏకవచనం, ద్విచనం, బహువచనం అనేవి మూడు ఏర్పడుతాయి. 'రామ' అనే ప్రాతిపదికానికి ఈ మూడు ప్రత్యయాలు చేర్చితే రామ+ఙి(ఇ) = రామే, రామ+ఓస్=రామయోః రామ+సుప్(సు)=రామేషు అనే రూపాలు ఏర్పడతాయి. ఒక్కొక్క 'అంతం' (చివరిభాగం) పురస్కరించుకొని ఏకవచనరూపాలు కొన్నిటికి చివర ఏకారం, కొన్నింటికి ఔకారం ఉంటుంది. అకారాన్త శబ్దాలకు ఏకవచనం - సప్తమీ విభక్తిలో రామే, కృష్ణే, గోవిందే, వృక్షే, ఫలే, ఇలా ఉంటాయి. ఇకారాన్త శబ్దాలకు హరౌ, గిరౌ, మతౌ, ఇత్యాదిగా రూపాలుంటాయి. ఉకారాంతాలకు - గురౌ, విష్ణౌ, శంభౌ ఇత్యాదిగా రూపాలుంటాయి. హలన్త శబ్దాలకు సప్తమీ ఏకవచనంలో పదం చివర 'ఇకారం' ఉంటుంది. శరది, వీరుధి, సరసి, జగతి, హృది, జలముచి, వాచి, మరుతి, శరది, వపుషి మనసి ఇలా ఇంచుమించుగా మూడు లింగాలలో ఎక్కడో కొన్నిచోట్ల తప్ప రూపాలలో తేడా అంతగా ఉండదు. ఇక ద్వివచవచన రూపాల్లో, షష్ఠీవిభక్తిలో ఉన్నట్లే, ఓస్ (ఓః) లేదా (యోః) అని ఉంటుంది, బహువచనంలో చివర 'షు' లేదా 'సు' వినిపిస్తుంది, రామేషు, గిరిషు, గురుషు, పితృషు, జలముక్షు, మరుత్సు, మనస్సు వపుష్షు, శరత్సు, వాక్షు, దిక్షు, దిశాసు, లతాసు రమాసు, గౌరీషు ఇలా ఏ లింగంలోనైనా 'షు', లేదా 'సు' కనిపిస్తే అది సప్తమీ బహువచనమని సులభంగా గుర్తించవచ్చు.

ఏదైనా ఒక వస్తువు మరొక వస్తువుకు మూడు కాలాలలోను ఆధారం లేదా అధికరణం అని చెప్పదలచుకున్నప్పుడు సప్తమే వాడాలి.

1 వృక్షే ఫలమ్ అస్తి - వృక్షమందు ఫలం ఉన్నది. (వర్తమానకాలం)
2 వృక్షే ఫలమ్ అభూత్ - వృక్షమందు ఫలం ఉండెను (భూతకాలం)
3 వృక్షే ఫలమ్ భవిష్యతి - వృక్షమందు ఫలం ఉండగలదు (భవిష్యత్‌కాలం)

ఇక్కడ ఒక విషయం గమనించాలి. ఒక వస్తువు తాను వేరొకదానికి ఆధారం అయినప్పుడు దాన్ని సప్తమీ విభక్తితో చెప్పవచ్చు, అదే వేరొకచోటున ఉంటే అది ఆ ధేయం అవుతుంది. అప్పుడు దానికి సప్తమి రాదు. ఎలాగంటే-

1 వృక్షే ఫలమస్తి - వృక్షమందు ఫలం ఉంది. ఇక్కడ ఫలం ఆధేయం వృక్షం ఆధారం. ఇక్కడ ఆధారమైన వృక్షానికి సప్తమీవిభక్తి వచ్చింది.
2 వృక్షః భూమౌ అస్తి - వృక్షం భూమిపై ఉన్నది. ఇక్కడ వృక్షం ఆధేయం. భూమి ఆధారం. ఇక్కడ వృక్షశబ్దానికి సప్తమీ విభక్తిరాలేదు. ఆధారమైన భూమికి వచ్చింది. ఇలా ఆధార - ఆధేయభావం మారవచ్చు.
3 ఫలేరసః అస్తి - మొదటి వాక్యంలో ఆధేయం అయిన ఫలం, 'ఫలమందు రసం ఉన్నది' అన్నప్పుడు రసానికి ఆధారం అయింది. రసం ఆధేయం అయింది. 'ఆధేయం' అంటే ఆశ్రయించి ఉండేదని వెనుక చెప్పడం జరిగింది.
4 రసే స్వాదుతా అస్తి - రసమందు రుచి ఉంది. ఇలా ఆధారమైనదే దైనా 'అధికరణం' అనే పేరును, సప్తమీ విభక్తిని పొందుతుంది.

ఇక్కడ ఆధారాధేయ భావం ప్రత్యక్షంగా తెలుస్తున్నది.

వృక్షేఫలమ్ అస్తి; వృక్షః భూమౌ అస్తి; ఫలేరసః అస్తి; ఫలే స్వాదుతా అస్తి అనే వాక్యాల్లో చివరి వాక్యంలో తప్ప, మిగతా మూడు వాక్యాల్లో వృక్షంమీద ఫలం ఉండడం, వృక్షం భూమిపై ఉండడం, ఫలంలో రసం ఉండటం కంటికి తెలుస్తున్నది. రసంలోని రుచి కంటికి తెలియకపోయినా నాలుకకు తెలుస్తున్నది. ఇలాగే-

5 పుష్పే గంధః అస్తి - పుష్పంలో గంధం ఉన్నది. ఇక్కడ గంధానికి పుష్పం ఆధారం. ఇక్కడ ఆధారాధేయ భావం నాసికచే తెలుస్తున్నది.
6 జలే శైత్యమ్ అస్తి - నీటిలో చల్లదనం ఉన్నది. ఇక్కడ జలం శైత్యానికి ఆధారం. ఇక్కడ ఆధారాధేయభావం చర్మానికి తెలుస్తున్నది.
7 వీణాయాం నాదః అస్తి - వీణలో నాదం ఉన్నది. ఇక్కడ వీణ నాదానికి ఆధారం. నాదం ఆధేయం. ఈరెండూ ఒక ఆధారం రెండవది ఆధేయం అనేది

(ఆధారాధేయభావం) చెవికి తెలుస్తున్నది. ఈ ఉదాహరణాలన్నింటిలోను ఆధారం సప్తమీ విభక్తిచేత నిర్దేశింపబడింది. పైన ఇచ్చిన ఉదాహరణాల్లో రెండు రకాల ఆధారాలున్నాయి.

(1) సంయోగ సంబంధంచేత ఆధారం (2) అంతటా విడదీయరాని విధంగా వ్యాప్తి పొందడం ద్వారా ఆధారం.(అభివ్యాపకాధారం)

వృక్షేఫలమస్తి - వృక్షమందు ఫలం ఉంది. అన్నచోట ఫలానికి వృక్షం ఆధారమే అయినా, ఫలం వృక్షానికి ఒకచోట వ్రేలాడుతూ దానినుండి విడదీయడానికి వీలుగా ఉంటుంది. ఇలా విడివిడిగా ఉండగల రెండు, కలిసి ఒకచోట ఉంటే ఆరెంటికీ సంయోగం సంబంధంగా ఉంటుంది. ఇలాంటిదే ఇంతకంటే స్పష్టంగా సంయోగం అంటే ఏమిటో ఈ ఉదాహరణంలో చూడండి.

హస్తే ఆమలకమ్ అస్తి - చేతిలో ఉసిరి పండు ఉంది. ఇక్కడ హస్తం ఫలానికి సంయోగ సంబంధం ద్వారా ఆధారం. చేతిని ఫలాన్ని వేరుచేయవచ్చు.

వృక్షః భూమౌ అస్తి - వృక్షం భూమిపై ఉంది అన్నప్పుడు కూడా వృక్షానికి భూమి సంయోగ సంబంధంచేత ఆధారం. భూమినుండి వృక్షాన్ని వేరుచేయవచ్చు కదా!

ఫలేరసః అస్తి ఫలంలో రసం ఉన్నది, అన్నప్పుడు ఫలంలో ఏ భాగంలో రసం ఉంటుంది? అంతటా అణువణువునా వ్యాపించి విడదీయరాని విధంగా రసం ఉంది. అందువల్ల ఇక్కడ ఫలం - రసానికి 'అభివ్యాపకాధారం' అని అంటారు. అన్ని అవయవాలలోనూ పూర్తిగా వ్యాపించి ఉండడాన్ని బట్టి ఆధారం అయిందన్న మాట. ఇలాగే - పుష్పే గంధః అస్తి - పూవులో వాసన ఉంది. అన్నప్పుడు - పూవులోని అన్ని భాగాలూ పూర్తిగా వ్యాపించి, వాసన ఉంటుంది. ఈ వాసన పూవునుండి వేరుచేయడానికి వీలుకాదు. కనుక ఇక్కడ కూడా పూవు, వాసనకు అభివ్యాపకాధారం. రసే స్వాదుతాఅస్తి రసంలో రుచి ఉంది., అన్నప్పుడూ అంతే. ఈ రెండురకాలుగా చెప్పుకున్న (1) సంయోగసంబంధంతో కూడిన ఆధారం (దీన్నే 'ఔపశ్లేషికాధారం' అంటారు. ఉపశ్లేష మంటే సంయోగం) (2) అభివ్యాపకాధారం, కాక మరొక విధమైన ఆధారం ఉంది. దాన్ని 'వైషయికాధికరణం' అంటారు. ఉదాహరణానికి 'హరి యందు భక్తి ఉంది. 'హరౌ భక్తిః అస్తి' అని అన్నప్పుడు, హరియందు భక్తి ఎలా ఉన్నది? వృక్షమందు ఫలం ఉన్నట్లు సంయోగ సంబంధం చేతఉన్నదా? హరి, భక్తి

ఈ రెండిటిలో 'భక్తి' అనేది మనస్సుకు సంబంధించిన ఒక సంస్కారం. దీన్నే చిత్తవృత్తి ధర్మం అంటారు. ఈ భక్తి అనే చిత్తవృత్తి భక్తుని మనస్సుతో యోగం కలిగి ఉంది తప్ప, హరితో దానికి యోగం లేదు. కనుక హరికి, భక్తికి సంయోగ సంబంధం లేదు. అలాగేహరిని పూర్తిగా వ్యాపించి ఫలంలో రసం ఉన్నట్లు భక్తి ఉన్నదనటం కూడా కుదరదు. కనుక, హరిని విషయంగా చేసికొని భక్తి ఉన్నదని చెప్పాలి. కనుక 'హరౌ భక్తిః అస్తి' హరియందు భక్తి ఉన్నది అంటే భక్తిలో విషయమైనవాడు హరి కనుక, హరిని విషయంగా చేసికొని భక్తి ఉన్నదని అభిప్రాయం. ఇక్కడ 'హరౌ' హరియందు అనేచోట సప్తమీ విభక్తి వైషయికాధారం అనే అర్థాన్ని బోధిస్తున్నది. ఇలాగే - ముక్తౌ ఇచ్ఛాఅస్తి - ముక్తియందు కోరిక ఉన్నది. ముక్తిని విషయంగా చేసికొని (ముక్తి విషయంలో) కోరిక ఉన్నదని అర్థం.

1 గౌరౌ గౌరవమ్ అస్తి - గురువునందు గౌరవం ఉన్నది.

2 పిత్రోః భక్తిః ఆవశ్యకీ - తల్లిదండ్రులయందు భక్తి అవసరం.

3 ఆహారే నియమః ఆవశ్యకః ఆహారం విషయంలో నియమం ఆవశ్యకం.

మనకు బాగా తెలిసిన శ్రీవేంకటేశ ప్రపత్తిలోని ఈ క్రింది శ్లోకంలో సప్తమీ విభక్తిలో ఉన్నపదాలు గమనించండి.

శ్లో॥ మన్మూర్ధ్ని, కాలియఫణే, వికటాటవీషు,
శ్రీ వేంకటాద్రి శిఖరే, శిరసి శ్రుతీనామ్ ।
చిత్తే ప్యనన్య మనసాం సుసమాహితౌ తే,
శ్రీ వేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

1 మన్మూర్ధ్ని = నా శిరమునందు (మన్మూర్ధన్ శబ్దం. నకా, నపుం. సప్తమీ. ఏకవ.)

2 కాలియఫణే = కాళియుని పడగమీద (కాళియఫణశబ్దం. అకా. నపుం. సప్తమీ - ఏక)

3 వికటాట వీషు = ఘోరారణ్యాల యందు, (వికటాటవీ శబ్దం. ఈకా. స్త్రీ సప్తమీ బహు)

4 శ్రీవేంకటాద్రి శిఖరే= శ్రీవేంకటగిరి శిఖరమందు (శ్రీవేంకటాద్రి శిఖరశబ్దం. అకా. నపుం. సప్త. ఏక)

5 శ్రుతీనాం, శిరసి = శ్రుతిశిరస్సైన ఉపనిషత్తులో (శిరస్ శబ్దం. సకా. నపుం. సప్త. ఏక)

6 అనన్య మనసాం- చిత్తే=వేరు దేవతలయందు మనస్సునుంచని 'అనన్య భక్తుల'మనస్సులో. ఇక్కడ పైన రెండేసి పదాలు కలిసి అన్వయించాయి. చిత్త శబ్దం అకా. నపుం. సప్త. ఏక.) ఇంతవరకు సప్తమీ విభక్త్యన్త పదాలు. మిగిలిన భాగం వాక్యార్థ పూర్తి కొరకు వాడబడిన వేరు విభక్తి కలపదాలు, వాటి అర్థం. ఇది - సుసమాహితౌ = బాగుగా ఉంచబడిన; తేచరణౌ= నీ రెండు పాదాలను; శ్రీవేంకటేశ = లక్ష్మీ సంపన్నుడవైన వేంకటేశా!; శరణం, ప్రపద్యే=శరణముగా పొందెదను. శ్రీవేంకటేశ్వరుని పాదాలు నాశిరసుపై, కాళియుని పడగపై, ఘోరారణ్యాల్లో, శ్రీవేంకటాద్రి శిఖరం మీద, ఉపనిషత్తులో, అనన్య ప్రేమగల భక్తుల హృదయంలో సమానంగా (స్వామియొక్క పాదాలు రెండూ) ఉన్నాయి. వాటిని శరణుపొందుతాను అని తాత్పర్యం. ఇక్కడ శిరస్సు మొదలైనవి ఆధారాలు. స్వామిపాదాలు ఆధేయాలు. ఆధారాలకు సప్తమీ విభక్తి వాడబడింది.

2 ఈ క్రింది నీతి శ్లోకం కూడా చూడండి. ఈ శ్లోకం కంఠస్థం చెయ్యండి.

శ్లో॥ యశస్కరే - కర్మణి; మిత్ర సంగ్రహే;
ప్రియాసు నారీషు; అధనేషు బంధుషు ।
క్రతౌ, వివాహే, వ్యసనే, రిపుక్షయే,
ధనవ్యయస్త్వేషు నగణ్యతే బుధైః ॥

ఈ శ్లోకంలో డబ్బు ఖర్చుకు తెలివిగల వారు కొన్ని సందర్భాల్లో వెనకాడరని కవి చెబుతున్నాడు. ఆ సందర్భాలేమిటి? కీర్తి కలిగించే పనిలోను, మిత్రులను చేరదీసే విషయంలోను, తమకు ప్రీతిపాత్రలైన స్త్రీల విషయంలోను, ధనంలేని బంధువుల విషయం ఏదైన పెద్ద క్రతువు (యాగంలాంటిది) జరిపేటప్పుడు, వివాహంలోను విషయంలోను, ఆపదలోను , తమకు శత్రువులైనవారి పీడ వదలించు కోవలసిన వచ్చినప్పుడు దాని విషయంలోను, ఈ పై విషయాలన్నింటిలోను తెలివిగలవారు (వివేకవంతులు) ధనవ్యయాన్ని పరిగణించరు.

1 యశస్కరే - (యశస్సును కల్గించే ) యశస్కర శబ్దం అకా. నపుం. సప్తమీ) ఏక.

2 కర్మణి (పనివిషయంలో) కర్మశబ్దం. అకా. నపుం. సప్తమీ ఏక.

# తిఙన్త ప్రయోగాలు - దశలకారాలు

వెనుక ఒక పాఠంలో తిఙన్త ప్రయోగాల గురించి సామాన్య రూపంగా పరిచయం చేయడం జరిగింది. భాషలో సుబన్త పదాల తరువాత వాటిలాగానే ప్రాధాన్యం కలిగి వాక్య ప్రయోగంలో ఒక భాగం అయిన తిఙన్త ప్రయోగాలు, వాటికి మూలమైన ధాతువులు, మొదలైన విషయాలు తప్పక తెలుసుకోవలసి ఉంది. సుబన్త పదాలలో వస్తువులను బోధించే వృక్షః, నదీ, పర్వతః మొదలైన పదాలు (వీటినే ద్రవ్యావాచకాలు లేదా జాతివాచకాలు అని అంటారు) శుక్లః, నీలః మొదలైన గుణవాచకాలు, వ్యక్తుల పేర్లను బోధించే కృష్ణః, రామః మొదలైన సంజ్ఞావాచకాలతో పాటు, క్రియలను బోధించే పాకః, గానం, గమనమ్, మొదలైన పదాలు కూడా ఉన్నాయి. అయితే 'క్రియ' ప్రధానంగా స్ఫురించే పదాలు మాత్రం తిఙన్త పదాలే. 'తిఙ్' అనే సంజ్ఞ (పేరు) చేత చెప్పబడే 18 ప్రత్యయాలున్నాయని, ఆప్రత్యయాలు చివరగల పదాలకు తిఙన్త పదాలంటారని వెనుక చెప్పడం జరిగింది కదా!

ఈ తిఙన్త పదాలను 10 గణాలుగాను, ఒక్కొక్క గణంలో ప్రతిధాతువుకు 10లకారాలుగాను పరిగణనం చేసి పాణిని మొదలైన ఆచార్యులు నిరూపించారు.

ఆగణాలు - వాటిలోని ధాతువుల సంగ్రహవివరణం - ఇది.

1 భ్వాది గణం :- భూ=సత్తాయామ్ (ఉనికి) అనే ధాతువుతో ప్రారంభించి 1010 ధాతువులు ఈ గణంలో ఉన్నాయి. ఈ ధాతువులకు ప్రక్కన 'శప్' (అ) అనే ప్రత్యయం వచ్చి చేరుతుంది. కనుక వీటిని 'శబ్వి కరణులు' (శప్ ప్రత్యయం చేర్పుగా ఏర్పడిన వికారం లేదా రూపంలో మార్పు కలవి ఈ ధాతువులు) అని అంటారు. వీటిలో కొన్ని 1. పరస్మై పదిధాతువులు 2. కొన్ని ఆత్మనే పది ధాతువులు 3. మరికొన్ని ఉభయ పదిధాతువులు అని పరిగణింపబడ్డాయి. పరస్మైపదులు. ఆత్మనే పదులు ఉభయపదులు అనే వాటి అర్థం ముందు ముందు స్పష్టపరపబడుతుంది. ఉదా- భూ+(శప్) అ+తి= భవతి; పతతి గచ్ఛతి. అర్చతి, హరతి, పిబతి, ఏధతే మొదలైనవి.

2 అదాది గణం - అద= భక్షిణే (భక్షించుట అనే అర్థం కల ) ధాతువుతో ప్రారంభించి 72 ధాతువులుపై లాగానే ఇక్కడ పరిగణింపబడ్డాయి. ఈ గణంలో పఠింపబడిన ధాతువులకు ప్రక్కన చేర్చబడిన 'శప్' అనే వికరణ (వికారాన్ని - మార్పును కలిగించే, ప్రత్యయం లోపిస్తుంది. కనుక ఈ గణాన్ని

'లుబ్వికరణులు' అని అంటారు. అద్+(శప్) + తి = అద్+తి= అత్తి. ఇక్కడ శప్ లోపించింది. ఇలాగే హన్తి, అస్తి, దాతి, పాతి మొదలైనవి.

3 జుహోత్యాదిగణం :- ఈ గణంలో హు= దానాదనయోః ఇచ్చుట, తినుట లేదా తృప్తి కలిగించుట అనే అర్థం కల ధాతువుతో ప్రారంభించి 24 ధాతువులున్నాయి. ఈ గణంలో ధాతువుల కంటే విధింపబడిన శప్ ప్రత్యయానికి "శ్లు" అనే పేరుతో లోపం చేయబడి ధాతువులకు కొన్ని మార్పులు ఏర్పడతాయి కనుక, ఈ ధాతువులకు "శ్లువికరణులు' అని వ్యవహారం. హు+(శప్)+తి= జుహోతి, దదాతి. ఇక్కడ శ్లు అనే పేరుతో ప్రత్యయం లోపించడం వల్ల ధాతువుకు ద్విరుక్తి మొదలైన మార్పులు జరిగాయి.

4 దివాది గణం :- దివు = క్రీడాదిషు (క్రీడించుట మొదలైన అర్థాలలో ఉన్న) ధాతువుతో ప్రారంభించి 141 ధాతువులున్నాయి. ఈ ధాతువుల కంటే 'శ్యన్' అనే వికరణ ప్రత్యయం ధాతువుకు తిఙ్ప్రత్యయానికి మధ్య చేరి, మార్పును తీసుకువస్తుంది. దివ్+(శ్యన్) య+తి = దీవ్యతి, శుష్యతి, విద్యతే ఇత్యాదులు.

5 స్వాదిగణం :- షుఞ్= అభిషవే (పిండుట) అనే అర్థంకల ధాతువుతో ప్రారంభించి 28 ధాతువులు చెప్పబడ్డాయి. ఈ స్వాదిగణంలో పఠింపబడిన ధాతువుల కంటే "శ్ను"(ను) అనే ప్రత్యయం చేర్చబడుతుంది. అందువల్ల వీటిని "శ్ను" వికరణులు అంటారు. ఉదా + సు+ను+తి =సునోతి, చినోతి, కృణోతి ఇత్యాదులు.

6 తుదాదిగణం :- తుద=వ్యథనే (బాధపెట్టు) అనే ధాతువుతో ప్రారంభించి ఈ తుదాది గణంలో 448 ధాతువులున్నాయి. ఈ గణంలోని ధాతువులకంటే "శ" అనే ప్రత్యయం చేర్చబడుతుంది. కనుక వీటిని "శ-వికరణులు" అని అంటారు.
ఉదా: తుద్ +శ(అ) + తి = తుదతి నుదతి, దిశతి, క్షిపతి ఇత్యాదులు.

7 రుధాదిగణం :- రుధిర్=ఆవరణే (కప్పుట) అనే ధాతువుతో ప్రారంభించి 25 ధాతువులు ఈ గణంలో పఠింపబడ్డాయి. ఈ గణంలోని ధాతువుల కంటే "శ్నమ్" అనే ప్రత్యయం చేర్చబడుతుంది. అందువల్ల ఈ గణంలోని ధాతువులను "శ్నమ్ వికరణలు అని అన్నారు. రుధ్+శ్నమ్(న) తి=రుణద్ధి మొ॥

8 తనాదిగణం :- తను=విస్తారే (విస్తరించుట) అనే ధాతువుతో ఈ గణంలో 10 ధాతువులు పఠింపబడ్డాయి. ఈ గణంలోని ధాతువుల కంటే "ఉ" అనే

ప్రత్యయం చేర్చబడుతుంది. ఉదా - తన్ + ఉ+తి=తనోతి క్షిణోతి, తృణోతి మొదలైనవి. వీటిని "ఉవికరణులు అని అంటారు.

9 క్ర్యాదిగణం :- క్రీఞ్=ద్రవ్యవినిమయే, ద్రవ్యమును వినిమయము చేయుట లేదా క్రయణము అనే అర్థంకల ధాతువుతో ప్రారంభించి 59 ధాతువులు ఈ గణంలో పఠింపబడ్డాయి. వీటిని "శ్నా" వికరణులు అని అంటారు. ఉదా: క్రీ+(శ్నా) నా+తి=క్రీణాతి, జానాతి, పునాతి, మధ్నాతి మొదలైనవి. ఇక్కడ ధాతువుల కంటే "శ్నా" అనేవి వికరణ ప్రత్యయం విధింపబడింది.

10 చురాదిగణం : చుర=స్తేయే (దొంగిలించుట) అనే ధాతువుతో ప్రారంభించి 415 ధాతువులు ఈ చురాది గణంలో పఠింపబడ్డాయి. ఈ గణంలో పఠింపబడిన ధాతువుల కంటే "ణిచ్" అనే ప్రత్యయం చేర్చబడుతుంది. ఇలా చేర్చగా ఏర్పడిన శబ్ద స్వరూపం మళ్లీధాతువుగా పరిగణింపబడి - ఆ పైన భ్వాదిగణంలోని ధాతువుల్లాగానే రూపాలు ఏర్పడతాయి. చుర్+ణిచ్(ఇ)=చోరి - ఇక్కడ 'చుర్' అనే ధాతువుకు 'ణిచ్' ప్రత్యయం చేస్తే 'చోరి' అని ఏర్పడితే, ఈ 'చోరి' అనేది కూడా ధాతువుగా పరిగణింపబడుతుంది. ఈ చురాది గణంలోని ప్రతిధాతువు కంటే ఇలా "ణిచ్" ప్రత్యయం చేర్చగా ఏర్పడిన రూపాలన్నీ మళ్లీ ధాతువులౌతాయి. ఇలా ఏర్పడ్డ ధాతువులను 'ణిజన్త' ధాతువులు అని అంటారు. మూలధాతువుకు - ఈణిజన్త ధాతువుకు అర్థంలో తేడా ఏమీ లేదు. చోరి+శప్ (అ) తి = చోరయతి. (దొంగిలించుచున్నాడు.)

ఇలా ఈ పదిగణాలుగా ధాతువులు విభజింపబడ్డాయి. ఇలా విభజింపబడటానికి గల కారణం ధాతువుల ప్రక్కన చేర్చబడిన "వికరణ ప్రత్యయాల వల్ల" ధాతురూపాల్లో కొద్దిపాటి మార్పు రావడమే.

ఇక్కడ పేర్కొనబడిన 10 గణాలను కలిపి "దశగణి" అంటారు. ఈ "దశగణి" లో సంస్కృతభాషలో వాడబడే ధాతువులన్నీ పాణినిచే నిర్దేశింపబడ్డాయి. ఈ పైని టేబుల్‌లో (2)వ గడిలో ఒక్కొక్క గణానికి మొట్టమొదట ఉండే ధాతువు, దాని అర్థం నిర్దేశింపబడ్డాయి. (3) వ గడిలో ధాతువుకు ప్రక్కన చేర్చబడే వికరణ ప్రత్యయాలు నిర్దేశింపబడ్డాయి. ఈ ప్రత్యయాలు ఒక్కొక్కగణానికి ఒక్కొక్క ప్రత్యయం ఉంటుంది. కొన్నిచోట్ల ప్రత్యయం లోపించడం, లేదా దాని స్థానంలో మరొకటి వచ్చి చేరడం జరుగుతుంది. ఈ వికరణ ప్రత్యయాల తేడాను బట్టే 'దశగణి' అని ధాతువులను

10 గణాలు విభజించడం జరిగింది. "గణం అంటే కొన్ని ధాతువుల సమూహం అన్నమాట. ఇలా 10 గణాలుగా ధాతువులు విభజింపబడి వాటికి, వేరువేరు వికరణ ప్రత్యయాలు ప్రక్కన చేర్చబడినప్పటికీ, అన్నింటికీ 'చివర, తిఙు పిలువబడే 18 ప్రత్యయాలలో 9 ప్రత్యయాలు కొన్ని ధాతువులకు, 9 ప్రత్యయాలు మరికొన్ని ధాతువులకు చేర్చవలసి ఉంటుంది. ఈ విషయం వెనుక తిఙన్త పదాలు అనే శీర్షిక క్రింద వివరించడం జరిగింది. మళ్లీ ఒకసారి ఆశీర్షికకు చెందిన అంశాలు చదవండి. అయితే అక్కడ చెప్పబడని 1/2 అంశాలు ఇక్కడ చెప్పడం జరుగుతున్నది. పైని ఇచ్చిన టేబుల్ ప్రకారంగా ధాతువు + వికరణ ప్రత్యయం + తిఙ్ ప్రత్యయం కలిస్తే - ఒక పరినిష్ఠితరూపం ప్రయోగించడానికి వీలుగా తయారౌతుందని గ్రహించవలసి ఉంది. ధాతువులు పరస్మైపదాలు, ఆత్మనే పదాలు, ఉభయపదాలు అని మూడురకాలుగా విభజింపబడ్డాయి. తిఙులని వెనుక.చెప్పబడిన 18 ప్రత్యయాల్లో మొదటి 9 ప్రత్యయాలు పరస్మై పద ప్రత్యయాలు. వీటిని చేర్చడానికి తగిన యోగ్యత కల ధాతువులను పరస్మైపదులు అన్నారు. రెండవ 9 ప్రత్యయాలు ఆత్మనే పదులు. ఇవి చేర్చబడే ధాతులు ఆత్మనే పదులు. మరికొన్ని ధాతువులు ఈ రెండురకాల ప్రత్యయాలు 9+9=18 చేర్చదగి ఉన్నాయి. అటువంటి ధాతువులను ఉభయపదులు అని అంటారు.

**ధాతువుల గురించి కొన్నివిశేషాంశాలు:**

1) సంస్కృతభాషకు 'ధాతువు' అనే మౌళికశబ్దాలు (Roots) చాలాముఖ్యం - ఇవి 2650 అని పరిగణించారు.

2) ఈ దాతువుల్లోంచే అన్ని శబ్దాలు పుట్టాయని "శాకటాయన" మతం. కాదని మరికొందరిమతం.

3) ఈ దాతువులు క్రియను బోధిస్తాయి. (క్రియ = Action)

4) వీటికి 'తిఙ్' అనే 18 ప్రత్యయాలు చేరిస్తే 'తిఙన్త' పదాలు తయారౌతాయి. ఇక్కడ క్రియ ప్రధానంగా తెలుస్తుంది.

5) ధాతువులనుండి తయారైన సుబన్త క్రియా పదాలుకూడా చాలా **ఉన్నాయి.** గమనం,పఠనం, పాకః, పాఠః ఇత్యాదులు.

| 1 | ధాతువు - అర్థ | వికరణ ప్రత్యయం | తిఙ్‌ప్రత్యయం | ఏర్పడినరూపం | గణం |
|---|---|---|---|---|---|
| 1 | భూ = సత్తాయామ్ | శప్ (అ) | తిప్ (తి) | భూ+అ+తి=భవతి | భ్వాదిగణం |
| 2 | అద్=భక్షణే | శప్‌లోపించడం జరుగుతుంది | తిప్ (తి) | అద్+తి=అత్తి | అదాదిగణం |
| 3 | హు=దానాదనయోః | శప్ యొక్క స్థానంలో 'శ్లు' అనేది ఆదేశంగా వస్తుంది అది కూడా లోపిస్తుంది | తిప్ (తి) | హు+తి=జుహోతి | జుహోత్యాదిహణం |
| 4 | దివు(దివ్) క్రీడాదిషు | శ్యన్ (య) | తిప్ (తి) | దివ్+య+తి=దీవ్యతి | దివాదిగణం |
| 5 | షుఞ్=అభిషవే | శ్ను (ను) | తిప్ (తి) | సు+ను+తి=సునోతి | స్వాదిగణం |
| 6 | తుద్=వ్యథనే | శ (అ) | తిప్ (తి) | తద్+అ+తి=తుదతి | తుదాదిగణం |
| 7 | రుధ్=ఆవరణే | "శ్నమ్"(న) | తిప్ (తి) | 'రుధ్' ఇక్కడ 'ధ'కు ముందు 'న' చేరుతుంది రు 'న'ధ్+తి=రుణద్ధి | రుధాదిగణం |
| 8 | తన్=విస్తారే | "ఉ"(ఉ) | తిప్ (తి) | తన్ ꠰ ఉ ꠰ తి=తనోతి | తనాదిగణం |
| 9 | క్రీఞ్=క్రయణే | "శ్నా" (నా) | తిప్ (తి) | క్రీ+నా+తి=క్రీణాతి | క్ర్యాదిగణం |
| 10 | చుర్=స్తేయే | ణిచ్+శప్(అ) | తిప్ (తి) | చుర్+ణిచ్(ఇ)=చోరి+ అ+తి=చోరయతి | చురాదిగణం |
|  |  |  | తిఙ్ అని పిలువబడే 18 ప్రత్యయాలు ధాతువులకు చేర్చాలి. |  |  |

# దశల కారాలు

పైని పేర్కొన్న (1) పరస్మైపది ధాతువులు (2) ఆత్మనే పదిధాతువులు (3) ఉభయపది ధాతువులు మూడింట్లోను ప్రతిధాతువు కాలం, అర్థం అనే వాటి భేదాన్ని బట్టి పదిరకాల ప్రయోగాలు కలిగి ఉంటుంది. వీటిని "లకారాలని" శాస్త్రకారులు సంగ్రహంగా పేరు పెట్టారు. ఏ ధాతువునైనా భూతం వర్తమానం - భవిష్యత్తు అనే మూడుకాలాల్లో ప్రయోగాలుంటాయి. ఇవికాక ఇంకా విధి, ఆశీస్సు మొదలైన విశేషార్థాలు కూడా ఉంటాయి. ఈ అర్థాలను సులువుగా గుర్తించడానికి 'ల్' అనే అక్షరానికి అట్,ఇట్,ఉట్,ఋట్ఏట్,ఓట్,అఙ్,ఇఙ్,ఉఙ్ఋఙ్ అనేవి చేర్చి 10 సంజ్ఞలు ఏర్పరచారు.ఒక్కొక్క అర్థానికి ఒక్కొక్క సంజ్ఞ (పేరు), ను గుర్తుగా (ప్రతీకగా) నిర్దేశించారు. ఇలా 10ల కారాలు ఏర్పడ్డాయన్నమాట. 'ల్' అనే వర్ణమేలకారం. అన్ని అర్థాలకు 'ల్' అనేది ప్రతీకంగా నిర్దేశిస్తే తేడా తెలియదు కనుక, దానికి అర్థంలో తేడానుబట్టి "అట్" మొదలైన 10 చేర్చబడ్డాయి. ఆ విధంగా (1)లట్(2)లిట్(3) లుట్(4)లృట్(5)లేట్ (6) లోట్ (7) లఙ్ (8) లిఙ్ (9)లుఙ్ (10) లృఙ్ అనే సంజ్ఞలు (గుర్తులు) తయారు చేశారు. వీటిలో 5 వలకారం అయిన "లేట్" అనేది వేదంలోనే ఉంటుంది. లోకవ్యవహారంలో ఉండదు. దాన్ని తీసివేస్తే 9 లకారాలు మిగిలాయి. వీటిలో 8 వలకారం అయిన "లిఙ్" అనేదాన్ని రెండురకాల అర్థాల్లోని తేడాను బట్టి రెండుగా విడగొట్టగా, మళ్లీ 10లకారాలు అయినాయి. వీటిని లోకంలో వ్యవహరిస్తున్నాము. వీటి అర్థాలు చూడండి.



1) లట్ - వర్తమాన కాలం (క్రియ జరుగుతున్న కాలం)
2) లిట్ - పరోక్షభూతకాలం (మనకంటే ముందు జరగక ఎప్పుడో జరిగి పోయిన క్రియను చెప్పేటప్పుడు పరోక్షభూతకాలం అంటారు.
3) లుట్ - జరుగుతున్న 24 గంటలకు పూర్వం జరిగిన క్రియను చెప్పేటప్పుడు ఈలకారాన్ని వాడాలి. ఈ కాలాన్నే అనద్యతన భూతకాలం అంటారు.



(4) లట్ - సాధారణ భవిష్యత్తు అనే అర్థంలో ఈలట్ లకారం వస్తుంది. ముందు ముందు జరుగబోయే క్రియను ఇది బోధిస్తోందన్నమాట.
5) లోట్ - ఈ లోట్ అనేలకారం విధి - ఆశీస్సు అనే రెండర్థాల్లో ప్రయోగింపబడుతూ ఉంటుంది. సాధారణంగా ఇది ఇట్లు జరుగును గాక అని దీవించేటప్పుడు ఈ లోట్లకారాన్ని వాడతాం.

(6) లఙ్ - ప్రస్తుతం 24 గంటలకు చెందని భూతకాలంలో ఈ లఙ్ అనే లకారాన్ని వాడాలి. దీన్ని అనద్యతన భూతకాలం అంటారు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. ప్రస్తుతం నడుస్తున్న 24 గంటల కాలం అంటే గడచిన రాత్రి 1 గంటనుండి రాబోయేరాత్రి 12:00గంలవరకు ఈ మధ్యకాలాన్ని "అద్యతనం" అంటారు. ఈ 24 గంటల (అద్యతన) కాలానికి ముందున్న అంటే గడచిన రాత్రి 1 గంటకు ముందున్న కాలం ఎంతైనా అనద్యతన భూతం (అద్యతనం కాని భూతకాలం) అని అంటారు. అలాగే ఈ అద్యతనం కాని భవిష్యత్కాన్ని అంటే రాబోయేరాత్రి 12 గంటలు దాటిన తరువాత నుండి రాబోయే అనంతమైన భవిష్యత్‌కాలాన్ని అనద్యతన భవిష్యత్కాలం అని అంటారు. పైని నిర్దేశించిన 'లఙ్' లకారం అనద్యతన భూతకాలంలో వాడబడుతుంది.

7) విధి లిఙ్ - విధి - నిమంత్రణం, అభీష్టం, సంప్రశ్నం, ప్రార్థనం, అనే అర్థాల్లో ప్రయోగింపబడే లిఙ్ లకారాన్ని విధిలిఙ్ అని పిలుస్తారు.

1. విధి అంటే తన అదుపులో ఉన్నవారిని, ఈ పనిచేయుమని ప్రేరణ చేయడం.
2. నిమంత్రణం అంటే నియోగించడం. అంటే ఆవశ్యకమైన పనిలో మీరు ఉండి ఈ పనిలో అన్వయించడని విధించకుండా ప్రేరించడం.
3. ఆ మంత్రణం అంటే మీ యిష్టవచ్చినట్లు చేయండని వారికే వదిలి వేయడం.
4. అధీష్టమంటే సత్కార పురస్సరంగా, అంటే గౌరవించి ప్రవర్తింప జేయడం. అయితే ఈ నాలుగు అర్థాల్లోనూ వేరొకరిని ప్రవర్తింపజేయడం అనేదే అంతర్గతంగా ఉన్నది కనుక 'ప్రవర్తరింపజేయడం' (ప్రవర్తన) అనే అర్థంలో విధివిఙ్ ప్రయోగింపబడుతుందని గ్రహించవచ్చు.

8) ఆశీర్లిఙ్ - ఆశీస్సును సూచిస్తూ ఈ లిఙ్‌లకారం వస్తుంది. ఇంచుమించుగా లోట్‌లకారం లాగానే ఇదీ ప్రయోగింపబడుతూ ఉంటుంది.

9) లుఙ్ - ఇది అన్నిరకాల భూతకాలాలను బోధిస్తుంది. అంటే జరిగిపోయిన అంశాన్నిదేనైన్నా ఈలకారం ద్వారా చెప్పవచ్చును. ఇది చాలా ప్రధానం.

10) ల్ఋఙ్ - ఇది ఒక విలక్షణమైన అర్థాన్ని బోధిస్తుంది. 'ఇది ఇలా అయి ఉంటే అది అయి ఉండేది. అలా అయి ఉండకపోతే ఇలా అయేది కాదు.' అనే అర్థాన్ని బోధిస్తుంది. వీటి ప్రయోగాలను ముందుముందు తెలుసుకుందాం.

ఇలా ప్రతిధాతువుకు, అది పరస్మైపది ధాతువైనా, ఆత్మనే పదిధాతువువైనా ఉభయ పదిధాతువైనా ఈ పదిలకారాల చేరిక వలన ఒక్కొక్క లకారానికి 9 రూపాల చొప్పున 10×9=90 రూపాలు కనీసంగా ఉంటాయి. కొన్ని ధాతువులకు ఎక్కువరూపాలు కూడా ఉండవచ్చు. వెనుక పేర్కొన్నట్లు రెండువేలకు పైగా ఉన్న ధాతువులకు ఈలకారాలలో ఎన్ని రూపాలు ఏర్పడతాయో పరిగణనం చేస్తే రెండు లక్షలకు పైగా సాధారణ క్రియాపదాలే ఉంటాయి. ఇంకా విశేష ప్రయోగాలు సన్నంతాలు, యజన్తాలు, యఙ్లుగన్తాలు, నామధాతువులు అని ఇలా ప్రయోగాలు ఎన్నో ఉన్నాయి. అవన్నీ పరిగణిస్తే చాలా లక్షలరూపాలు ఏర్పడతాయి. అవన్నీ గుర్తించడం కూడా చాలా కష్టమే. కనుక సులభంగా కొన్ని తెలిసికుంటే చాలు. విశేషాసక్తికలవారు వైయాకరణ సిద్ధాన్త కౌముది అనే వ్యాకరణ గ్రంథాల్లో ఆయా ప్రకరణాలు చదవాలి.

ఇక్కడ పేర్కొన బడిన 10 గణాలను కలిపి "దశగణి" అని అంటారు. ఈ "దశగణి"లో సంస్కృత భాషలో వాడబడే ధాతువులన్నీ నిర్దేశింపబడ్డాయి. ఈ పైని టేబుల్‌లో 2వ గడిలో ఒక్కొక్క గణానికి మొట్టమొదట ఉండే ధాతువు, దాని అర్థం నిర్దేశింపబడ్డాయి. 3వ గడిలో ధాతువుకు ప్రక్కన చేర్చబడే వికరణ ప్రత్యయాలు నిర్దేశింపబడ్డాయి. ఈ ప్రత్యయాలు ఒక్కొక్క గణానికి ఒక్కొక్క ప్రత్యయం ఉంటుంది. కొన్నిచోట్ల ప్రత్యయం లోపించడం, లేదా దాని స్థానంలో మరొకటి వచ్చి చేరడం జరుగుతుంది. ఈ వికరణ ప్రత్యయాల తేడాను బట్టే 'దశగణి' అని ధాతువులను 10 గణాలుగా విభజించడం జరిగింది. గణం అంటే కొన్ని ధాతువుల సమూహం అన్న మాట. ఇలా 10 గణాలుగా ధాతువులు విభజింపబడి, వాటికి వేరువేరు వికరణ ప్రత్యయాలు ప్రక్కన చేర్చబడినప్పటికీ, అన్నింటికీ చివర, తిఙ్లని పిలువబడే 18 ప్రత్యయాలలో 9 ప్రత్యయాలు కొన్ని ధాతువులకు, 9 ప్రత్యయాలు మరికొన్ని ధాతువులకు చేర్చవలసి ఉంటుంది. ఈ విషయం వెనుక తిఙన్త పదాలు అనే శీర్షిక క్రింద వివరించడం జరిగింది. మళ్లీ ఒకసారి ఆశీర్షికకు చెందిన అంశాలు చదవండి. అయితే అక్కడ చెప్పబడని 1,2 అంశాలు ఇక్కడ చెప్పడం జరుగుతుంది. పైని ఇచ్చిన టేబుల్ ప్రకారంగా ధాతువు+వికరణ ప్రత్యయం + తిఙ్ ప్రత్యయం కలిస్తే - ఒక పరి నిష్ఠిత రూపం ప్రయోగించడానికి వీలుగా తయారౌతుందని గ్రహించవలసి ఉంది.

# ప్రాచీనకాలే అధ్యాపన సరణిః - వివిధ విద్యాశ్చ ।

# (ప్రాచీనకాలంలో అధ్యాపన విధానం - వివిధ విద్యలు)

భారతీయ ప్రాచీన వాఙ్మయానికి చెందిన వేదాలలో 'ఉపనిషత్తులు' అనేవి ఒక భాగం. ఇవి తాత్త్విక దృక్పథాన్ని మానవకోటికి అందిస్తున్నాయి. ప్రస్తుతం లభిస్తున్న ఉపనిషత్తులు దాదాపు 100కు పైగా ఉన్నప్పటికీ అసలు వాస్తవంగా ఉపనిషత్తులనే ప్రాచీన వాఙ్మయానికి ప్రతీకాలుగా చెప్పదగినవి (1) ఈశోపనిషద్ (2) కేనోపనిషద్ (3) కఠోపనిషద్ (4) ప్రశ్నోపనిషద్ (5) ముండకోపనిషద్ (6) మాండూక్యోపనిషద్ (7) బృహదారణ్యకోపనిషద్ (8) తైత్తిరీయోపనిషద్ (9) ఛాందోగ్యోపనిషద్ (10) ఐతరేయోపనిషద్ (11) శ్వేతాశ్వతరోపనిషద్ (12) కౌషీతక్యుపనిషద్ (13) జాబాలోపనిషద్ అనేవి శంకర రామానుజాదులచే ప్రమాణంగా తీసికొనబడ్డాయి. ఇంకా 1,2 ఆయా సంప్రదాయాలవారు ప్రత్యేకంగా అంగీకరించినవి కూడా ఉన్నాయి. ఈ ఉపనిషత్తుల్లో ఎన్నో అందమైన వాక్యాలు, సుబన్త - తిఙన్త ప్రయోగాలు, చక్కని సన్నివేశాలు, అనేక విజ్ఞాన దాయకాంశాలు ఉన్నాయి. సామవేదానికి వేయిశాఖలున్నా యని ప్రసిద్ధి. వాటిలో తాండిశాఖ యొక్క చివర ఉన్న ఉనిషత్ "ఛాందోగ్యోపనిషత్ ' అని పిలువబడుచున్నది. దానిలోనుండి రెండు మూడు అంశాలు ఇక్కడ మనం తీసికొందాం. సంస్కృత వాక్య నిర్మాణం ఉపనిషత్తుల్లో ఎలా ఉన్నదో తెలిసికోవడంతో పాటు, వాటిలో ఉండే విజ్ఞానం. అప్పటివిద్యా విధానం ఎలా ఉండేదో తెలుస్తుంది.

## వృక్షాణాం చైతాన్యమస్తి

## (వృక్షాలకు చైతన్యం ఉంది)

"అస్య సోమ్య! మహతోవృక్షస్య యో మూలే అభ్యాహన్యాత్, జీవన్ స్రవేత్।
యో, మధ్యే అభ్యాహన్యాత్ - జీవన్ స్రవేత్ ।
యో అగ్రే అభ్యాహన్యాత్ - జీవన్ స్రవేత్ ।
స ఏష జీవేన ఆత్మనా అనుప్రభూతః పేపీయమానః తిష్ఠతి" (ఛాం. అధ్యా. 6- ఖండం 11)

తండ్రి, 'కొడుకుకు' వృక్షాలలో జీవం ఉన్నది, ఆజీవచైతన్యం ఆవృక్షాన్ని విడిచిపోతే అది మరణిస్తుంద ని వివరించడానికి ఇలా అంటున్నాడు. ఓ సోమ్యుడా! (ప్రియదర్శనుడా!) ఈమహావృక్షముయొక్క మూలం మీద ఎవడైనా (గొడ్డలి మొదలైనవాటిచే) గట్టిగా కొడితే అప్పుడు జీవంతో కూడి ఆ చెట్టు స్రవిస్తుంది. ఇలాగే, మధ్యలోకొట్టినా జీవంతో కూడి స్రవిస్తుంది. పై భాగాన కొట్టినా జీవం కలిగి స్రవిస్తుంది. ఈ చెట్టు జీవాత్మతో ఆమూలాగ్రం కూడి నీరు త్రాగుచూ, ఆనందిస్తూ ఉంటుంది." ఈ వాక్యాలను బట్టి చెట్లలో జీవచైతన్యం ఉన్నదని గడచిన శతాబ్దంలో మనవైజ్ఞానికులు కనిపెట్టిన విషయాన్ని ఎప్పుడో చరిత్ర కందని కాలంలో మన ఋషులు దర్శించి చెప్పారని స్పష్టపడుతున్నది. పై వాక్యాల్లో సాధారణంగా మనం లోకంలో వ్యవహరించినట్లే పదవిన్యాసం కనిపిస్తున్నది.

## సోమ్య! అస్య, మహతః వృక్షస్య మూలే, యో, అభ్యాహన్యాత్, జీవన్, స్రవేత్।

సోమ్యుడా! ఈ గొప్ప, వృక్షముయొక్క, మూలంమీద, ఎవడైనా, గట్టిగా కొడితే జీవించి, స్రవిస్తుంది. ఇక్కడ 'సోమ్య' అనేది సంబోధనం, ప్రథమావిభక్తి, అస్య, మహతః వృక్షస్య అనేవి మూడూ సుబన్త పదాలు. షష్ఠీవిభక్తి ఏకవచనాలు. 'మూలే' అనేది సప్తమీ ఏకవచనం. 'యో' అనేది 'యః' :- అని, ప్రథమా ఏకవచనం. 'జీవన్' అనేది ప్రథమైక వచనం, అభ్యాహన్యాత్, స్రవేత్, అనేవి రెండూ, క్రియాపదాలు. ఈ వాక్యం మనం వెనుక పాఠాల్లో చదివిన వాక్యంలాగానే ఉంది కదా!

ఇప్పుడు మరికొన్ని వాక్యాలు చూద్దాం.

(1) తస్య, యద్, ఏకాం, శాఖాం, జీవో, జహాతి, అథ, సా, శుష్యతి.

ఈ చెట్టుయొక్క, ఒకవేళ, ఒక, కొమ్మను, జీవుడు, విడిచిపెడితే, ఇక, ఆ కొమ్మ ఎండిపోతుంది. చెట్టు తాలూకు, ఏదైనా ఒకభాగాన్ని జీవతత్త్వం విడిపెట్టినట్లైతే ఆభాగం నశిస్తుందన్నమాట. అయితే, జీవచైతన్యం ఎప్పుడు ఒక భాగాన్నివిడిచి పెడుతుంది? ఎప్పుడైతే ఏదైనా ఒకభాగానికి దెబ్బతగిలి ఇంక ఆభాగం చైతన్య ప్రసారానికి యోగ్యం కాకపోతే, ఆ భాగాన్ని జీవచైతన్యం విడిచిపెట్టిపోతుందన్న మాట. మన శరీరం అయినా అంతేనని మనం గ్రహించి దానిని రక్షించుకోవాలి.

ఈ విషయాన్నే ఉపనిషత్తు ఇలా చెబుతున్నది.

2. ద్వితీయాం జహాతి, అథ సా శుష్యతి
రెండవకొమ్మను విడిచిపెడితే ఇక అది ఎండిపోతున్నది.

3 తృతీయాం జహాతి, అథ సా శుష్యతి
మూడవకొమ్మను విడిచిపెడితే ఇక అది ఎండిపోతుంది.

4. సర్వం జహాతి, సర్వః శుష్యతి
అంతా విడిచిపెడితే అంతా ఎండిపోతున్నది.

5. ఏవమ్ ఏవ, ఖలు సోమ్య! విద్ధి ఇతి హ ఉవాచ
ఇలాగే ఈ విధంగానే, కదా సోమ్యుడా! తెలుసుకో, అని పలికాడు.

6. జీవోపేతం వావ వేదం మ్రియతే
జీవునితో కూడి ఉన్నదే  ఇది మరణిస్తున్నది.

7. న జీవో మ్రియతే - జీవుడు మరణించడు.

8. స ఏషోణిమా, ఐతదాత్మ్యమ్ ఇదం సర్వం.
ఆ ఈజీవుడు అణువు, ఆజీవతత్త్వం కలదే ఇది అంతా. చూడండి జీవతత్త్వం అంతటా వివిధాకారాలు కల వస్తువుల్లో ఉన్నదని ఉపనిషత్తు చెబుతున్నది.

## పరమాత్మ అంతటా ఉన్నాడు.

పరమాత్మ అంతటా ఉన్నాడని తెలియజేయడానికి తండ్రికొడుకుకు ప్రయోగాత్మకంగా వివరించాడు. ఒక పాత్రలో నీళ్ళు పోసి గుప్పెడు ఉప్పు పాత్రలో వేయమన్నాడు తండ్రి. కొడుకు అలాగే చేశాడు. ఆ నీటిని మూలంలోంచి ప్రక్కల కొద్ది కొద్దిగా రుచి చూడమన్నాడు. రుచి చూచాడు కొడకు. "ఇక్కడ ఎలా ఉంది; ఉప్పగాఉంది". "మరి ఇక్కడో? ఇక్కడ కూడా ఉప్పగానే ఉంది. అంటే నీరంతా ఉప్పదనంతో కూడి ఉంది. అయినా ఆ ఉప్పు విడిగా వేరు చేయబడదు. కాని నాలుకకు తెలుస్తుంది. ఇలాగే పరమాత్మ అంతటా ఉన్నా వేరుగా చూడాలంటే లభింపడు ఉపాసన చేతనే, లభిస్తాడు అని బోధించాడు తండ్రి. వాక్యాలు చూడండి. (ఛాందోగ్య 6-13)

1. లవణమ్ ఏతత్ ఉదకే అవధాయ అథ మా ప్రాతః ఉపసీదథాః ఇతి.

ఉప్పును దీన్ని నీళ్లలో వేసి తరువాత నా దగ్గరకు ప్రొద్దుటే రావలసినది అని (అన్నాడు తండ్రి)

2 స-హ తథా చకార, అతడైతే అలాగే చేసినాడు

3 తం హ ఉవాచ। యద్ దోషా లవణమ్ ఉదకే అవాధాః

ఆతని నుద్దేశించి అన్నాడు. రాత్రి ఏ ఉప్పును నీళ్ళలో వేశావో

అంగ! తత్ ఆహర ఇతి.

నాయనా! దాన్ని తీసికురా అని (అన్నాడు తండ్రి)

4. తద్ధ (తద్+హ) అవమృశ్య న వివేద

దాని తడిమిచూచి గ్రహించలేకపోయాడు. (పుత్రుడు)

అంటే నీళ్ళలో నిన్నవేసిన ఉప్పును ఈ రోజు వెదికితే అది చేతికి దొరకలేదన్నమాట. (నీళ్లలో కలిసి పోతుంది కదా!)

5 యథా విలీనమ్ ఏవ అంగ!

ఎలాగైతే విలీనం అయిపోయిందో, (అలాగే నాయనా! పరమాత్మ కూడా) విలీనం అయి ఉంటాడని భావం)

6. అథ అస్య ఆదౌ ఆచామ ఇతి.

ఇక దీనికి ముందుభాగంలో నోటిలో పుచ్చుకో అని (అన్నాడు)

7. కథమ్? ఇతి - ఎలా ఉంది? అని (అడిగాడు తండ్రి)

8. లవణమ్, ఇతి - ఉప్పు, అని (అన్నాడు కొడుకు)

9. మధ్యాద్ - ఆచామ - మధ్యలోంచి త్రాగు, ఇతి = అని అన్నాడు (తండ్రి)

10. కథమ్ ఇతి - ఎలా ఉంది? అని (అన్నాడు తండ్రి)

11. లవణమ్ ఇతి - ఉప్పగా ఉంది అన్నాడు (కుమారుడు)

12. అంతాద్ ఆచామ - చివరనుంచి త్రాగు , ఇతి = అని అన్నాడు తండ్రి)

13. కథమ్? ఇతి - ఎలా ఉంది? అని (అన్నాడు తండ్రి)

14. లవణమ్ - ఇతి - ఉప్పగా ఉంది అని (అన్నాడు కుమారుడు)

15. అథ అభిప్రాస్య తత్ మా ఉపాసదథాః ఇతి.

ఇక్కడ పారపోసి దీన్ని, నా దగ్గరకురా, అని (అన్నాడు తండ్రి)

16. తద్హ, తథా, చకార, - దాన్ని అలాగే, చేశాడు. (కుమారుడు)

17. తత్ శశ్వత్ సంవర్తతే, తంహాఉవాచ। ఆ నీళ్ళల్లో ఎప్పుడూ ఉప్పు అలాగే ఉందని అన్నకుమారునితో తండ్రి ఇలా అంటున్నాడు.

18. అత్ర వాచ కిల సత్ సోమ్య, ననిభాలయసే అత్ర ఏవ కిల ఇతి.

ఇక్కడే కదా సత్ అనే పరమాత్మ, అని దర్శించలేవుకదా! ఇక్కడే కదా! అని, అంటే ఎక్కడో ఒక్కచోటే కాక అంతా పరమాత్మ తత్త్వం ఉందన్నమాట. ఈ సత్యాన్ని తండ్రి కొడుకుకు ఉదాహరణ పుర్వస్సరంగా వివరించాడు. ఇది ప్రాచీన విద్యా విధానం! (ఉదాహరణంతో విశదపరచడం ప్రాచీన విద్యావిధానం)

## మరికొన్ని ఉపనిషద్ వాక్యాలు చూద్దాం.

మనం తినే అన్నం వల్లనే 'మనస్సు పుడుతున్నది.

మనస్సు అనేది ఎలా ఉంటుంది; అసలు అది ఎక్కడ ఉంటుంది? అది ఎలా ఏర్పడుతుంది? అనేది నేటికీ వైజ్ఞానికులకు అంతు పట్టని విషయం. మన ఉపనిషత్తు ఇలా అంటున్నది. ఈ సమస్త సృష్టి మూడు పదార్థాల కలయికచే ఏర్పడింది. (1) పృథివి (2) జలం (3) తేజస్సు, వీటి కలయికకు వాయువు ప్రేరకం కాగా, ఆకాశం అవకాశాన్ని కలుగజేసింది. కనుక సృష్టిని పాంచభౌతికం అని అంటాం. (ఛాం 6.5)

1) అన్నమ్ అశితం త్రేధా విధీయతే । తస్య, యః, స్థవిష్ఠో ధాతుః

అన్నం తినబడినది మూడుగా చేయబడుతుంది. దానికి చెందిన, య స్థూలమైన అంశమున్నదో

తత్ పురీషం భవతి। యో మధ్య మః తన్మాంసమ్ ।

అది మలంగా అవుతున్నది. ఏ మధ్యస్థమైన అంశం ఉన్నదో అదిమాంసం.

యో, అణిష్ఠః తత్, మనః।

ఏ, సూక్ష్మాంశమున్నదో, అది, మనస్సు (అవుతున్నది) (మనస్సుకు పోషకం అవుతుంది)

2. ఆపః పీతాః త్రేధా విధీయన్తే। తాసాం యః స్థవిష్ఠోధాతుః

నీరు త్రాగబడినవి మూడుగా అవుతున్నాయి. వాటిలో ఏ స్థూలాంశం ఉన్నదో

తత్ మూత్రమ్ భవతి।

అది మూత్రం అవుతున్నది..

యో మధ్యమః, తత్ లోహితమ్।

ఏ మధ్యస్థంగా ఉండే భాగం ఉన్నదో అది రక్తం అవుతుంది.

యో అణిష్ఠః, సః, ప్రాణః।

ఏ సూక్ష్మాంశం ఉందో అది, ప్రాణం అవుతున్నది.

3. తేజో అశితం త్రేధా విధీయతే। తస్యయః సవిష్ఠోధాతుః।

నేయి మొ॥ తేజో ద్రవ్యం తినబడినది మూడుగా అవుతుంది. దానికి ఏ స్థూలాంశం ఉన్నదో

తత్ అస్థి భవతి। యో మధ్యమః స మజ్జా

అది ఎముకగా అవుతున్నది। ఏ మధ్యస్థాంశం ఉన్నదో అది మజ్జ (ఎముకల మధ్యలో ఉన్న గుజ్జు (అవుతున్నది.)

యో అణిష్ఠః సా వాక్

ఏ సూక్ష్మాంశం ఉందో అది వాక్కు (మాట)గా అవుతున్నది.

4. అన్నమయం హి సోమ్య మనః - ఓ సోమ్యుడా! అన్నమయయే కదా మనస్సు.

5. ఆపోమయః ప్రాణః - జలమయమైంది ప్రాణము.

(కనుకనే తిండిలేకండా కొంత కాలమైనా బ్రతకవచ్చు. కాని నీరు లేకపోతే ప్రాణం నిలవదు) అని ముందు ముందు ఉపనిషత్తు 6-7 ఖండాలలో నిరూపించింది)

6. తేజోమయీవాక్ - తజోమయమే వాక్కు. (తైలం నేయి మొదలైన ద్రవ్యాలు తేజోమయాలని శాస్త్రనిర్ణయం. వీటిని తీసికోందే వాక్కు స్ఫుటంగా రాదు.)

అయితే మనస్సు అహంకార తత్త్వం వల్ల ఏర్పడింది కదా? అన్నమయం ఎలా అవుతుంది? అని ప్రశ్న. నిజమే మూల ప్రకృతిలోంచి, బుద్ధి, దానిలోంచి అహంకారం

దానిలోంచి మనస్సు ఏర్పడ్డాయని చెప్పబడింది. కనుక ఇక్కడ అన్నం తినగాజీర్ణమైన అతి సూక్ష్మాంశం పెరుగు చిలికితే వెన్నవచ్చినట్లు పైకి వచ్చి మనస్తత్వాన్ని పోషిస్తుందని ఉపనిషత్తు చెబుతున్నది. చూడండి..

1) దధ్నః సోమ్య! మథ్యమానస్య యో అణిమా స ఊర్ధ్వః సముదీషతి, తత్ సర్పిర్భవతి।

పెరుగును సోమ్యుడా మథించినప్పుడు ఏ సూక్ష్మాంశం ఉందో అది పైకి తేలుతున్నది. అది నేయి అవుతున్నది.

2) ఏవమ్ ఏవ, ఖలు సోమ్య! అన్నస్య అశ్యమానస్య యో
ఇలాగే కదా సోమ్యుడా! అన్నం తినబడుతున్నప్పుడు ఏ
అణిమా స ఊర్ధ్వః సముదీషతి, తత్ మనో భవతి।
సూక్షాశం ఉన్నదో అది పైకి తేలుతుంది. అదే మనస్సు అవుతుంది.

ఇలాగే నీటిసారం ప్రాణంగాను, తేజస్సారం వాక్కుగాను అవుతుంది. ఈ మనస్సు ప్రాణానికి బంధింపబడి ఉంటుందట. ఉపనిషత్తు చక్కటి ఉదాహరణంతో ఇలా చెబుతున్నది.

3. (స) యథా శకునిః సూత్రేణా ప్రబద్ధో దిశందిశం పతిత్వా
ఎలాగైతే (ఆ) పక్షి త్రాటిచే కట్టబడి ప్రతిదిక్కుకూ, ఎగిరి
అన్యత్ర, ఆయతనమ్, అలబ్ధ్వా, బంధనమ్ ఏవ, ఉపాశ్రయతే,
వేరొకచోట, ఆశ్రయాన్ని, పొందలేక, తననుకట్టిన ప్రదేశాన్నే, ఆశ్రయిస్తుందో
ఏవమ్ హ కిల సోమ్య! తన్మనో, దిశందిశం, పతిత్వా
ఇలాగే, కదా, సోమ్యుడా! ఆమనస్సు దిక్కు దిక్కుకు ఎగిరి
అన్యత్ర, ఆయనతం, అలబ్ధ్వా, ప్రాణమ్, ఏవ ఉపాశ్రయతే.
వేరొకచోట, ఆశ్రయాన్ని, పొందలేక, ప్రాణాన్నే, ఆశ్రయించి ఉంటుంది.
ప్రాబంధనం హి పోమ్య మనః ఇతి
ప్రాణంతో బంధింపబడిందేకదా, సోమ్యుడా! మనస్సు, అని (చెప్పాడు గురువు)

ప్రాచీనకాలంలో తండ్రి మొదటిగురువుగా ఉండేవాడు. గురుకులాలు రెండవ విద్యాస్థానం. ప్రాచీనకాలంలో ఎన్నోరకాల విద్యలుండేవి. ఛాందోగ్యోపనిషత్తు ఆ విద్యలు ఏవో ఇలా నిర్దేశించింది-

# ప్రాచీనకాలపు విద్యలు

'వాగ్వా ఋగ్వేదం (1) విజ్ఞాపయతి। యజుర్వేదం (2) సామవేదమ్ (3) అథర్వణమ్, వాక్కే ఋగ్వేదాన్ని తెలియజేస్తుంది. యజుర్వేదాన్ని, సామవేదాన్ని, అధర్వణవేదాన్ని,

(4) చతుర్థమ్ ఇతిహాసం - పురాణం - పంచమం వేదానాం వేదం (5) నాల్గవదాన్ని - ఇతిహాసాన్ని - పురాణాన్ని ఐదవదైన వేదాలకు వేదమైన (వ్యాకరణాన్ని)

పిత్ర్యం (6) - రాశిం (7) - దైవం (8) నిధిం - (9)

శ్రాద్ధాది ప్రక్రియను - గణితాన్ని - జ్యోతిషాన్ని - భూమిలో ఖనిజాలను

వాకోవాక్యం (10) ఏకాయనం (11) దేవవిద్యాం (12) బ్రహ్మవిద్యాం (13)

తర్కశాస్త్రాన్ని - నీతిశాస్త్రాన్ని - దేవతో పాసన ప్రకారాన్ని - తత్త్వ విద్యను

భూతవిద్యాం (14) క్షత్ర విద్యాం (15) - నక్షత్ర విద్యాం (16) - సర్ప (17) దేవ (18)

వశీకరణవిద్యను - యుద్ధవిద్యను - ఖగోళశాస్త్రాన్ని - గారుడ విద్యను, గాంధ

జన విద్యామ్ (19) - దివమ్ -పృధివీం వాయుం-ఆకాశం చ ఆపంః చ - తేజ శ్చ - ర్వవిద్యను - నృత్య సంగీతాన్ని ఆయుర్వేదాన్ని (జన విద్యను) అంతరిక్షంలోని కాలం గురించిన విద్యను భూతత్వాన్ని వాయుతత్త్వాన్ని - ఆకాశాన్ని - జలవిజ్ఞానాన్ని - తేజస్సు గురించిన విద్యను -

దేవాంశ్చ - మనుష్యాంశ్చ - పశూంశ్చ - వయాంసి చ -

దేవతల గురించిన విజ్ఞానాన్ని - మానవుల గురించిన విజ్ఞానాన్ని - పశువుల గురించిన విద్యను. - పక్షులకు చెందిన విద్యను,

తృణ వనస్పతీన్ - శ్వాపదాన్ - అన్యకీట పతంగ - పిపీలికమ్ -

గడ్డి - వృక్షాలు మొదలైనవాటి విజ్ఞానాన్ని - అరణ్యమృగాలను - ఇతరకీటకాలు మిడతలు - చీమలు మొదలైన సూక్ష్మజంతువులు గురించి -

ధర్మంచ అధర్మంచ సత్యంచా నృతంచ -

ధర్మాధర్మాలగురించి - సత్యాసత్యాల

సాధు అసాధుచ - హృదయజ్ఞం - అహృదయజ్ఞంచ -

మంచి చెడుల గురించి -అందమైన వాటి గురించి - వికారవస్తువుల గురించి

(వాగ్వావ విజ్ఞాపయతి - వాక్కే తెలియజేస్తున్నది. (ఛాంబ 7.2)

ఇక్కడ ఎన్నోరకాల విజ్ఞానాల గురించి, విద్యల గురించి ప్రస్తావింపబడింది.

# ధాతు ప్రయోగాలు - సామాన్య పరిచయం

శాస్త్రకారులు ధాతురూపాలను మూడు రకాలుగా విభజించారు. (1) పరస్మై పది ధాతువులు (2) ఆత్మనే పది ధాతువులు (3) ఉభయ పది ధాతువులు అని వీటి ప్రయోగాల్లో సూక్ష్మమైన భేదాన్నివారు నిర్దేశించినా, ఆధునిక ప్రయోగాల్లో ఆభేదాన్ని అంతగా పాటిస్తున్నట్లు కనపడదు. అయితే వీటి ప్రయోగాలను, తేడాలను గుర్తించవలసిన అవసరం ఉంది. సంస్కృతాధ్యయనం చేసేవారు, భూసత్తయామ్ (ఉండుట) అనే ధాతువును, ఏధ = వృద్ధౌ (వృద్ధి చెందుట) అనే ధాతువును ఇవి మంగళార్థం కలవి అవడం వల్ల ముందుగా కంఠస్థం చేస్తారు. ఈరెండూ కంఠస్థం చేస్తే, స్థూలంగా చాలావరకు ధాతు రూపాలను గుర్తించడం సాధ్యమౌతుంది. ప్రతిధాతువుకు పదిలకారాలలో ప్రయోగాలుంటాయని వెనుక చెప్పడం జరిగింది. ఈ క్రింది టేబుల్లో పరస్మైపది అయిన 'భూ' ధాతువుకు 10 లకారాల్లో రూపాలు ఎలా ఉంటాయో ఇవ్వడం జరిగింది. ఈ రూపాల చివళ్ళు ఎలా ఉన్నాయో గుర్తు పెట్టుకుంటే ఇలాంటివే అయిన మరికొన్ని ధాతువులను కూడా గుర్తించవచ్చు.

| ప్రథమపురుషః (వాడు/అది) 1 | | | మధ్యమపురుషః (నీవు/మీరు) 2 | | | ఉత్తమపురుషః (నేను/మేము) 3 | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఏకవచనం | ద్వివచనం | బహువచనం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
| తి | తః | అన్తి | సి | థః | థ | మి | వః | మః |
| భవతి | భవతః | భవన్తి | భవసి | భవథః | భవథ | భవామి | భవావః | భవామః |
| ఉన్నది | ఇద్దరున్నారు | ఉన్నారు, | ఉన్నావు | మీరిద్ద రున్నారు | మీరున్నారు | ఉన్నాను | మేమిద్దరం ఉన్నాము | ఉన్నాము |

| 1 | | | 2 | | | 3 | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ<br>బభూవ<br>ఉండెనట | అతుః<br>బభూవతుః<br>ఇద్దరుండిరట | ఉః<br>బభూవుః<br>ఉండిరట | ఇథ/థ<br>బభూవిథ<br>నీవుంటివట | అథుః<br>బభూవథుః<br>వీరిరువురుం<br>టిరట | అ<br>బభూవ<br>మీరుంటిరట | అ<br>బభూవ<br>ఉంటినట | ఇవ/వ<br>బభూవివ<br>మేమిరువుర<br>ముంటిమట | ఇవ/మ<br>బభూవిమ<br>ఉంటిమట |
| తా<br>భవితా<br>ఉండగలదు<br>ఉండగలడు | తారౌ<br>భవితారౌ<br>ఇద్దరుండ<br>గలరు | తారః<br>భవితారః<br>అందరుండ<br>గలరు | తాసి<br>భవితాసి<br>ఉండగలవు | తాస్థః<br>భవితాస్థః<br>మీరిరువు<br>రుండగలరు | తాస్థ<br>భవితాస్థ<br>మీరుండ<br>గలరు | తాస్మి<br>భవితాస్మి<br>నేనుండ<br>గలను | తాస్వః<br>భవితాస్వః<br>ఇద్దరముండ<br>గలము | తాస్మః<br>భవితాస్మః<br>మేముండ<br>గలము |
| ష్యతి<br>భవిష్యతి<br>ఉండగలడు<br>ఉండగలదు | ష్యతః<br>భవిష్యతః<br>రెండుండగలవు<br>ఇద్దరుండగలరు | ష్యన్తి<br>భవిష్యన్తి<br>ఉండగలవు<br>ఉండగలరు | ష్యసి<br>భవిష్యసి<br>ఉండగలవు<br>గలరు | ష్యథః<br>భవిష్యథః<br>మీరిరువు<br>రుండగలరు | ష్యథ<br>భవిష్యథ<br>మీరుండ<br>గలరు | ష్యామి<br>భవిష్యామి<br>ఉండగలను<br>ఉండగలము | ష్యావః<br>భవిష్యావః<br>మేమిద్దరం<br>గలము | ష్యామః<br>భవిష్యామః<br>మేముండ<br>గలము. |
| తు/తాత్<br>భవతు/<br>భవతాత్<br>ఉండునుగాక | తామ్<br>భవతాం<br>రెండుండునుకాక<br>ఇద్దరుందురుగాక | అన్తు<br>భవన్తు<br>ఉండునుగాక<br>ఉందురుగాక | అ/హి/తాత్<br>భవ/<br>భవతాత్<br>ఉందువుగాక | తమ్<br>భవతం<br>మీరిద్దరు<br>ఉందురుగాక | త<br>భవత<br>మీరుందురు<br>గాక | ఆని<br>భవాని<br>నేనుందును<br>గాక | ఆవ<br>భవావ<br>మేమిద్దరం<br>ఉందుముగాక | ఆమ<br>భవామ<br>ఉందుము<br>గాక |
| అత్<br>అభవత్<br>ఉండెను | తామ్<br>అభవతామ్<br>ఇద్దరుండిరి<br>రెండుండెను | అన్<br>అభవన్<br>ఉండిరి<br>ఉండినవి | అః<br>అభవః<br>ఉంటివి | తమ్<br>అభవతం<br>మీరిరువురు<br>ఉండిరి | త<br>అభవత<br>మీరుండిరి | అమ్<br>అభవమ్<br>ఉంటిని | ఆవ<br>అభవావ<br>ఇరువుర<br>ముంటిమి | ఆమ<br>అభవామ<br>ఉంటిమి |

| 1 | | | 2 | | | 3 | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఏత్<br>భవేత్<br>ఉండవలెను | తామ్<br>భవేతామ్<br>ఇద్దరు/రెండు<br>ఉండవలెను | ఏయుః<br>భవేయుః<br>ఉండవల<br>యును | ఏః<br>భవేః<br>నీవుండ<br>వలెను | ఏతమ్<br>భవేతం<br>మీరిద్దరుండ<br>వలెను | ఏత<br>భవేత<br>మీరుండ<br>వలెను | ఏయమ్<br>భవేయం<br>నేనుండ<br>వలయును | ఏవ<br>భవేవ<br>మీమిరువుర<br>ముండవలయును | ఏమ<br>భవేమ<br>మేముండ<br>వలెను |
| యాత్<br>భూయాత్<br>అగునుగాక | యాస్తాం<br>భూయాస్తామ్<br>(రెండు/ఇద్దరు<br>ఉండును/ఉందురుగాక | యాసుః<br>భూయాసుః<br>ఉందురుగాక | యాః<br>భూయాః<br>ఉండువు<br>గాక | యాస్తమ్<br>భూయాస్తం<br>మీరిద్దరుందు<br>రుగాక | యాస్త<br>భూయాస్త<br>మీరుందు<br>రుగాక | యాసమ్<br>భూయాసం<br>నేనుందును<br>గాక | యాస్వ<br>భూయాస్వ<br>మీమిరువర<br>ముందుము | యాస్మ<br>భూయాస్మ<br>మేముందు<br>ముగాక |
| త్/ఈత్<br>అభూత్<br>అయ్యెను | తాం/ఇష్టామ్<br>అభూతామ్<br>రెండు/ఇద్దరు<br>అయిరి | అన్/ఇషుః<br>అభూవన్<br>అయిరి<br>అయినవి | ఊః/ఈః<br>అభూః<br>అయితివి | తమ్<br>అభూతమ్<br>మీరిరువురు<br>అయితిరి | త<br>అభూత<br>అయితిరి | అమ్/షమ్<br>అభూవమ్<br>అయితిని | వ<br>అభూవ<br>మేమిరువుర<br>ముఅయితిమి | మ<br>అభూమ<br>అయితిమి |
| ష్యత్<br>అభవిష్యత్<br>అయిఉండెడిది | ష్యతాం<br>అభవిష్యతామ్<br>రెండుఅయి<br>ఉండెడివి | ష్యన్<br>అభవిష్యన్<br>అయిఉం<br>డెడివి | ష్యః<br>అభవిష్యః<br>అయిఉండెడి<br>వాడవు | ష్యతమ్<br>అభవిష్యతమ్<br>మీరిరువురు<br>అయిఉం<br>డెడివారు | ష్యత<br>అభవిష్యత<br>అయి<br>ఉండెడివారు | ష్యమ్<br>అభవిష్యమ్<br>అయిఉండెడి<br>వాడను | ష్యావ<br>అభవిష్యావ<br>ఇద్దరము<br>అయిఉండె<br>డివారము | ష్యామ<br>అభవిష్యామ<br>అయిఉండె<br>డివారము |

ఇక్కడ స్థూలంగా మాత్రమే అర్థం నిర్దేశించడం జరిగింది. ప్రయోగాన్ని బట్టి అర్థం తెలుస్తుంది.

ఇప్పుడు ఇంచుమించుగా ఇలాగే ఉండే మరికొన్ని ధాతువులకు ప్రధానమైన 4లకారాలలో రూపాలు నిర్దేశించి టేబుల్లో చూపించడం జరుగుతున్నది. వీటిని భూధాతువుతో పోల్చుకోండి. చాలా వరకు పోలికలు కనిపిస్తాయి. తరువాత ఏవైనా శ్లోకాల్లో ఈ రూపాలు గుర్తించవచ్చు. ఇక్కడ 10 గణాలకు చెందిన కొన్ని ధాతువులు ప్రత్యకంగా నిర్దేశించడం జరుగుతున్నది. ఇక్కడ కొన్నింటికి ప్రథమపురుష రూపాలు మాత్రమే ఇస్తున్నాం. మిగతా భూధాతువును చూచి ఊహించవచ్చు.

ఇక్కడ 9 గణాలు మాత్రం ఇవ్వడం జరిగింది - 10వ గణం 'చురాదిగణం' విడిగా ప్రేరణార్థక ధాతురూపాలతో ఇవ్వడం జరుగుతుంది.

| ధాతువు | అర్థం | లట్ వర్తమానకాలం ఏక.వ ద్వి.వ. బహు | లిట్ = పరోక్షభూతం ఏక ద్వి బహు | ల్యట్ = సాధారణ భవిష్యత్తు ఏక ద్వి బహు | లోట్ = ఆశీస్సు ఏక ద్వి బహు |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| భ్వాదిగణం | | | | | |
| వృషు=సేచనే | తడుపుట | వర్షతి-వర్షతః వర్షన్తి | వవర్ష-వవృషతుః-వవృషుః | వర్షిష్యతి-వర్షిష్యతః-వర్షిష్యన్తి | వర్షతు-వర్షతాం-వర్షన్తు |
| అర్చ=పూజాయామ్ | పూజించుట | అర్చతి-అర్చతః-అర్చన్తి | ఆనర్చ-ఆనర్చతుః-అనర్చుః | అర్చిష్యతి-అర్చిష్యతః-అర్చిష్యంతి | అర్చతు<br>అర్చతాత్-అర్చతాం-అర్చన్తు |
| త్యజ=హానౌ | విడచుట | త్యజతి-త్యజతః-త్యజన్తి | తత్యాజ-తత్యజతుః-తత్యజుః | త్యక్ష్యతి-త్యక్ష్యతః-త్యక్ష్యంతి | త్యజతు<br>త్యజతాత్-త్యజతాం-త్యజన్తు |
| పఠ=వ్యక్తాయాం వాచి | పైకి చదువుట | పఠతి-పఠతః-పఠన్తి | పపాఠ-పపఠతుః-పపఠుః | పఠిష్యతి-పఠిష్యతః-పఠిష్యంతి | పఠతు<br>పఠతాత్-పఠతాం-పఠన్తు |

| 1 | 2 | | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| దివాదిగణం | | | | | నృత్యతు |
| నృతీ=గాత్ర | నృత్యము | నృత్యతి-నృత్యతః-నృత్యంతి | ననర్త-ననృతతుః-ననృతుః | నర్తిష్యతి-నర్తిష్యతః-నర్తిష్యంతి | నృత్యతాం-నృత్యంతు |
| విక్షేపే | చేయుట | నృత్యసి-నృత్యథః-నృత్యథ | ననర్తిథ-ననృతథుః-ననృత | నర్తిష్యసి-నర్తిష్యథః-నర్తిష్యథ | నృత్యతాత్ |
| | | నృత్యామి-నృత్యావః | ననర్త-ననృతివ-ననృతిమ | నర్తిష్యామి-నర్తిష్యావః | నృత్య-నృత్యతాత్-నృత్యతం-నృత్యత |
| | | నృత్యామః | | నర్తిష్యామః | నృత్యాని-నృత్యావ-నృత్యామ |
| పుష=పుష్టే | పుష్టి | పుష్యతి-పుష్యతః-పుష్యన్తి | పుపోష-పుపుషతుః-పుపుషుః | పోక్ష్యతి-పోక్ష్యతః-పోక్ష్యన్తి | పుష్య |
| | | | | | పుష్యతాత్-పుష్యతాం-పుష్యన్తు |
| | | పుష్యసి-పుష్యథః-పుష్యథ | పుపోషిథ-పుపుషథుః-పుపుష | పోక్ష్యసి-పోక్ష్యథః-పోక్ష్యథ | పుష్య |
| | | | | | పుష్యతాత్-పుష్యతం-పుష్యత |
| | | పుష్యామి-పుష్యావః-పుష్యామః | పుపోష-పుపుషివ-పుపుషిమ | పోక్ష్యామి-పోక్ష్యావః-పోక్ష్యామః | పుష్యాణి-పుష్యావ-పుష్యామ |
| తుదాదిగణం | | పృచ్ఛతి-పృచ్ఛతః-పృచ్ఛంతి | పప్రచ్ఛ-పప్రచ్ఛతుః-పప్రచ్ఛుః | ప్రక్ష్యతి-ప్రక్ష్యతః-ప్రక్ష్యన్తి | పృచ్ఛతు |
| | | | | | పృచ్ఛవాత్-పృచ్ఛతాం-పృచ్ఛన్తు |
| ప్రచ్ఛ. జీప్సా | ప్రశ్నించుట | పృచ్ఛసి-పృచ్ఛథః-పృచ్ఛథ | పప్రచ్ఛిథ | | పృచ్ఛ |
| యామ్ | | | పప్రష్ఠ-పప్రచ్ఛథుః-పప్రచ్ఛ | ప్రక్ష్యసి-ప్రక్ష్యాథః-ప్రక్ష్యాథ | పృచ్ఛతాత్-పృచ్ఛతం-పృచ్ఛత |

| 1 | | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| పృచ్ఛత | | | | | |
| | | పృచ్ఛామి-పృచ్ఛావః-పృచ్ఛామః | పప్రచ్ఛివ-పప్రచ్ఛివ-పప్రచ్ఛిమ | ప్రక్ష్యామి-ప్రక్ష్యావః-ప్రక్ష్యామః | |
| కృష=విలేఖనే | లాగుట | కృషతి-కృషతః-కృషన్తి | చకర్ష-చకృషతుః-చకృషుః | క్రక్ష్యతి-క్రక్ష్యతః-క్రక్ష్యన్తి | కృషతు |
| | | | | | కృషతాత్-కృషతాం-కృషన్తు |
| | | కృషసి-కృషథః-కృషథ | చకర్షిథ-చకృషథుః-చకృష | క్రక్ష్యసి-క్రక్ష్యథః-క్రక్ష్యథ | కృష |
| | | | | | కృషతాత్-కృషతం-కృషత |
| | | కృషామి-కృషావః-కృషామః | చకర్ష-చకృషివ-చకృషిమ | క్రక్ష్యామి-క్రక్ష్యావః-క్రక్ష్యామః | కృషాణి-కృషావ-కృషామ |
| అదాదిగుణం | | అస్తి-స్తః-సన్తి | అస్‌ధాతువుకు లిట్‌లకా | అసధాతువుకు ల్యట్‌తో | అస్తు,స్తాత్-స్తాం-సన్తు |
| అస=భువి | ఉండుట | అసి-స్థః-స్థ | రంలో భూధాతువుయొక్క | రూపాలన్నీ భూధాతువులాగే | ఏధి,స్తాత్-స్తం-స్త |
| | | అస్మి-స్వః-స్మః | రూపాలే ఉంటాయి | ఉంటాయి. భవిష్యతిఇత్యాది | అసాని-అసావ-అసామ |
| అద=భక్షణే | తినుట | అత్తి-అత్తః-అదన్తి | వేరుగా ఉండవు. | అత్స్యతి-అత్స్యతః-అత్స్యన్తి | అత్తు |
| | | | ఆద-ఆదతుః-ఆదుః | | అత్తాత్-అత్తామ్-అదన్తు |
| | | అత్సి-అత్థః-అత్థ | ఆదిథ-ఆదథుః-ఆదః | అత్స్యసి-అత్స్యథః-అత్స్యథ | అద్ధి |
| | | | | | అత్తాత్-అత్తం-అత్త |
| | | అద్మి-అద్వః-అద్మః | ఆద-ఆదివ-ఆదిమ | అత్స్యామి-అత్స్యావః-అత్స్యామః | అదాని-అదావ-అదావ |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| జుహోత్యాది గణం | దానము | దదాతి-దత్తః-దదతి | దదౌ-దదతుః-దదుః | దాస్యతి-దాస్యతః-దాస్యన్తి | దదాతు |
| | | దదాసి-దత్థః-దత్థ | దదాథ-దదథుః-దద | దాస్యసి-దాస్యథః-దాస్యథ | దత్తాత్-దత్తాం-దదతు |
| దాఞ్=దానే | చేయుట ఇచ్చుట | దదామి-దద్వః-దద్మః | దదిథ<br>దదౌ-దదివ-దదిమ | దాస్యామి-దాస్యావః-దాస్యామః<br>దత్తాత్-దత్తం-దత్త | దేహి |
| ధాఞ్=ధా | ధరించుట | దధాతి-ధత్తః-దధతి | దధౌ-దధతుః-దధుః | ధాస్యతి-ధాస్యతః-ధాస్యన్తి | దధాతు |
| రణపోషణయోః | పోషించుట | దధాసి-ధత్థః-ధత్థ | దధిథ-దధథుః-దధః | ధాస్యసి-దాస్యథః-ధాస్యథ | ధత్తాం-దధతు<br>దేహి |
| | | దధామి-దధ్వః-దధ్మః | దధౌ-దదివ-దధిమ | ధాస్యామి-ధాస్యావః-ధాస్యామః | ధత్తాత్-ధత్తం-ధత్త<br>దధాని-దధావ-దధామ |
| స్వాదిగణం | ప్రోగు | చినోతి-చినుతః-చిన్వన్తి | చికాయ-చిక్యతుః-చిక్యుః | చేష్యతి-చేష్యతః-చేష్యన్తి | చినోతు |
| చిఞ్=చయనే | చేయుట | చినోషి-చినుథః-చినుథ | చికయిథ<br>చికేథ-చిక్యథుః-చిక్య | చేష్యసి-చేష్యథః-చేష్యథ | చినుతాత్-చినుతాం-చిన్వన్తు<br>చిను<br>చినుతాత్-చినుతం-చినుత |
| | | చినోమి-చినువః-చినుమః | చికాయ<br>చికయ-చిక్యివ-చిక్యిమ | చేష్యామి-చేష్యావః-చేష్యామః | చినవాని-చినవావ-చినవామ |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| రుధాదిగణం | భేదించుట | భినత్తి-భిన్తః-భిన్దన్తి | బిభేద-బభిదతుః-బిభిదుః | భేత్స్యతి-భేత్స్యతః-భేత్స్యన్తి | భినత్తు<br>భిన్తాత్-భిన్తామ్-భిన్దన్తు |
| భిదిర్=<br>విదారణే | | భినత్సి-భిన్థః-భిన్థ | బిభేదిథ-బిభిదథుః-బిభిద | భేత్స్యసి-భేత్స్యథః-భేత్స్యథ | భిన్ధి<br>భిన్తాత్-భిన్తం-భిన్త |
| | | భినద్మి-భిన్ద్వః-భిన్ద్మః | బిభేద-బిభిదివ-బిభిదిమ | భేత్స్యామి-భేత్స్యావఃభేత్స్యామః | భినదాని-భినదావ-భినదామ |
| తనాదిగణం | చేయుట | కరోతి-కురుతః-కుర్వన్తి | చకార-చక్రతుః-చక్రుః | కరిష్యతి-కరిష్యతః-కరిష్యన్తి | కరోతు<br>కురుతాత్-కురుతాం-కుర్వన్తు |
| | | కరోషి-కురుథః-కురుథ | చక్రిథ-చక్రథుః-చక్ర | కరష్యసి-కరిష్యథః-కరిష్యథ | కురు<br>కురుతాత్-కురుతం-కురుత |
| | | కరోమి-కుర్వః-కుర్మః | చకార<br>చకర-చకృవ-చకృమ | కరిష్యామి-కరిష్యావః-కరిష్యామః | కరవాణి-కరవావ-వరవామ |
| క్ర్యాదిగణం<br>డుక్రీఞ్=ద్రవ్య<br>వినిమయే | కొనుట<br>అమ్ముట | క్రీణాతి-క్రీణీతః-క్రీణన్తి<br>క్రీణాసి-క్రీణీథః-క్రీణీథ | చిక్రాయ-చిక్రియతుః-చిక్రియుః<br>చిక్రయిథ-చిక్రియథుః-చిక్రియ | క్రేష్యతి-క్రేష్యతః-క్రేష్యన్తి<br>క్రేష్యసి-క్రేష్యథః-క్రేష్యథ | క్రీణాతు,క్రీణీతాం-క్రీణన్తు<br>క్రీణీతాత్<br>క్రీణీహి క్రీణీతం-క్రీణీత |
| | | క్రీణామి-క్రీణీవః-క్రీణీమః | చిక్రాయ<br>చిక్రియ-చిక్రియివ-చిక్రియిమ | క్రేష్యామి-క్రేష్యామః-క్రేష్యామః | క్రీణాని-క్రీణావ-క్రీణామ |

ఈ పైని ఇచ్చిన ధాతురూపాలు వాక్యాల్లో ప్రయోగిస్తే ఎలా ఉంటాయో చూద్దాం. ముఖ్యంగా ఈ ధాతురూపాల చివళ్ళు ఎలా ఉన్నాయో చూచి పోలికను గుర్తించండి. మరికొన్ని 'లకారాలు' వేరే టేబుల్ ద్వారా తెలుసుకుందాం.

## ధాతుప్రయోగాలు ఎలా ఉంటాయో చూడండి.

వెనుక వేరువేరుగణాలకు సంబంధించిన నాలుగు లకారాలకు రూపాలు ఎలా ఉంటాయో ఈయడం జరిగింది. వీటిని వాక్యాల్లో ప్రయోగిస్తే ఎలా ఉంటాయో చూడండి.

### భ్వాది గణధాతువులు

1) వర్షాసు మేఘాః వర్షన్తి - వర్షాకాలంలో మేఘాలు వర్షిస్తున్నాయి. ఎప్పుడూ సాధారణంగా జరుగుతూ ఉండే క్రియను బోధించదలిస్తే దాన్ని తద్ధర్మార్థక ప్రయోగం అంటారు. అక్కడ ఈ వర్తమానకాల రూపాన్నే వాడవచ్చు.
2) మేఘాః - వర్షంతి - మేఘాలు వర్షిస్తూ ఉంటాయి.
3) భక్తః భగవన్తం - పుష్పైః అర్చతి - భక్తుడు భగవంతుని పూలతో అర్చించును.
4) సన్తః స్వార్థం త్యజన్తి - సత్పురుషులు స్వార్థాన్ని వదులుతారు.
5) బాలాః - పఠన్తి - బాలురు చదువుతున్నారు.

ఇంతవరకు బహువచన క్రియా పదాలు ఇవ్వడం జరిగింది. ఈ క్రియా పదాలను ఏక - ద్వి వచనాల్లో ప్రయోగించినప్పుడు సుబన్త శబ్దాల వచనాలు మార్చవలసి ఉంటుంది. ఎలా? మేఘః వర్షతి (ఏక.వ) మేఘం వర్షిస్తున్నది. మేఘౌ వర్షతః రెండు మేఘాలు

వర్షిస్తున్నాయి. భక్తౌ - అర్చతః ఇద్దరు భక్తులు అర్చిస్తున్నారు. భక్తః అర్చతి - భక్తుడు అర్చిస్తున్నాడు. సన్తౌ స్వార్థః త్యజతః ఇద్దరు సత్పురుషులు స్వార్థాన్ని విడిచిపెడుతున్నారు. ఇవన్ని ప్రథమ పురుష ప్రయోగాలు.

మధ్యమ - ఉత్తర పురుషల్లో ప్రయోగాలు చూడండి.

హే మేఘ! త్వం వర్షసి - మేఘౌ యువాం - వర్షథః । మేఘాః యూయం వర్షథ

ఓ మేఘమా నీవు వర్షిస్తున్నావు. మీరిద్దరు వర్షిస్తున్నారు. మీరంతా వర్షిస్తున్నారు.

త్వమ్ అర్చసి - యువామ్ అర్చథః - యూయుమ్ - అర్చథ

నీవు అర్చిస్తున్నావు. మీరిరువురు అర్చిస్తున్నారు. మీరంతా అర్చిస్తున్నారు.

అహం - అర్చామి - అవామ్ అర్చావః - వయం అర్చామః

నేను అర్చిస్తున్నాను. మేమిరువురం అర్చిస్తున్నాం. మేమంతా అర్చిస్తున్నాం.

## మిగతా లకారాల ప్రయోగాలు చూడండి - వాటిని గుర్తించండి

1) మేఘాః వవృషుః మేఘాలు వర్షించినవట 2) తే - దేవాన్ ఆనర్చుః - వారు దేవతలను అర్చించిరట.
3) అవశ్యం శ్వః మేఘాః వర్షిష్యన్తి - తప్పకుండా రేపు మేఘాలు వర్షించగలవు.
4) హేమేఘాః యూయమ్ వర్షన్తు - ఓ మేఘాల్లారా మీరు వర్షింతురుగాక.
5) మేఘాన్ దృష్ట్వా మయూరాః నర్తిష్యంతి - మేఘాలను చూచి నెమళ్ళు నర్తించగలవు.
6) వయమ్ ఆనందాత్ నర్తిష్యామః - మేము ఆనందంతో నర్తించగలము.
7) యూయమ్ గాః క్రీణన్తు - మీరు గోవులను కొందురుగాక.

8) వయమ్ అన్నమ్ అత్స్యామః - మేము అన్నం తినగలము.

9) రామః క్రోధాత్ ధనుః చకర్ష। రాముడు క్రోధంతో ధనుస్సును లాగినాడట.

10) వివేకినః తత్త్వం ప్రక్ష్యన్తి - వివేకులు తత్త్వాన్ని ప్రశ్నింపగలరు.

11) త్వం ఉపాధ్యాయాన్ పృచ్ఛతు - నీవు ఉపాధ్యాయుని ప్రశ్నింతువు గాక.

12) అహం తవ ధనం దాస్యామి - నేను నీకు ధనం ఇవ్వగలను.

13) జ్ఞానం చేష్యన్తి పండితాః - పండితులు జ్ఞానాన్ని ప్రోగుచేయగలరు. ఇలాగే ప్రయోగాలు ధాతువుల లిస్టుతో ఎన్నైనా చేయవచ్చు. భూధాతువులాగా అర్థాలు చెప్పుకోవాలి.

ఇప్పుడు వెనుక టేబుల్‌లో లేని 'లకారాలు'

పాణిని మొత్తం క్రియా పదాలకు మూలాలైన ధాతువులను 10 గణాలుగా విభజించి ఒక్కొక్క ధాతువుకు 10 లకారాలుంటాయని చెప్పాడని వెనుక చెప్పుకున్నాం. ఒక్కొక్క అర్థాన్ని లేదా కాలాన్ని గుర్తించడానికి వాటికి సంగ్రహంగా లట్ = వర్తమానకాలం, లిట్ = పరోక్షభూత కాలం, లృట్ = భవిష్యత్ కాలం, ఇలా 'లకారాలను' నిర్దేశించాడని కూడా తెలుసుకున్నాం. ఈ సంగ్రహమైన లట్, లిట్ మొదలైన 10 సంజ్ఞలద్వారా ధాతువుల వ్యవహారాన్ని వాటి కాలాలను వ్యవహరించ వచ్చున్నమాట. అంటే ఎవరైనా ఇది వర్తమానకాలానికి చెందిన క్రియ అని చెప్పదలిస్తే సూక్ష్మంగా 'ఇది లట్ లకారం' అనవచ్చు. ఇలాగే మిగతావి కూడా. వెనక టేబుల్‌లో 10గణాలలోని కొన్ని వాడుకలో బాగా ఉపయోగించే ధాతువులు తీసికొని, వాటికి నాలుగు లకారాల్లో రూపాలు ఇవ్వడం జరిగింది. ఇప్పుడు మరికొన్ని లకారాలు ఈ క్రింది టేబుల్ ద్వారా గ్రహించండి. ఈ ధాతువులు వేరు వేరు గణాలలోనివి. వెనుకటి టేబుల్లో నిర్దేశించిన ధాతువులే ఇక్కడ ఇవ్వబడ్డాయి.

| ధాతువు | లఙ్=అనద్యతనభూతే ప్రస్తుతం 24 గం ముందుకాలం | విధిలిఙ్=విధిని బోధించే లిఙ్ అనే లకారం | ఆశీర్లిఙ్=ఆశీస్సునుబోధించే లిఙ్‌లకారం. |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| వృషు | అవర్షత్-అవర్షతాం-అవర్షన్ | వర్షేత్-వర్షేతాం-వర్షేయుః | వృష్యాత్-వృష్యాస్తామ్-వృష్యాసుః |
| | అవర్షః-అవర్షతం-అవర్షత | వర్షేః-వర్షేతం-వర్షేత | వృష్యాః-వష్యాస్తమ్-వృష్యాస్త |
| | అవర్షమ్-అవర్షావ-అవర్షామ | వర్షేయం-వర్షేవ-వర్షేమ | వృష్యాసమ్-వృష్యాస్వ-వృష్యాస్మ |
| నృతీ | అనృత్యత్-అనృత్యతాం-అనృత్యన్ | నృత్యేత్-నృత్యేతాం-నృత్యేయుః | నృత్యాత్-నృత్యాస్తాం-నృత్యాసుః |
| | అనృత్యః-అనృత్యతం-అనృత్యత | నృత్యేః-నృత్యేతం-నృత్యేత | నృత్యాః-నృత్యాస్తం-నృత్యాస్త |
| | అనృత్యమ్-అనృత్యావ-అనృత్యామ | నృత్యేయం-నృత్యేవ-నృత్యేమ | నృత్యాసం-నృత్యాస్వ-నృత్యాస్మ |
| ప్రచ్ఛ | అపృచ్ఛత్-అపృచ్ఛతాం-అపృచ్ఛన్ | పృచ్ఛేత్-పృచ్ఛేతాం-పృచ్ఛేయుః | పృచ్ఛ్యాత్-పృచ్ఛ్యాస్తాం-పృచ్ఛ్యాసుః |
| | అపృచ్ఛః-అపృచ్ఛతమ్-అపృచ్ఛత | పృచ్ఛేః-పృచ్ఛేతం-పృచ్ఛేత | పృచ్ఛ్యాః-పృచ్ఛ్యాస్తం-పృచ్ఛ్యాస్త |
| | అపృచ్ఛమ్-అపృచ్ఛావ-అపృచ్ఛామ | పృచ్ఛేయం-పృచ్ఛేవ-పృచ్ఛేమ | పృచ్ఛ్యాసం-పృచ్ఛ్యాస్వ-పృచ్ఛ్యాస్మ |
| అద | ఆదత్ ఆత్తామ్-ఆదన్ | అద్యాత్-అద్యాతాం-అద్యుః | అద్యాత్-అద్యాస్తామ్-అద్యాసుః |
| | ఆదః-ఆత్తమ్-ఆత్త | అద్యాః-అద్యాతం-అద్యాత | అద్యాః-అద్యాస్తమ్-అద్యాస్త |
| | ఆదమ్-ఆద్వ-ఆద్మ | అద్యామ్-అద్యావ-అద్యామ | అద్యాసమ్-అద్యాస్వ-అద్యాస్మ |

ఈ ధాతువులో విధి లిఙ్-ఆశీర్లిఙ్‌లకారంల్లో 'స' అనే అక్షరం తేడా ఉంది. అంతా సమానమే. ఈ పోలికను గమనించండి.

ఈ క్రింది ధాతువులకు కూడా తేడా గమనించండి.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| దాఞ్ | అదదాత్-అదత్తామ్-అదదుః | దద్యాత్-దద్యాతాం-దద్యుః | దేయాత-దేయాస్తాం-దేయాసుః |
| | అదదాః-అదత్తం-అదత్త | దద్యాః-దద్యాతం-దద్యాత | దేయాఃదేయాస్తం-దేయాస్త |
| | అదదాం-అదద్వ-అదద్మ | దద్యామ్-దద్యా-దద్యామ | దేయాసం-దేయాస్వ-దేయాస్మ |
| చిఞ్ | అచినోత్-అచినుతాం-అచిన్వన్ | చినుయాత్-చినుయాతాం-చినుయుః | చీయాత్-చీయాస్తాం-చీయాసుః |
| | అచినోః-అచినుతం-అచినుత | చినుయాః-చినుయాతం-చినుయాత | చీయాః-చీయాస్తం-చీయాస్త |
| | అచినవం-అచినువ-అచినుమ | చినుయామ్-చినుయావ-చినుయామ | చీయాసం-చీయాస్వ-చీయాస్మ |
| | అచిన్వ్వ అచిన్మ్మ | | |
| భిదిర్ | అభినత్-అభిన్తాం-అభిన్దన్ | భింద్యాత్-బింద్యాతాం-భిన్ద్యుః | భిద్యాత్-భిద్యాస్తాం-భిద్యాసుః |
| | అభినః-అభిన్తం-అభిన్త | భింద్యాః-బింద్యాతం-భింద్యాత | భిద్యాః-భిద్యాస్తమ్-భిద్యాస్త |
| | అభినదం-అభిన్ద్వ-అభిన్ద్మ | బింద్యాం-భింద్యావ-భింద్యావ | భిద్యాసం-భిద్యాస్వ-భిద్యాస్మ |
| కృఞ్ | అకరోత్-అకురుతాం-అకుర్వన్ | కుర్యాత్-కుర్యాతాం-కర్యుః | క్రియాత్-క్రియాస్తాం-క్రియాసుః |
| | అకరోః-అకురుతం-అకురుత | కుర్యాః-కర్యాతం-కుర్యాః | క్రియాతః-క్రియాస్తం-క్రియాస్త |
| | అకరం-అకుర్వ-అకుర్మ | కుర్యామ్-కుర్యావ-కుర్యామ | క్రియాసం-క్రీయాస్వ-క్రియాస్మ |
| క్రీఞ్ | అక్రీణీత్-అక్రీణీతాం-అక్రీణన్ | క్రీణీయాత్-క్రీణీయాతాం-క్రీణీయుః | క్రీయాత్-క్రీయాస్తాం-క్రీయాసుః |
| | అక్రీణాః-అక్రీణీతం-అక్రీణీత | క్రీణీయాః-క్రీణీయాతం-క్రీణీయాత | క్రీయాః-క్రీయాస్తం-క్రీయాస్త |
| | అక్రీణాం-అక్రీణీవ-అక్రీణీమ | క్రీణీయామ్-క్రీణీయావ-క్రీణీయామ | క్రీయాసం-క్రీయాస్వ-క్రీయాస్మ |

ఈ రూపాలలో ఒక్కొక్క వరుసలో ధాతువులువేరైనా అర్థాలు మారినా రూపాల్లో పోలిక గమనించండి.

ఈ మాటలను బట్టి ప్రాచీనకాలంలో ఎన్నిరకాల విజ్ఞానం తెలియజేయబడేదో స్పష్టం అవుతోంది. ఈనాడు మనకు కనిపిస్తున్న అనేక విద్యావిభాగాలు ఆనాడూ ఉండేవని అయితే కాలానుగుణంగా అవి ఉండేవని గ్రహించవచ్చు. ఇవన్నీ సంస్కృతభాషలోనే గ్రంథస్థమై ఇప్పటికీ లభిస్తున్నాయి. ఈ క్రింది వాక్యాల్లో ధాతు ప్రయోగాలు గమనించండి.

| | సంస్కృతవాక్యాలు | తెలుగు అనువాదాలు |
|---|---|---|
| | 1 | 2 |
| 1) | ప్రాచీనకాలే-గురుకులాని - బభూవుః | ప్రాచీనకాలంలో - గురుకులాలు ఉండేవి. |
| 2) | పితా-ఏవ- ప్రథమగురుః - బభూవ | తండ్రియే మొదటి గురువై యుండేవాడు. |
| 3) | దృష్టాన్త పురస్సరం-విద్యా-ప్రదత్తా-అభవత్ | ఉదాహరణం ద్వారా విద్య ఇవ్వబడినదై యుండెను. |
| 4) | సాధారణ విద్యయా - సాకం - తత్త్వవిద్యా-నైతిక విద్యాచ ఆర్జితా అభవత్ | సామాన్య విద్యతో పాటు తత్త్వవిద్య - నైతిక విద్యకూడా సంపాదించబడుతూ ఉండేది. |
| 5) | ఏకవిజ్ఞానేన - సర్వం - విజ్ఞాతం భవతి - ఇతి జ్ఞాపయితుం - మృత్ - సువర్ణాది నిదర్శితమ్ అభూత్ | ఒకటి తెలిస్తే అంతా తెలిసినట్లవుతుందని తెలియ జేయడానికి మట్టి బంగారు మొ॥ ఉదాహరింపబడింది. |
| 6) | మృదోవిజ్ఞానేన ఘట - శరీరావాదివస్తూని జ్ఞాతాని - భవన్తి | మట్టియొక్క జ్ఞానంచేత దానితో తయారైన కుండ - చట్టి మొదలైన వస్తువులు తెలియబడివి అవుతున్నాయి. |
| 7) | తవ సర్వదా శుభం భూయాత్ | నీకు ఎప్పుడు శుభము కల్గునుగాక. |
| 8) | క్రేతారః-క్రీణీయుః ఇతి బుద్ధ్యా ఆపణే వస్తూని ప్రచిన్వన్తి | కొనేవారు-కొంటారనే బుద్ధితో - మార్కెట్టులో వస్తువులు ప్రోగు చేసి ఉంచుదురు. |

| | 1 | 2 |
|---|---|---|
| 9) | గురుః శిష్యస్య అజ్ఞానం భింద్యాత్ | గురువు శిష్యునియొక్క అజ్ఞానాన్ని ఛేదించాలి. |
| 10) | అద్యమేఘాః సమ్యక్ వర్షేయుః | ఈరోజ మేఘాలు బాగా వర్షించాలి. |
| 11) | బాలకాః - స్వాదూని ఫలాని ఆదన్ | బాలకులు రుచికరమైన ఫలాలను తినిరి. |
| 12) | శిష్యః గురుం సంశయమ్ అపృచ్ఛత్ | శిష్యుడు గురువును సందేహాన్ని అడిగినాడు. |
| 13) | బుద్ధిమాన్ శిష్యః సర్వదా సంశయాన్ పృచ్ఛేత్ | బుద్ధిమంతుడైన శిష్యుడు ఎప్పుడూ సంశయాలను అడగాలి. |
| 14) | బాలికా సుష్ఠు నృత్యతి | బాలిక బాగా నృత్యంచేస్తున్నది. |
| 15) | వర్షాసు మయూరాః నర్తిష్యంతి | వర్షాకాలంలో నెమళ్ళు నర్తించగలవు. |
| 16) | కృషకాః హలైః భూమిం కృషన్తు | కర్షకులు నాగళ్ళతో భూమిని దున్నుదురుగాక. |
| 17) | జలైః వృక్షాః సుష్ఠు పుష్యన్తి | జలములచే చెట్లు బాగా పుష్టిని పొందుచున్నవి. |
| 18) | మానవాః దేవాన్ అర్చన్తు | మానవులు దేవతలను అర్చింతురుగాక. |

ఇలా వెనుక టేబుళ్ళలో ఇచ్చిన ధాతురూపాలను ప్రయోగించవచ్చు. భూధాతువుకు నిర్దేశించిన అర్థాలను గమనించి, అలాగే మిగతా ధాతువులకు కూడా వాటి అర్థాలను చెప్పుకోవాలి. ఉదాహరణానికి - బభూవ = ఆయెను - అనేదాన్ని చూచి వవర్ష=వర్షించెను. భవిష్యతి = ఉండగలదు. త్యక్ష్యతి =విడిచిపెట్టగలడు. అభవత్ = ఉండెను. అపృచ్ఛత్ = ప్రశ్నించెను. భవన్తు = ఉండను గాక, ఇలా ఆయాలకారాలు వాటి అర్థాలు పోల్చి గ్రహించాలి. నిలువుగా ఒక్కొక్క వరుసలో ఉన్న ధాతు రూపాలకు ఒక్కొక్క విధమైన అర్థం. సమానంగానే వస్తుంది. ఇలాగే అన్నీ గుర్తించడానికి అభ్యాసం చేయాలి. ముందుగా రూపాల పోలికలు గ్రహించి అర్థాలు సమానంగా చెప్పుకోవచ్చు.

వెనుక ఇచ్చిన టేబుళ్ళలో రెంటిలోనుమొత్తం ఏడు లకారాలు నిర్దేశించడం జరిగింది. ఈ క్రింది టేబుల్‌లో మరి మూడు లకారాలు ఇవ్వడం జరుగుతున్నది. వీటితో మొత్తం పది లకారాలు ఇచ్చినట్లు అవుతున్నది.

| ధాతువు | లుట్=అనద్యతతనభవిష్యత్ ప్రస్తుతం 24గం॥ తరవాత కాలం | లుఙ్=భూతసామాన్య సాధారణ భూతకాలంలో | ల్ఋఙ్- భవిష్యతి - క్రియాతిపత్తౌ క్రియజరుగలేదనే అర్థంతోపాటు భవిష్యత్కాలాన్ని బోధించడానికి - |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| చితీ=సంజ్ఞానే | చేతితా-చేతితారౌ-చేతితార: | అచేతీత్-అచేతిష్టాం-అచేతిషు: | అచేతిష్యత్-అచేతిష్యతాం-అచేతిష్యన్ |
| తెలిసికొనుట | చేతితాసి-చేతితాస్థ:-చేతితాస్థ | అచేతీ:-అచేతిష్టం-అచేతిష్ట | అచేతిష్య:-అచేతిష్యతం-అచేతిష్యన్ |
| | చేతితాస్మి-చేతితాస్వ:-చేతితాస్మ: | అచేతిషం-అచేతిష్వ-అచేతిష్మ | అచేతిష్యం-అచేతిష్యావ-అచేతిష్యామ |
| వా=గతిగంధన | వాతా-వాతారే-వాతార: | అవాసీత్-అవాసిష్టాం-అవాసిషు: | అవాస్యత్-అవాస్యతాం-అవాస్యన్ |
| యో:వీచుట, | వాతాసి-వాతాస్థ:-వాతాస్థ | అవాసీ:-అవాసిష్టం-అనాసిష్ట- | అవాస్య:-అవాస్యతం-అవాస్యత |
| పరిమళించుట | వాతాస్మి-వాతాస్వ:-వాతాస్మ: | అవాసిషం-అవాసిష్వ-అవాసిష్మ | అవాస్యం-అవాస్యావ-అవాస్యామ |
| భీ=భీమే | భేతా-భేతారౌ-భేతార: | అభైషీత్-అభైష్టాం-అభైషు: | అభేష్యత్-అభేష్యతాం-అభేష్యన్ |
| భయపడుట | భేతాసి-బేతాస్థ:-భేతాస్థ | అభైషీ:-అభైష్టం-అభైష్ట | అభేష్య:-అభేష్యతం-అభేష్యత్ |
| | భేతాస్మి-భేతాస్వ:-భేతాస్మ: | అభైషమ్-అబైష్వ-అభైష్మ | అభేష్యం-అభేష్యావ-అభేష్యామ |
| మృష్=తితి | మర్షితా-మర్షితారౌ-మర్షితార: | అమర్షీత్-అమర్షిష్టాం-అమర్షిషు: | అమర్షిష్యత్-అమర్షిష్యతామ్-అమర్షిష్యన్ |
| క్షాయాం | మర్షితాసి-మర్షితాస్థ:-మర్షితాస్థ | అమర్షీ:-అమర్షిష్టం-అమర్షిష్ట | అమర్షిష్య:-అమర్షిష్యతం-అమర్షిష్యత |
| సహించుట | మర్షితాస్మి-మర్షితాస్వ:-మర్షితాస్మ | అమర్షిషం-అమర్షిష్వ-అమర్షిష్మ | అమర్షిష్యం-అమర్షిష్యావ-అమర్షిష్యామ |

| 1 | 2 | 3 | 4 |
| --- | --- | --- | --- |
| చిఞ్=చయనే<br>ప్రోగు<br>చేయుట | చేతా-చేతారౌ-చేతారః<br>చేతాసి-చతాస్థః-చేతాస్థ<br>చేతాస్మి-చేతాస్వః-చేతాస్మః | అచైషీత్-అచైష్టాం-అచైషుః<br>అచైషీః-అచైష్టం-అచైష్ట<br>అచైషం-అచైష్వ-అచైష్మ | అచేష్యత్-అచేష్యతాం-అచేష్యన్<br>అచేష్యః-అచేష్యతం-అచష్యత<br>అచేష్యం-అచేష్యావ-అచేష్యామ |
| నుద=ప్రేరణే | నోత్తా-నోత్తారౌ-నోత్తారః<br>నోత్తాసి-నోత్తాస్థః-నోత్తాస్థ<br>నోత్తాస్మి-నోత్తాస్వః-నోత్తాస్మః | అనుదత్-అనుదతామ్-అనుదన్<br>అనదః-అనుదతం-అనుదత<br>అనుదం-అనుదావ-అనుదామ<br>అనౌత్సీత్-అనౌత్తాం-అనౌత్సుః<br>అనౌత్సీః-అనౌత్తమ్-అనౌత్త<br>అనౌత్సం-అనౌత్స్వ-అనౌత్స్మ | అనోత్స్యత్-అనోత్స్యతామ్-అనోత్స్యన్<br>అనోత్స్యః-అనోత్స్యతమ్-అనోత్స్యత<br>అనోత్స్యం-అనోత్స్యావ-అనోత్స్యామ<br>ఈ ధాతువుకు 'లిఙ్' లకారంలో రెండు రకాల రూపాలుండటం గమనించండి. ఇలా కొన్ని ధాతువులకుంటాయి. |
| రుధిర్=<br>ఆవరణే<br>అడ్డుట, కప్పుట | రోద్ధా-రోద్ధారౌ-రోద్ధారః<br>రోద్ధాసి-రోద్ధాస్థః-రోద్ధాస్థ<br>రోద్ధాస్మి-రోద్ధాస్వః-రోద్ధాస్మః | అరుధత్-అరుధతాం-అరుధన్<br>అరుధః-అరుధతమ్-అరుధత<br>అరుధం-అరుధావ-అరుధామ<br>అరౌత్సీత్-అరౌద్ధాం-అరౌత్సుః<br>ఇత్యాది రూపాలు పైలాగా చెప్పాలి. | అరోత్స్యత్-అరోత్స్యతాం-అరోత్స్యన్<br>అరోత్స్యః-అరోత్స్యతం-అరోత్స్యత<br>అరోత్స్యమ్-అరోత్స్యావ-అరోత్స్యామ |
| భుజ=పాల<br>నాభ్యవహార<br>యోః.<br>భుజించుట | భోక్తా-భోక్తారౌ-భోక్తారః<br>ఇత్యాదులు | అభైక్షీత్-అభైక్తాం-అభైక్షుః<br>ఇత్యాదులు | అభోక్ష్యత్-అభోక్ష్యతాం-అభోక్ష్యన్<br>ఇత్యాదులు |
| లూఞ్=ఛేదనే-<br>ఛేదించుట | లవితా-లవితారౌ-లవితారః | అలావీత్-అలావిష్టాం-అలావిషుః | అలవిష్యత్-అలవిష్యతాం-అలవిష్యన్ |
| కథ=వాక్య<br>ప్రబంధే-మాటాడుట | కథయితా-కథయితారౌ-కథయి<br>తారః-ఇత్యాదులు | అచకథత్-అచకథతాం-అచకథన్ | అకథయిష్యత్-అకథయిష్యతాం-<br>అకథయిష్యన్-ఇత్యాదులు |

| 1 | | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| దివాదిగణం | | | | | |
| నృతీ=గాత్ర విక్షేపే | నృత్యము చేయుట | నృత్యతి-నృత్యతః-నృత్యంతి | ననర్త-ననృతతుః-ననృతుః | నర్తిష్యతి-నర్తిష్యతః-నర్తిష్యంతి | నృత్యతు నృత్యతాం-నృత్యంతు |
| | | నృత్యసి-నృత్యథః-నృత్యథ | ననర్తిథ-ననృతథుః-ననృత | నర్తిష్యసి-నర్తిష్యథః-వర్తిష్యథ | నృత్యతాత్ నృత్య-నృత్యతాత్-నృత్యతం-నృత్యత |
| | | నృత్యామి-నృత్యావః నృత్యామః | ననర్త-ననృతివ-ననృతిమ | నర్తిష్యామి-నర్తిష్యావః నర్తిష్యామః | నృత్యాని-నృత్యావ-నృత్యామ |
| పుష=పుష్టే | పుష్టి | పుష్యతి-పుష్యతః-పుష్యన్తి | పుపోష-పుపుషతుః-పుపుషుః | పోక్ష్యతి-పోక్ష్యతః-పోక్ష్యన్తి | పుష్య పుష్యతాత్-పుష్యతాం-పుష్యన్తు |
| | | పుష్యసి-పుష్యథః-పుష్యథ | పుపోషిథ-పుపుషథుః-పుపుష | పోక్ష్యసి-పోక్ష్యథః-పోక్ష్యథ | పుష్య పుష్యతాత్-పుష్యతం-పుష్యత |
| | | పుష్యామి-పుష్యావః-పుష్యామః | పుపోష-పుపుషివ-పుపుషిమ | పోక్ష్యామి-పోక్ష్యావః-పోక్ష్యామః | పుష్యాణి-పుష్యావ-పుష్యామ |
| తుదాదిగణం | | పృచ్ఛతి-పృచ్ఛతః-పృచ్ఛంతి | పప్రచ్ఛ-పప్రచ్ఛతుః-పప్రచ్ఛుః | ప్రక్ష్యతి-ప్రక్ష్యతః-ప్రక్ష్యన్తి | పృచ్ఛతు పృచ్ఛవాత్-పృచ్ఛతాం-పృచ్ఛన్తు |
| ప్రచ్ఛ. జీప్సా యామ్ | ప్రశ్నించుట | పృచ్ఛసి-పృచ్ఛథః-పృచ్ఛథ | పప్రచ్ఛిథ పప్రష్ఠ-పప్రచ్ఛథుః-పప్రచ్ఛ | ప్రక్ష్యసి-ప్రక్ష్యాథః-ప్రక్ష్యాథ | పృచ్ఛ పృచ్ఛతాత్-పృచ్ఛతం-పృచ్ఛత |

ఈ ధాతురూపాల్లో పోలికలు గమనించండి. ఏదైనా గ్రంథంలో ఉన్న రూపాలు గుర్తించడానికి ప్రయత్నించండి. ఆత్మనే దాతువులు ఒక్కటి మాత్రం ఇవ్వడం జరుగుతున్నది. వీటిని బట్టి ఇలాంటి రూపాలు కనిపించినప్పుడు, పోలికను గుర్తించవచ్చు. మూడుపురుషుల్లో, 3వచనాల్లో భూధాతువులాగానే ఉంటాయి. చివళ్ల మాత్రమే మారుతాయి.

| 1 | 2 | 3 (ఏక ద్వి బహు) | 4 |
|---|---|---|---|
| లట్= | శుభ=దీప్తౌ | ప్ర.పురుష. శోభతే-శోభేతే-శోభన్తే | ఏథ్-ఏథతే వృద్ధి చెందుతున్నది/చున్నాడు |
| వర్తమాన | ప్రకాశించుట | మధ్యమ.పు. శోభసే-శోభేథే- శోభధ్వే | దుహ్=పితుకుట-దుగ్ధే=పితుకుతున్నాడు. |
| కాలం | | ఉత్తమ.పు శోభే-శోభావహే-శోభామహే | విద్=సత్తాయామ్-ఉండుట-విద్యతే ఇత్యాదులు. |
| | | | వాక్యప్రయోగాలు చూడండి. |
| లిట్= | ప్ర.పురుష | శశుభే-శుశుభాతే-శుశుభిరే | సర్వేషు ఋతుషు వసన్తః నితరాం శోభతే |
| పరోక్ష | మధ్యమ.పు | శుశుభిషే-వుశుభాథే-శుభుభిధ్వే | అన్ని ఋతువుల్లోను వసన్తం బాగా శోభిస్తున్నది. |
| భూతకాలం | ఉత్తమ.పు | శుశుభే-శుశుభివహే-శుశుభిమహే | దశరథ పత్నీషు-రామజననీ - కౌసల్యా- శుశుభే |
| | | | దశరథునిభార్యల్లో - రామునితల్లి - కౌసల్య శోభించిన దట. |
| లుట్= | ప్ర.పు | శోభితా-శోభిభితారౌ-శోభితారః | కృతవిద్యస్య-జీవనం-సర్వదా-శోభితా |
| అనద్య | మ.పు. | శోభితాసే-శోభితాసాథే-శోభితాధ్వే | చదువుకున్నవాని జీవనం ఎల్లప్పుడూ శోభించగలదు. |
| తన భవి | ఉ.పు | శోభితాహే-శోభితాస్వహే-శోభితాస్మహే | కృతవిద్యాశ్చ-వయం-శోభితాస్మహే |
| ష్యత్కాలం | | ప్రస్తుతం 24గం॥తరువాత భూతకాలంలోనే వాడాలి. | చదువుకున్న మనం శోభింపగలము. |

| 1 | 2 | 3 |
|---|---|---|
| ల్రుట్= సాధారణ భవిష్యత్కాలం | ప్ర.పు. | శోభిష్యతే-శోభిష్యేతే-శోభిష్యన్తే |
| | మ.పు. | శోభిష్యసే-శోభిష్యేథే-శోభిష్యేధ్వే |
| | ఉ.పు. | శోభిష్యే-శోభిష్యావహే-శోభిష్యామహే |
| లోట్= విధ్యాశీరర్థాలలో- | ప్ర.పు | శోభతాం-శోభేతాం-శోభన్తాం |
| | మ.పు. | శోభస్వ-శోభేథాం-శోభధ్వమ్ |
| | ఉ.పు. | శోభై-శోభావహై-శోభామహై |
| | | దేన్నైనా విధించేటప్పుడు ఆశీర్వదించేటప్పుడు వాడాలి. |
| లఙ్ అనద్యతన భూతార్థం | ప్ర.ప. | అశోభేత-అశోభేతాం-అశోభన్త |
| | మ.పు. | అశోభథాః-అశోభేథాం-అశోభధ్వం |
| | ఉ.పు. | అశోభే-అశోభావహి-అశోభామహి |
| లిఙ్ విధి మొదలైన అర్థాలలో | ప్ర.పు. | శోభేత-శోభేయాతాం-శోభేరన్ |
| | మ.పు. | శోభేథాః-శోభేయాథాం-శోభేధ్వం |
| | ఉ.పు. | శోభేయ-శోభేవహి-శోభేమహి |

4

విద్యాయాఃవినయః అలంకరాభావేన శోభిష్యతే
విద్యకు - వినయం-అలంకారంగా శోభించగలదు.
వర్షాసు - కుందకుసుమాని నశోభిష్యన్తే
వర్షాకాలంలో బొండు మల్లెలు - శోభింపవు.
గృహాంగణేషు కుసుమలతాః శోభన్తాం
ఇళ్ల ముంగిళ్ళలో పూలలతలు శోభించునుగాక.
బహుభిః సద్గుణైః త్వం శోభస్వ
అనేక - సద్గుణాలతో నీవు శోభించుము.
దశరథః పురుషార్థైఃఇవ చతుర్భిః పుత్రైః - అశోభత - కిల
దశరథుడు పురుషార్థాలవలె నలుగురు పుత్రులతో
శోభించెను కదా!
గ్రామాః పురాప్రశాన్తజీవనేన అశోభన్త
గ్రామాలు వెనక ప్రశాన్త జీవనంతో శోభించినవి.
యది అహం ధనీ భవయేయం తర్హి ధర్మేణ శోభేయం.
ఒకవేళ నేను ధనవంతుణ్ణైతే అప్పుడు ధర్మంతో శోభింతును.
యదావయం వివేకినో భవేమ తథా సుఖేన శోభేమ
ఎప్పుడు మనం వివేకులం అవుతామో అప్పుడు సుఖాలతో శోభింతుము.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| లిజ్=<br>ఆశీరర్థం<br>లో | ప్ర.పు.<br>మ.పు.<br>ఉ.పు. | శోభిషీష్ట-శోభిషీయాస్తాం-శోభిషీరన్<br>శోభిషీష్ఠాః-శోభిషీయాస్థాం-శోభిషీధ్వం<br>శోభిషీయ-శోభిషీవహి-శోభిషీమహి | దేశః అయం సుభిక్షేణ శోభిషీష్ఠ<br>ఈదేశం సుభిక్షంతో శోభించునుగాక.<br>జనాః ధార్మికాః సంతః శోభిషీరన్<br>జనులు ధార్మికులై యుంటూ శోభింతురుగాక. |
| లుజ్=<br>సాధారణ<br>భూత<br>కాలంలో | ప్ర.పు.<br>మ.పు.<br>ఉ.పు. | అశోభిష్ట-అశోభిషాతాం-అశోభిషత<br>అశోభిష్ఠాః-అశోభిషాథాం-అశోభిఢ్వమ్<br>అశోభిషి-అశోభిష్వహి-అశోభిష్మహి | హనుమతో మథనాత్ పూర్వమ్ అశోకవనితా అశోభిష్ఠ<br>హనుమంతుని మథనానికి ముందు అశోకవనం శోభించినది.<br>అస్మదీయాః ప్రాచీనా దీర్ఘాయుషా అశోభిషత<br>మన ప్రాచీనులు దీర్ఘాయుస్సుతో శోభించిరి. |
| ల్రుజ్=<br>క్రియాతి<br>పత్తి అనే<br>అర్థంలో | ఇది ఇలా<br>అయింటే<br>అది అలా<br>అయేది అనే అర్థం | అశోభిష్యత-అశోభిష్యేతాం-అశోభిష్యంత<br>అశోభిష్యథాః-అశోభిష్యతాం-అశభిషధ్యం<br>అశోభిష్యే-అశోభిష్యావహి-అశోభిష్యామహి | యది దావాగ్నిః నాభవిష్యత్ తర్హివనాని అశోభిష్యన్త<br>ఒకవేళ కార్చిచ్చు లేకపోయి ఉంటే అప్పుడు వనాలు శోభించి ఉండేవి.<br>యది శ్రమజీవీ అభవిష్యం తర్హిధనీ అశోభిష్యే<br>ఒకవేళ శ్రమజీవినై ఉండి ఉంటే అప్పుడు ధనవంతుడనై శోభించేవాణ్ణి |

ఇంతవరకూ ఇచ్చిన ఈ పది లకారాలను భూధాతువు దగ్గర పురుషలకు వచనాలకు అర్థం చెప్పుకున్నట్లే పోల్చి అర్థం చెప్పుకోవచ్చు. ఈ ధాతువును బట్టి ఇలాంటి వాటిని ప్రయోగాల్లో గుర్తించవచ్చు. కొన్ని ధాతువులను పరస్మై పదులుగాన ఆత్మ పదాలుగాను ప్రయోగించవచ్చు. ధాతువుల(Root)కు అర్థాలు మారుతున్నా, చివరగల భాగాలకు అర్థాలు మారవు.

# ధాతువుల విశేషరూపము

ఇంతవరకూ ధాతువులకు ఇవ్వబడిన దశ విధలకాలురాలు మాత్రమే కాక కొన్ని విశేష ప్రయోగాలు కూడా ఉన్నాయి. వాటిని సంగ్రహంగా తెలిసికోవడం అవసరం.

## 1. హేతు మణ్ణిజంత ప్రయోగాలు

ఏదైనా ఒక పనిని (క్రియను) ఒక 'కర్త' చేస్తున్నప్పుడు ఒక క్రియా పదాన్ని ప్రయోగిస్తాం. దానిని ఇంకొకరు ప్రేరిస్తున్నట్లు తెలియజేయాలి అనుకొన్నప్పుడు, ఆ ప్రేరణార్థాన్ని తెలియజేసే 'ణిచ్' అనే ప్రత్యయం చేర్చవలసి ఉంటుంది. ధాతువుకు 'ణిచ్' అనే ఒక ప్రేరణార్థకమైన ప్రత్యయాన్ని చేరిస్తే - అప్పుడు ప్రేరణార్థకమైన ధాతవుగా అది మారిపోతుంది. దానికి పదిలకాలరాలలోను మిగిలిన సాధారణ ధాతువుల్లాగానే ప్రయోగాలు చేయవచ్చు. అన్ని చోట్ల ప్రేరించడం అనే అర్థం దానిచేత ప్రధానంగా బోధింపబడుతూ ఉంటుంది.

భూధాతువు ప్రేరణార్థంలో 'భావి' అనే ధాతువుగా మారుతుంది. ఈ క్రింది ఉదాహరణాలుచూడండి.

రామః భునక్తి - రాముడు తినుచున్నాడు. ఇది సాధారణ ప్రయోగం. దీన్ని ప్రేరణార్థంలోనికి మారిస్తే -

దేవదత్తః రామం భోజయతి - దేవదత్తుడు రాముని తినునట్లు ప్రేరించుచున్నాడు అని అవుతుంది.

ఇక్కడ 'భుజ్'=తినుట అనే ధాతువుకు వర్తమాన కాలంలో 'భునక్తి' తినుచున్నాడు. అని, ఇలాగ మిగతారూపాలను రుధాది గణంలోని దాతువుల్లాగా రూపాలు కలిగి ఉంటుంది. పరస్మై పదిధాతువులకు సంబంధించిన టేబుల్ 'భిద్' ధాతువును చూడండి) ఇదే ధాతువుకు ప్రేరణార్థంలో 'ణిచ్' ప్రత్యయం చేరిస్తే, ఈణిచ్ ప్రత్యయంలో 'ఇ' అనే అచ్చు మాత్రమే మిగిలి ఉంటుంది. అప్పుడు.

ఉదా :-భుజ్ + ణిచ్ (ఇ) = భోజి అని ప్రేరణార్థకమైన ధాతువు తయారౌతుంది. ఇలా తయారైన 'భోజి' ధాతువును 'చురాదిగణం' లోని 'చుర్'అనే ధాతువులాగా ప్రయోగించాలి. ఈ విధంగా ఏ గణానికి చెందిన ప్రేరణార్థక 'ణిచ్' ప్రత్యయం చేర్చి పది లకారాలలోను ధాతువుకైనా రూపాలు తయారు చేయవచ్చు.

| | లట్ | లిట్ | లుట్ | ల్రుట్ | లోట్ | లఙ్ | విధిలిఙ్ | ఆశీర్లిఙ్ | లుఙ్ | ల్రుఙ్ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| భూ-భావి | భావయతి | భావయామాస | భావయితా | భానయిష్యతి | భావయతు | అభావయత్ | భావయేత్ | భావ్యాత్ | అబీభవత్ | అభావిష్యత్ |
| విద్-వేది | వేదయతి | నేదయామాస | వేదయితా | వేదయిష్యతి | వేదయతు | అవేదయత్ | వేదయేత్ | వేద్యాత్ | అవీవదీత్ | అవేదయిష్యత్ |
| అర్చ్-అర్చి | అర్చయతి | అర్చయామాస | అర్చయితా | అర్చయిష్యతి | అర్చయతు | ఆర్చయత్ | ఆర్చయేత్ | అర్చ్యాత్ | ఆర్చిచత్ | అర్చయిష్యత్ |
| గమ్-గమి | గమయితి | గమయామాస | గమయితా | గమయిష్యతి | గమయతు | అగమయత్ | గమయేత్ | గమ్యాత్ | అజీగమత్ | అగరయిష్యత్ |
| కృ-కారి | కారయతి | కారమాయాస | కారయితా | కాయిష్యతి | కారయతు | అకారయత్ | కారయేత్ | కార్యాత్ | అచీకరత్ | అకారయిష్యత్ |
| ద్యుత్-ద్యోతి | ద్యోతయతి | ద్యోతయామాస | ద్యోతయితా | ద్యోతయిష్యతి | ద్యోతయతు | అద్యోతయత్ | ద్యోతయత్ | ద్యోత్యాత్ | అదిద్యుతత్ | అద్యోతిష్యత్ |
| పా-పాయి | పాయయతి | పాయయామాస | పాయయితా | సాయయిష్యతి | పాయయతు | అపాయయత్ | పాయయేత్ | పాయ్యాత్ | అపీప్యత్ | అపాయయిష్యత్ |
| ఘట్-ఘటి | ఘటయతి | ఘటయామాస | ఘటయితా | ఘటయిష్యతి | ఘటయతు | అఘటయత్ | ఘటయేత్ | ఘట్యాత్ | అజీఘటత్ | అఘటయిష్య |
| దీప్-దీపి | దీపయతి | దీపయామాస | దీపయితా | దీపయిష్యతి | దీపయతు | అదీపయత్ | దీపయేత్ | దీప్యాత్ | అదీదిపత్ | అదీపయిష్యత్ |
| తుద్-తోది | తోదయతి | తోదయామాస | తోదయితా | తోదయిష్యతి | తోదయత | అతోదయత్ | తోదయాత్ | తోద్యాత్ | అతూతుదత్ | అతోదయిష్య |
| మృ-మారి | మారయతి | మారయామాస | మారయితా | మారయిష్యతి | మారయతు | అమారయత్ | మారయేత్ | మార్యాత్ | అమీమరత్ | అమారయిష్య |
| గ్రహ్-గ్రాహి | గ్రాహయతి | గ్రాహయామాస | గ్రాహయితా | గ్రాహయిష్యతి | గ్రాహయతు | అగ్రాహయత్ | గ్రాహయేత్ | గ్రాహ్యాత్ | అజిగ్రహత్ | అగ్రాహయిష్య |
| పూ-పావి | పావయతి | పావయామాస | పావయితా | పావయిష్యతి | పావయతు | అపావయత్ | పావయేత్ | పావ్యాత్ | అపీపవత్ | అపావయిష్యత్ |

వీటిని వాక్యాల్లో ప్రయోగిస్తే ఎలా ఉంటాయో చూడండి.

1. ఉపాధ్యాయః శిష్యాన్ శాస్త్రం వేదయతి - ఉపాధ్యాయుడు శిష్యులకు శాస్త్రం తెలిసికొనజేయుచున్నాడు.
2. సూర్యః జగత్ దీపయతి - సూర్యుడు లోకాన్ని వెలిగింప జేస్తున్నాడు.
3. చాణక్యః చంద్రగుప్తేన నందాన్ మారయామాస - చాణక్యుడు చంద్రగుప్తునిచే నందులను చంపించెనట.
4. మాతా శిశుం స్తన్యం పాయయతి - తల్లి పిల్లకు స్తన్యమును త్రాగించుచున్నది.
5. అర్జునః కృష్ణేన అశ్వాన్ అతూతుదత్ - అర్జునుడు కృష్ణునిచే గుర్రాలను తోలించెను.
6. ప్రభవః ప్రజాభిః నయం గ్రాహయన్తి - ప్రభువులు ప్రజలచే నీతిమార్గాన్ని గ్రహింపచేస్తున్నారు.
7. సునీతిః ధ్రువేన విష్ణుమ్ ఆర్చయత్ - సునీతి (ధ్రువునితల్లి) ధ్రువునిచే విష్ణువును అర్చింపజేసినది.
8. చంద్రమాః జ్యోత్స్నయా రాత్రౌ ఆకాశం ద్యోతయతి - చంద్రుడు వెన్నెలచే రాత్రియందు ఆకాశం ప్రకాశింప చేస్తాడు.
9. గురుః శిష్యేణ తత్త్వం గ్రాహయేత్ -గురువు శిష్యునిచే తత్త్వాన్ని గ్రహింప జేయాలి.
10. గంగా జలేన లోకాన్ పావయతి - గంగ జలంచేత లోకాలను పవిత్రీకరింప జేస్తున్నది.
11. కంసః పూతయా శిశూన్ అమీమరత్ - కంసుడు పూతనచే శిశువులను చంపించెను.
12. వైశ్వర్యమ్ జనైః సుఖాని అనుభావయతి - ఐశ్వర్యం జనులచే సుఖాలను అనుభవింప జేస్తుంది.
13. ఆశా జీవనం గమయిష్యతి - ఆశ బ్రతుకును గడుపునట్లు చేస్తుంది.
14. విద్యా అజ్ఞానినాం బుద్ధీః దీపయతు విద్య అజ్ఞానుల యొక్క బుద్ధులను ప్రకాశింప జేయునుగాక.

# సన్నంత ప్రయోగాలు

ఏదైనా క్రియను చేయాలని కోరినప్పుడు ఆ కోరికను బోధించడానికి ఏధాతువుకైనా 'సన్' అనే ప్రత్యయం చేర్చాలి. ఇలా చేర్చినందువల్ల 'ణిచ్' ప్రత్యయంతో క్రొత్త ధాతువు ఏర్పడినట్లు - ఇక్కడ కూడా క్రొత్తధాతువులు ఏర్పడతాయి. ఈ ధాతువులను "సన్నంత ధాతువులు" అని అంటారు. అలా ఏర్పడిన 'సన్నంత' ధాతువులను ణిజంత ధాతువుల్లాగానే దశలకారాలలో ప్రయోగింపవచ్చు. అయితే ప్రధానంగా వర్తమానకాలంలో 'లట్' ప్రయోగాలు, భూత కాలానికి చెందిన 'లఙ్' లకారానికి చెందిన ప్రయోగాలు గుర్తిస్తే చాలు. చూడండి.

| ధాతువు | లట్<br>వర్తమానకాలం | లఙ్<br>భూతకాలం | వాక్యప్రయోగాలు |
|---|---|---|---|
| భూ+స | బుభూషతి | అబుభూషత్ | అజ్ఞానీ అపి మంత్రీ బుభూషతి - అజ్ఞానికూడా మంత్రి కావాలని అనుకుంటున్నాడు.<br>దశరథః పితా అబుభూషత్ - దశరథుడు తండ్రి కాగోరెను. |
| దా+స | దిత్సతి | అదిదిత్సత్ | ఉపాధ్యాయః శిష్యాయ విద్యాం దిత్సతి - ఉపాధ్యాయుడు శిష్యుని కొరకు విద్యను ఈయ గోరుచున్నాడు.<br>కైకేయీ భరతాయ రాజ్యమ్ అదిదిత్సత్ - కైకేయి భరతుని కొరకు రాజ్యమును ఈయకోరినది. |
| పచ్+స | పిపక్షతి | అపిపక్షత్ | దేవదత్తః శాకం పిపక్షతి - దేవదత్తుడు ఆకుకూరను వండగోరుచున్నాడు.<br>గృహిణీ అన్నమ్ అపిపక్షత్ - ఇల్లాలు అన్నమును వండగోరెను. |
| క్రీ+స | చిక్రీషతి | అచిక్రీషత్ | ధనీ కారవాహనమ్ చిక్రీషతి - ధనవంతుడు కారును కొనదలచును.<br>భక్తాః భగవన్తం భక్త్యా అచిక్రీషన్ - భక్తులు భగవంతుని భక్తితో కొనదలచిరి. |

## ఇలాగే మరికొన్ని విశేష ధాతు ప్రయోగాలు చూడండి.

'క్యచ్' ప్రత్యయాంత ధాతువులు : సుబంత శబ్దాలపైన 'క్యచ్' ప్రత్యయం చేయడం వల్ల క్యజన్త ధాతువులు ఏర్పడతాయి. ఈ క్యచ్ అనే ప్రత్యయం తనకు కావాలని కోరడం, అట్లుగా ఆచరించుట ప్రవర్తించుట అనే అర్థాల్లో చేర్చబడుతుంది. ఈ క్రింది ప్రయోగాలు చూడండి. పుత్రమ్ ఆత్మనః ఇచ్ఛతి - పుత్రుడు తనకు కావాలని కోరుతున్నాడు. అనే అర్థంలో పుత్ర' అనే సుబన్త శబ్దం ప్రక్కన క్యచ్ అనే ప్రత్యయం చేరిస్తే 'క్యచ్' ప్రత్యయంలో 'య' మిగులుతుంది.

'పుత్ర+య' ఈ రెండూ కలిస్తే మధ్యలో కొన్ని మార్పులు జరిగి "పుత్రీయ' అనే ధాతువు ఏర్పడుతుంది. పుత్రుని తనకు కావాలని కోరుట అని దీని అర్థం. ఇలా ఎన్ని ధాతువులైనా తయారుచేయవచ్చు. ఇలాగే గృహీయ, వనీయ మొ॥

లట్ -పుత్రీయతి - తనుకు పుత్రుడుకావలని కోరుతున్నాడు.
లిట్ - పుత్రీయామాస - ,, ,, కోరెనట.
లృట్ - పుత్రీయిష్యతి - ,, ,, కోరగలడు.
లజ్ - అపుత్రీయత్ - ,, ,, కోరెను.
లోట్ - పుత్రీయతు - ,, ,, కోరునుగాక.

గృహీయతి వనే - గృహమందువలె ఆచరిస్తున్నాడువనంలో.
వనీయతి గృహే = వనంలోలాగా ఆచరిస్తున్నాడు గృహంలో
మిగతాలకారాలన్నీ ఇలాగే తయారు చేసుకోవచ్చు.

ఇటువంటివే మరికొన్ని ప్రత్యయాలున్నాయి. వాటికి కూడా క్యచ్ ప్రత్యయంలాగా సుబన్త పదాలతో చేర్చినప్పుడు అనేక "నామధాతువులు " తయారౌతాయి. కొన్ని ఉదాహరణాలలో చూడండి.

| ప్రత్యయ! | ఏర్పడేరూపం | సంస్కృతప్రయోగం | తెలుగు అర్థం. |
|---|---|---|---|
| కామ్యచ్ | పుత్ర+కామ్య=పుత్రకామ్యతి | దశరథః పుత్రకామయామాస(లిట్) | దశరథుడు తనకు పుత్రులుకావాలనికోరెనట. |
| | యశస్+కామ్య=యశస్కామ్యతు | సర్వోఽపియశస్కామ్యతు(లోట్) | ప్రతివ్యక్తి తనకు కీర్తికావాలని కోరునుగాక. |
| క్యఙ్ | కృష్ణ+క్యఙ్=కృష్ణాయతే (ఈప్రత్యయం చేరిస్తే ఆత్మనే పదిరూపాలే ఏర్పడతాయి) | గోపికాః కృష్ణాయన్తే(లట్) | గోపికలు కృష్ణునివలె ఆచరిస్తున్నారు. (వ్యవహరిస్తున్నారనిభావం) |
| | ఇక్కడతపశ్శబ్దంకంటేపరస్మై పదలకారంవస్తుంది. తపస్+క్యఙ్=తపస్యతి | పార్వతీ హిమవతి తపస్యతి వనేషుఋషయఃతపస్యంతి= | పార్వతిహిమాలయంలో తపస్సుచేస్తున్నది. వనాలలోఋషులుతపస్సుచేస్తున్నారు |
| | కుమారీ+క్యఙ్=కుమారాయతే | బాలాః కుమారాయన్తే | బాలురు కన్యకలవలె ఆచరిస్తున్నారు. |
| క్యష్ | గృహ+క్యష్=గృహాయతే (గృహముకానిది గృహమువలె ఆచరించుట అని అర్థం) | గృహాయన్తే వనాని కారాగాయతే గృహమ్ | గృహముకానివనాలు గృహాలలా ఆచరిస్తున్నాయి. కారాగారంకాని, గృహం, కారాగారంలా ఆచరిస్తున్నది. |
| క్విప్ | కవి+క్విప్(క్విప్ప్రత్యయం పూర్తిగాలోపిస్తుంది.క్విప్ప్రత్యయం | ఛందోఽనభిజ్ఞాః కవయన్తిలోకే. | ఛందస్సు తెలియనివారు లోకంలోకవులుగా ఆచరిస్తున్నారు. |

| | | | |
|---|---|---|---|
| | ఆచరించుట అనే అర్థంలో వస్తుంది)కవయతి,పితరేత్ మాలాంతి, భవతి. | ప్రభుః ప్రజానామ్ పితరేత్ బలాకాః ఆకాశేమాలాన్తి | ప్రభువు ప్రజలకు తండ్రివలె ఆచరించాలి. కొంగలబారు ఆకాశంలో మాలలా ఆచరిస్తున్నది. |
| | రాజాశవ ఆచరతిరాజు లా ఆచరిస్తున్నాడు అనే అర్థంలో క్విప్. | ఖం సైన్యధూల్యా భవతి(భూరి వ ఆచరతి) | ఆకాశం సైన్యధూళిచేత భూమిలా ఆచరిస్తున్నది. |
| | రాజన్+క్విప్=రాజానతి | ప్రజాస్వామ్యే సర్వోఽపిరాజానతి | ప్రజాస్వామ్యంలో ప్రతివ్యక్తిరాజువలె ఆచరించును. |
| యఙ్ | యఙ్ అనే ప్రత్యయం మాటిమాటికి, లేదా, అతి శయం అనేఅర్థంలో వస్తుంది | వైకుంఠే విష్ణుః బోభూయతే | వైకుంఠంలో విష్ణువు అతిశయముగా ఉన్నాడు. |
| | | సంసారచక్రం వేగేన చంక్రమ్యతే | సంసారచక్రం వేగంగామాటిమాటికినడుస్తున్నది (తిరుగుతున్నది) |
| | భూ+యఙ్=బోభూయతే క్రమ్+యఙ్=చంక్రమ్యతే జప్+యఙ్=జంజప్యతే. | మంత్రః ఋషిణా జంజప్యతే | మంత్రము ఋషిచేమాటిమాటికి జపింపబడు తున్నది. |

# ప్రాచీన భూ విజ్ఞానం

(ఉపసర్గలతో ధాతువులను కూర్చడం ఈ పాఠం ద్వారా నేర్చుకుందాం)

ఇంతవరకూ సుబన్తశబ్దాలను, కారకప్రయోగాలను, ధాతువులను ఏర్పడే క్రియాపదాలను గురించి చెప్పుకున్నాం. క్రియాపదాలకు ముందు ఉపసర్గలు (Prefixes) అని కొన్ని చేర్చబడుతూ ఉంటాయి.వాటి వల్ల ధాతువుల అర్థాలుమారిపోతాయి. పెద్దలు ఇలా చెప్పారు.

**ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యత్రనీయతే, విహారాహార సంహార ప్రహార పరిహారవత్ ॥**

అని 'ఉపసర్గం' అనేది ధాతువుకు (క్రియాపదానికి) ఉన్న అర్థాన్ని బలాత్కారంగా మార్చివేస్తుంది.

'హార' అనే ఒక ధాతురూపానికి ఉపసర్గములనే ఈ శబ్దరూపాలకు ముందు చేరిస్తే అర్థాలు ఎలామారాయో గమనిస్తే 'ఉపసర్గలకు ఉన్న బలం ఎంతటిదో తెలుస్తుంది. ఈ ఉపసర్గలు.

1. ప్ర 2. పరా 3. అప 4. సమ్ 5.అను 6.అవ 7. నిస్ 8.నిర్ 9.దుస్ 10.దుర్ 11.వి 12. ఆఙ్ 13.ని 14. అధి 15.అపి 16.అతి 17.సు 18. ఉత్ 19.అభి 20.ప్రతి 21. పరి 22. ఉప అనేవి.

ఇప్పుడు 'హరతి' హరించుచున్నాడు. అనే ధాతువుకు ఉపసర్గలు చేరిస్తే అర్థాలు ఎలా మారాయో గమనించండి.

వి+హరతి = విహరించుచున్నాడు - ప్ర+హరతి = కొట్టుచున్నాడు. సమ్+హరతి = చంపుచున్నాడు; - ఆ+హరతి = తినుచున్నాడు; తెచ్చుచున్నాడు.

అను+హరతి = అనుకరించుచున్నాడు; పరి+హరతి = విడచుచున్నాడు. ఉప+హరతి=సమర్థించుచున్నాడు. అప+హరతి = దొంగిలించుచున్నాడు. ఈ 22 ఉపసర్గలను వెనుక టేబుళ్లలో ఇచ్చిన ధాతువులకు ముందు చేరిస్తే ధాతువుల అర్థాలు విశేషంగా మారిపోతాయి. చూడండి. 'భవతి'కి ముందు చేర్చండి. భవతి = ఉన్నాడు.

ప్ర+భవతి= సమర్థుడగుచున్నాడు; అను+భవతి = అనుభవిస్తున్నాడు. పరా+భవతి = అవమానిస్తున్నాడు. సం+భవతి = పుట్టుచున్నాడు. ఉత్+భవతి= ఉద్భవతి= పుట్టుచున్నాడు. అభి+భవతి = తిరస్కరించుచున్నాడు. ఇలా దేనికైనా వీటిని చేర్చవచ్చు. ఇప్పుడు ప్రాచీన భూవిజ్ఞానానికి సంబంధించిన కొన్ని విశేషాలు తెలుసుకుందాం.

## పృథివీతత్త్వం - పరమాణువాదః

1. పృథివీ- జలతేజో - వాయూనాం చతుర్ణాం పరమాణవః కారణతయా వి+భావ్యంతే।
   భూమి - జలం - అగ్ని - వాయువు - అనే నాల్గింటికి పరమాణువులే కారణంగా భావింపబడుతున్నాయి.
2. అయం - పరమాణువాదః - కణాదమహర్షిణా - అతి ప్రాచీన కాలే అంగీకృతః సమ్+అభవత్.
   ఈ- పరమాణువాదం- కణాదమహర్షిచే - అతిప్రాచీనకాలంలో అంగీకరింపబడింది.
3. పరమాణు లక్షణమ్ ఏవం సం+గిరస్తే। పరమాణు లక్షణాన్ని ఇలా చెబుతున్నారు.
4. జాలాన్తరగతే, భానౌ యత్ సూక్ష్మం దృశ్యతే రజః ।
   కిటికీలో నుండి సూర్యుడు ప్రసరింపగా, ఏ - సూక్ష్మమైన ధూళి కనిపిస్తున్నదో
   తస్య త్రింశత్తమో భాగః పరమాణుః ప్ర+కీర్త్యతే ॥
   దానియొక్క 30వ భాగం పరమాణువుగా చెప్పబడుతున్నది.
5. త్రింశత్ పరమాణవః ఏకః త్రసరేణుః ఇతి ప్ర+కథయన్తి .
   ముప్పై పరమాణువులు ఒక్ త్రసరేణువు అని చెప్పుచున్నారు.

6. అణుద్వయ సంయోగాత్ ద్వ్యణుకం సం+పద్యతే.
రెండు అణువుల సంయోగం వల్ల ద్వ్యణుకం అనేది ఏర్పడుతుంది.

7. సృష్టిగతాః - సర్వే - పదార్థాః - పరమాణు నిర్మితాః ఇతి- వైశేషిక సిద్ధాన్తాత్ అవగమ్యతే। సృష్టిలో ఉన్న- అన్ని - పదార్థాలూ - పరమాణువుల చే నిర్మింపబడ్డాయి- అని - వైశేషికుల సిద్ధాన్తంవల్ల తెలుస్తున్నది.

8. వైశేషికాః - నైయాయి కాశ్చ- ప్రాచీన భారతీయ భౌతిక విజ్ఞానశాస్త్రకాః. సమవర్తన్త।
వైశేషికులు - నైయాయికులున్ను -ప్రాచీన భారతీయ భౌతికవిజ్ఞానశాస్త్రకారులై - ఉండిరి.

9. పరమాణుః కదాపి- విచ్ఛేత్తుం - నసుశక -ఇతి - తే - సం+గిరన్తే.
పరమాణువు - ఎప్పుడూ - విడగొట్టడానికి - వీలుకాదు - అని - వారు - అంటున్నారు.

10. పరమాణుః న వినశ్యతి। పరమాణుః - నిత్యః ఇతి వైశేషికాదయః - ప్ర+వదన్తి.
పరమాణువు నశించదు। పరమాణువు - నిత్యము - అని - వైశేషికాదులు - చెబుతున్నారు.

11. పార్థివ పరమాణుభిః పృథివీ - నిష్పన్నా ఇతి తేషాం వాదః - అవ+గమ్యతే -
పృథివి యొక్క పరమాణువులచే భూమి పుట్టింది - అని - వారి వాదం తెలుస్తున్నది.

12. మహర్షిణా కణాదేన ప్రణీతాని వైశేషిక సూత్రాణి - ఇమం వాదమ్ అవ+గమయన్తి.
మహర్షి అయిన కణాదునిచే వ్రాయబడిన వైశేషిక సూత్రాలు ఈ వాదాన్ని తెలియజేస్తున్నాయి.

13. సృష్టిదశాయాం - తత్తత్ పరమాణూనాం పరిస్పందనమ్ అదృష్టకారితమ్ - ఇతి - అపితే - ని+గదన్తి
సృష్టిదశలో - ఆయా పరమాణువు లకు - కల్గిన కదలిక - అదృష్టంవల్ల ఏర్పడింది. - అని - కూడా - వారు - చెబుతున్నారు.

14. తచ్చ - అణుస్పందన కారణమ్ - అదృష్టం - పరమాత్మా, ఏవ - ఇతి - ఉపనిషదః సం+దర్శయన్తి

ఈ అణుస్పందనానికి గల కారణమైన అదృష్టం అనేది - పరమాత్మయే - అని - ఉపనిషత్తులు - బాగా దర్శింపచేస్తున్నాయి.

15. అతః - పాంచభౌతిక జగతః కారణం పరమాత్మా ఏవఇతి వేదాన్త దర్శనస్య సు+దర్శనమ్.

అందువల్ల - పంచభూతాలతో కూడిన జగత్తుకు - కారణం - పరమాత్మమే అనేది వేదాన్త దర్శనము యొక్క మంచి దర్శనం

16. ఇయం - పృథివీ - సూర్యం పరితః భ్రమన్తీ గోలవిశేష ఇతి వేదాః ప్ర+వదన్తి।

ఈ - భూమి - సూర్యునిచుట్టూ పరిభ్రమించే గోళవిశేషం అని వేదాలు లెస్సగా చెబుతున్నాయి।

17. సూర్యసిద్ధాన్తనామ్ని - గ్రంథే - భూమిః 6 గోలాకారాఇతి; ఆకాశే - సూర్యశక్త్యా

సూర్యసిద్ధాన్తమనే పేరుగల - గ్రంథంలో - భూమి- గోళాకారం అని, ఆకాశంలో - సూర్యునిశక్తిచే

విధృతా - పరి + భ్రమతి ఇతిచ - అధస్తన శ్లోకః పరి+దర్శయతి.

పట్టుకొనబడి - పరిభ్రమిస్తున్నది. అని కూడా - ఈ క్రింది శ్లోకం దర్శింపజేస్తున్నది.

**"మధ్యే నమన్తాత్ అండస్య భూగోలో వ్యామ్ని తిష్ఠతి । బిభ్రాణః - పరమాం - శక్తిం - బ్రహ్మణో - ధారణాత్మికామ్ ॥**

'అండము' (బ్రహ్మాండమనే ఒక మహా విశ్వాంతరాళము) యొక్క మధ్యలో, ఆకాశంలో భూగోళం నిలబడి ఉంది. ఇది పరమాత్మ యొక్క ధారణశక్తిచే (ఇది సూర్యుని ఆకర్షణశక్తి)ఆశ్రయించి నిలబడి ఉంది. ఇక్కడ పరమాత్మ లేదా పరబ్రహ్మము చేత సృజింపబడిన సూర్యమండలమే పరమాత్మ. దానికి గల ఆకర్షణ శక్తియే పరబ్రహ్మశక్తి అని గుర్తించాలి.

18. "దాధర్థ - పృథివీమ్ అభితో మయూఖైః " - ఇతి వేద మంత్రః "మిత్రో దధార పృథివీమ్ " ఇతి మంత్రశ్చ సూర్యగతాభిః ఆకర్షణ శక్తిభిః పృథివీ అంతరిక్షే సంధ్రియతే ఇతి నిరూపయతః। "దాదర్థ....." అనే వేదమంత్రము, మిత్రోదధార" అనే మంత్రము ఈ రెండూ సూర్యునియందుగల ఆకర్షణ శక్తులచే పృథివి అంతరిక్షంలో పట్టి నిలుపబడుతున్నది అని నిరూపిస్తున్నాయి.

# ప్రాచీనం జలవిజ్ఞానమ్

(కృత్ ప్రత్యయాన్త శబ్దాల ప్రయోగం. కొన్నివిశేషాలు)

సంస్కృతభాషలో 'కృత్' అనే వ్యవహరింపబడే ప్రత్యయాలతో కూడిన శబ్దాలు చాలా ఉన్నాయి. మనం భాషలో సుబన్త పదాలుగా వాడే శబ్దాలు మూడువంతులు ఈ కృత్ ప్రత్యయాలతో ఏర్పడినవే. మనం తెలుగులో కూడా ఎన్నో శబ్దాలు వాడుతూ ఉంటాం. ఉదా: ఆ వృక్షం ఎంతో రమణీయంగా ఉంది. సఃవృక్షః అతీవ - రమణీయః అస్తి. ఈ వాక్యంలో వృక్షశబ్దం - రమణీయ శబ్దం రెండూ కృత్ ప్రత్యయాలను ధాతువులకు చేరిస్తే ఏర్పడ్డాయి. ఈ కృదంత శబ్దాలు క్రియలను బోధించే ధాతువులపై కృత్ ప్రత్యయాలు చేరిస్తే ఏర్పడతాయి. ఈ కృత్ ప్రత్యయాలు కొన్నివందలు ఉన్నాయి. ప్రధానమైన కొన్నిటిని ఈ ' ప్రాచీన జలవిజ్ఞానం ప్రకరంలో తెలుసుకుందాం.

1. "అగ్నీ షోమౌ బిభ్రత్యాపః" ఇతి తైత్తిరీయ బ్రాహ్మణ వచనమ్. ఆధునిక వైజ్ఞానిక భావనాం నిదర్శయతి :- 'అగ్ని+సోములనే దేవతలు జలాన్ని ధరిస్తారు' అనే వేదంలో ఒక భాగమైన తైత్తిరీయ బ్రాహ్మణంలోని మాట ఆధునిక వైజ్ఞానికుల భావనను దర్శింపచేస్తున్నది. ఇక్కడ 'అగ్ని'అంటే'Oxygen' అని, 'సోముడు' అంటే 'Hydrogen' అని గ్రహించాలి. (రెండు వాయువుల వల్ల జలం ఏర్పడున్నదని ఆధునిక వాదం)

2. అగ్నేః - ఆపః - సముద్భవన్తి - ఇతి -తైత్తిరీయ శ్రుతిః - వదతి.అగ్ని నుండి జలాలు పుడుతున్నాయి అని తైత్తిరీయ శ్రుతి చెబుతున్నది.

ఈరెండు వాక్యాల్లోను 1. వచనమ్ 2. శ్రుతిః అనే రెండు కృత్ ప్రత్యయాంతర శబ్దాలు చాలా ప్రధానమైనవి ఉన్నాయి. వచ్= ౨భాషణే, మాటాడుట అనే ధాతువు మీద, 'ల్యుట్' అనే కృత్ ప్రత్యయం చేరిస్తే - వచ్ =యు(ల్యుట్) అని ఉండగా 'యు' - 'అన'

గా మారింది. అంటే వచ్+అన= వచనం అయింది. ఘట్+(ల్యుట్) అన= ఘటన, పఠ్ + (ల్యుట్) అన= పఠన; గమ్+(ల్యుట్) అన=గమన. ఇలా ఎన్ని పదాలైనా తయారు చేయవచ్చు 1. భాషణం 2. రమణం 3. ధ్యానం 3. గానం 3. పానం 4. స్నానం 5. హసనం 6. ధావనం 7. దర్శనం 8. భోజనం 9. శయనం 10. స్పర్శనం 11. రసనం 12. వర్ధనం 13. గ్రహణం 14. ధారణం ఇలా భాషలో ఎన్నో పదాలు ఉన్నాయి. ఇవన్నీ 'ల్యుట్' (అన) అనే కృత్ ప్రత్యయం ఆయా ధాతువులకు చేర్చగా ఏర్పడినవే.

ఇలాగా "శ్రు" అనే దాతువుకు 'క్తిన్' అనే కృత్‌ప్రత్యయం చేరిస్తే శ్రు+తి= శ్రుతిః అనే పదం ఏర్పడింది. వినబడేది, వేదం అని అర్థం. శ్రుతి అంటే సంగీతంలోని నాదం కూడా అర్థమే. శ్రుతి అంటే 'చెవి' అని కూడా అర్థం. ఇలాగే - గమ్+(క్తిన్) తి=గతిః=నడక; రమ్+తి=రతిః - ప్రీతి; మన్+ తి= మతిః = ఆలోచన; జన్+తి+ జాతిః = పుట్టుక; దృశ్+తి= దృష్టిః =చూపు; నీ+తి=నీతిః -నీతి; బుధ్+తి=బుద్ధిః - బుద్ధి; ప్రీ+తి=ప్రీతిః=ఇష్టం; వచ్+తి= ఉక్తిః = మాట; ఇలాగే కీర్తి, గీతి, యతి, నతి, కృతి, భీతి, రీతి, విత్తి, నుతి, భూతి, హతి, భృతి, ఇలా ఎన్ని పదాలైనా ధాతువులపై తయారుచేయవచ్చు. ఇటువంటి శబ్దాలన్నీ ఇకారాన్త స్త్రీలింగాలేనని గ్రహించాలి.

3. ఆధునిక వైజ్ఞానికాః జలం ప్రాణవాయు (Oxygen) జలవాయ్వోః (Hydrogen) సమ్మిశ్రణాత్ సంజాతమ్ ఇతిమన్యంతే. ఆధునిక వైజ్ఞానకులు'జలం' ప్రాణవాయువు, ఉదజనుల రెంటియొక్క సమ్మేళనం వల్ల పుట్టింది. అని భావిస్తున్నాను. (ఇంచుమించుగా ఇదే భావం వేద మంత్రంలో ఉంది.) ఈవాక్యంలో 'సమ్మిశ్రణం' అనే పదం సం+మిశ్+(ల్యుట్) అన = 'సంమిశ్రణం' అని ఉపసర్గ+ధాతువు +కృత్ ప్రత్యయాల కలయికచే ఏర్పడింది. 'వాయు'శబ్దం 'వా' ధాతువుకు 'ఉణ్' అనే కృత్ ప్రత్యయం చేరిస్తే ఏర్పడింది. ఈవాక్యంలో ముఖ్యంగా గుర్తించవలసింది. 'సంజాతం' అనే కృదంతప్రయోగం. ఇలాంటివి భాషలో కొన్ని వేలున్నాయి. 'జన్' ధాతువు మీద 'క్త' అనే ప్రత్యయం చేరిస్తే జన్+(క్త)త = జాత అవుతుంది. దానికి ముందు 'సం' అనే ఉపసర్గ చేరిస్తే 'సంజాతః అయింది. ఇలాగే - గమ్+(క్త)త=గతం,మన్+(క్త)త=మతం, స్తు+త=స్తుతం; పా+త=పీతం, గా+త=గీతం; బుధ్+త=బుద్ధం; నీ+త=నీతం; కృ+త=కృతమ్ నమ్+త=నతం; దృశ్+త=దృష్టం, భుజ్+త=భుక్తం, ఇలా ఎన్నైనా తయారుచేయవచ్చు. (ఈశబ్దాలు మూడు లింగాలలో ఉండవచ్చును.

4. జలేన - వినా- ప్రాణధారణం - న- శక్యమ్ = జలంలేకుండా ప్రాణధారణం -వీలుకాదు. 'ధారణం' అనే పదం ధృధాతువుపై' ల్యుట్' ప్రత్యయం చేస్తే ఏర్పడింది.

'శక్యమ్' అనే పదం 'శక్' ధాతువుపై 'యత్' (య) అనే ప్రత్యయం చేరిస్తే ఏర్పడింది. సహ్+య=సహ్యమ్; గద్+య=గద్యమ్; మద్+య=మద్యమ్; పద్+య=పద్యమ్; శప్+య=శప్యమ్; జప్+య=జప్యం; లభ్=య=లభ్యం, చి+య=చేయం జి+య=జేయంధా+య=దేయం, పా+య=పేయం, గా+య=గేయం, కృ+య=కృత్యం, నృత్+య=నృత్యం, భృ+య=భృత్యం. ర఼డు఼పు఼రణాల్లో ధాతువు(Root) దాని ప్రక్కన కృత్ ప్రత్యయం(Suffix) చేర్చబడింది. ఏకృత్ ప్రత్యయం అయినా ధాతువుకు ప్రక్కనే విధిగా చేర్చవలసి ఉంటుంది. యత్ ప్రత్యయంలాగా క్యప్ అనే ప్రత్యయం కూడా ఉంది. అదిచేరినప్పుడుకూడా ఇలాగే రూపాలు ఏర్పడతాయి. చూడండి - స్తు+(క్యప్) య=స్తుత్యం; శాస్+య=శిష్యః; వృ+య=వృత్యః భూ+య=భవ్యం; హన్+య=హత్యా ఆ+దృ+య=ఆదృత్యం; శప్యమ్; దుహ్యమ్; గుహ్యం; అంజ్+య=ఆజ్యం; క్లుప్+య=కల్ప్యం, ఇలాగే 'ణ్యత్' అనే ఒక ప్రత్యయం ఉంది. ఇది చేరిస్తే ధాతువుకు కొన్ని మార్పులు ఏర్పడతాయి. కృ+(ణ్యత్)య=కార్యం, ఆ+చర్+య=ఆచార్యః, మృజ్+య=మార్గ్యః; పచ్+య= పాక్యం; యజ్+య=యాజ్యం, యాచ్+య=యాచ్యం, త్యజ్+య=త్యాజ్యం; వచ్+య=వాక్యం.

5. జలస్య - లక్షణం - సుశ్రుత సంహితాగ్రంధే - ఏవం - ప్రోక్తమ్ -

జలము యొక్క -లక్షణం - సుశ్రుతసహిత అనే గ్రంధంలో - ఇలా - చెప్పబడింది - (ఈగ్రంథం క్రీ.పూ 1000సంవత్సరాలకు ముందు నిర్మింపబడింది)-

**శ్లో॥ నిర్గంధమ్- అవ్యక్తరసం - తృష్ణాఘ్నం - శుచి - శీతలం ।**

**అచ్ఛం - లఘు-చ- హృద్యంచ తోయం గుణవత్-ఉచ్యతే ॥**

నిర్గంధమ్=ఎట్టివాసన లేనిది; అవ్యక్తరసం=స్పష్టంగా రుచితెలియనిది; తృష్ణాఘ్నం=దప్పికనుతీర్చేది; శుచి=శుభ్రమైంది, శీతలం=చల్లగాఉన్నది, అచ్ఛం=నిర్మలమైంది, లఘు-చ=తేలికగా (త్వరగా జీర్ణమయే లక్షణంకలిగి) ఉండేది, హృద్యం=హృదయానికి హితకరమైంది, అయిన, తోయం=జలం; గుణవత్=గుణవంతమైనదని; ఉచ్యతే=చెప్పబడుతున్నది.

ఈ లక్షణం ఆధునిక వైజ్ఞానికులు 'రంగురుచివాసనలు లేనిది జలం' అని చెప్పే లక్షణానికి చాలా దగ్గరగా ఉన్నది.

6. జలస్య- అభాస్వరశుక్ల - వర్ణం - అస్తి - ఇతినైయాయికాదయః వదన్తి.

నీటికి - ప్రకాశవంతం కాని తెలుపురంగు - ఉంది- అని - నైయాయికులు మొ॥ వారు చెబుతున్నారు.

7. జలం భౌమమ్ - ఆంతరిక్షమ్ - ఇతి- ద్విధాభవతి,

నీరు- భూమిపైనున్నది - అంతరిక్షంనుండి పడినది - అని రెండురకాలుగా ఉంటుంది.

8. ఆంతరిక్షమ్ - జలం - చతుర్విధం భవతి - అంతరిక్షంలో నుంచిపడిన జలం నాల్గురకాలుగా ఉంది. ఇక్కడ సుశ్రుత సంహితిలోని కొన్ని వాక్యాలు ఇస్తున్నాను. అతి ప్రాచీన కాలం లోని ఆయుర్వేదగ్రంథాల్లో ఎంత సులభమైన సంస్కృతభాష వాడబడిందో గమనించండి.

## సుశ్రుత సంహిత- సూత్రస్థానం - అధ్యాయం - 45.

1. యథోవాచ భగవాన్ ధన్వన్తరిః-

2. పానీయమ్ - ఆంతరిక్షమ్-అనిర్దేశ్యరసమ్. అమృతం-జీవనం-తర్పణం-ధారణమ్-ఆశ్వానజననం-శ్రమ-క్లమ-పిపాసా-మద-మూర్ఛా-తంద్రా-నిద్రా-దాహ-ప్రశమనమ్-ఏకాన్తతః పథ్యతమం - చ.

1. భగవానుడైన ధన్వంతరి ఇలా చెప్పినాడు.

2. ఆకాశంనుండి వచ్చిన పానీయం (జలం)ఇలాంటి రుచికలది అని నిర్దేశించడానికి వీలుకానిది-ఎట్టిదోషాన్ని కలిగింపక అమృతంలా స్వీకరింపదగింది-ప్రాణాలను ధరింపజేసేది-తృప్తిని కలుగజేసేది-శరీరాన్ని నిలిపేది,అలసటను తీర్చేది-శ్రమ-ఆయా సం-దప్పిక-మదం-మూర్ఛ-అలసత్వం-నిద్ర-తాపం వీటిని పోగొట్టేది-పూర్తిగా బాగా పథ్యమైంది (మేలునుచేసేది.)కూడా.

పై వాక్యాలో 'పానీయమ్' అనేపదం 'పా' అనే ధాతువుపై 'అనీయర్' (అనీయ) అనేకృత్ ప్రత్యయచేర్పుగా ఏర్పడింది. పా+అనీయ=పానీయం (త్రాగదగింది) ఇలాగే రమ్+అనీయ=రమణీయం (అందమైంది); గమ్+అనీయ=గమనీయం (వెళ్లదగింది) దృశ్+అనీయ=దర్శనీయం(చూడదగింది), ఇలాగే పచనీయం (వండదగింది); వచనీయం=మాటాడదగింది, ఏధనీయం, వర్ధనీయం (పెంచదగింది) శయనీయం(శయనింపదగింది) దానీయం (ఈయదగింది) ధరణీయం, భరణీయం ఇలా తయారుచేయవచ్చు ఇదే అర్థంలో ధాతువుల కంటే 'తవ్య' అనే ప్రత్యయం చేరిస్తే, ద్రష్టవ్యం, కర్తవ్యం, భర్తవ్యం, ధర్తవ్యం, పాతవ్యం, రంతవ్యం, పక్తవ్యం, వక్తవ్యం, ఏధితవ్యం, వర్ధితవ్యం ఇలా తయారౌతాయి. పైవాక్యాల్లో జీవనం, తర్పణం, ధారణం, ఆశ్వాస జననం, ప్రశమనం, అనే శబ్దాలన్నీ ధాతువుల పై 'ల్యుట్' అనే కృత్ ప్రత్యయం చేర్పుగా ఏర్పడ్డవి. వీటిని గురించి ముందు చెప్పుకున్నాంకదా! మరికొన్ని వాక్యాలు సుశ్రుత సంహితలో నుంచి చూడండి.

3. తద్-ఏవ-అవనిపతితమ్ అన్యతమం రసమ్ ఉపలభతే। ఉపలభతే।స్థానవిశేషాత్-నదీ-నద-సరస్ తడాగ-వాపీ-కూప -చుంటీ-ప్రసవణ-ఉద్భిద వికిర-కేదార-ప్వలాదిషు-స్థానేషు అవస్థితమితి.(వేరువేరు రంగుగల నేలల్లోని నీరు వేరువేరు రుచులు కలిగిఉంటుందన్న కొందరిమతాన్ని సుశ్రుత సంహితాకారుడు అంగీకరించలేదు. అతని అభిప్రాయం ఈ క్రింద చూడండి.)

3.ఈనీరే నేలపైపడి స్థానాల్లో తేడాను బట్టి మధురం మొదలైన రసాలలో ఏదో ఒకరసాన్ని పొందుతున్నది.నదులు,నదాలు తటాకాలు, దిగుడుబావులు-బావులు-చెలములు,కొండవాగులు,భూమిలోపనుండి పైకి ఉబికిన నీటిజాలులు,వాగులలో తీసిన చిన్నచిన్న గుంటలు, పొలములు చిన్నచిన్నగోతులు మొదలైన స్థానాల్లో ఉన్ననీరు (వేరువేరు రుచులను పొందుతున్నది.)

4.తత్ర, పృధివ్యాదీనామ్, అన్యోన్యాను ప్రవేశకృత: సలిల రసో భవతి ఉత్కర్షాపకర్షేణ।తత్రస్వలక్షణ భూయిష్ఠాయాం భూమౌ ఆమ్లం లవణంచ।అంబుగుణ భూయిష్ఠాయాం మధురం।తేజో గుణభూయిష్ఠాయాం కటుకం-తిక్తంచ। వాయుగుణ భూయిష్ఠాయాం కషాయమ్। ఆకాశగుణ భూయిష్ఠాయమ్ అవ్యక్తరసం। అవ్యక్తమ్ హి ఆకాశమ్ ఇత్యత:। తత్రప్రధానమ్ అవ్యక్తరసత్వాత్, తత్పేయమ్ ఆంతరీక్షంలంభే।

4.అక్కడ, కృధివి-జలం-తేజస్సు-వాయువు ఆకాశం అనే పంచభూతాలు ఒక దానితో ఒకటి కలవడం వల్ల ఏర్పడిన నీటిలోని రుచి హెచ్చుతగ్గలుగా ఉంటున్నది. వీటిలో పృధివీలక్షణం ఎక్కువగా ఉన్న స్థలంలోని నీరు పులుపు,ఉప్పురుచి గలిగి ఉంటుంది.జల లక్షణం ఎక్కువగా ఉన్న ప్రదేశంలోనినీరు తియ్యగా ఉంటుంది. తేజోగుణంకల ప్రదేశంలోని నీరు కారంగాను వగరుగాని ఉంటుంది. వాయువు యొక్క గుణం అధికంగా ఉండే స్థలంలోని నీరు చేదుగా ఉంటుంది. ఆకాశగుణంకల ప్రదేశంలోని నీరు స్పష్టమైన రుచి కలిగి ఉండదు. ఆకాశం అనేది అవ్యక్తం కదా! అందువల్లనే ఆకాశలక్షణం కల ప్రదేశంలోని నీరు కూడా అలాగే ఉంటుంది. ఈనీరే ఆంతరీక్షజలం దొరకనప్పుడు త్రాగవచ్చు.

## ఆంతరీక్షజలం అంటే ఏమిటి? ఎప్పుడు దొరుకుతుంది?

(ఆ, తత్రాన్తరీక్షం చతుర్విధమ్।తద్యథా-ధారం, కారం, తౌషారం,హైమమ్ఇతి,తేషాం ధారం ప్రధానం,లఘుత్వాత్ తత్పునర్ ద్వివిధం-గాంగం,సాముద్రం చేతి. తత్ర గాంగమ్ ఆశ్వయుజమాసే ప్రాయశో వర్షతి.

5.భౌమజలం-ఆకాశజలం(ఇదే ఆంతరీక్షజలం) అనేవాటిలోను ఆంతరీక్షజలం నాలుగు రకాలుగా ఉంటుంది. ఎలాగంటే 1.ధారం (ఆకాశంనుండి వర్షధారగాపడింది)2.కారం(వడగళ్లనుంచి వచ్చిన నీరు)3.తౌషారం(పలుచటి మంచు కురిసినప్పుడు ఏర్పడిననీరు)4.హైమం(తెల్లగా గడ్డ కట్టిన మంచువల్ల ఏర్పడిన నీరు).

(పై వాక్యాల్లో కేవలం సముద్రాదుల్లోని నీరు వేడికి ఆవిరై మేఘాల్లో చేరి వర్షంగా పడేదేకాక, మేఘమండలాల పై నుండి మనం గుర్తింపలేని ప్రదేశం (Unknwn Source) నండి క్రిందకు వర్షంగా పడేనీరు కూడా ఉందని మనవారు భావించారు. విష్ణుపదం నుండి గంగ పడిందని పురాణ వచనాలు కూడా ఈ అభిప్రాయాన్ని స్పష్టపరుస్తున్నాయి.

ఈ నాల్గింటిలో 'ధారం' అనే జలం తేలికగా ఉండేది కనుక అన్నిటికంటే ప్రధానం. ఇది రెండు రకాలుగా ఉంటుంది 1.గాంగం (అంతరిక్షంలో మేఘమండలం కంటే కూడా పైనుండి క్రిందకు పడేనీరు. దీన్నే మన వారు ఆకాశగంగ అన్నారు.) 2.సముద్రంలో పడిన నీరు (ఇది సూర్యకిరణాల ద్వారా మేఘాల్లో చేరిమళ్ళీ కురుస్తుంది.)

## గాంగ జలాన్ని - సముద్రజలాన్ని పరీక్షించి వేరుపరచే విధానం :-

6. తయోః ద్వయోరపి పరీక్షణం కుర్వీత.శాల్యో దనపిండమ్ అకుథితమ్ అవిదగ్ధం రజత భాజనోపహితం-వర్షతి-దేవే-బహిష్కుర్వీత।సయది,మహూర్తం,స్థిత: త్రాదృశ ఏవ భవతి, తదా గాంగం పతతి ఇత్యవగన్తవ్యమ్। వర్ణాన్యత్వే సిక్త-ప్రక్లేదే -చ-సాముద్రమితివిద్యాత్। తత్ నోపాదేగుమ్।

6. గాంగ-సముద్రజలాలను రెంటినీ పరీక్షించాలి. వరిఅన్నపు ముద్దను మరీమెత్తగా అయినది, మాడినదికాకుండ బాగున్నదాన్ని ఒక వెండిత్రలో ఉంచి ఆశ్వయుజ మాసంలో వర్షపునీటి బురదలో ఉంచి, రెండుఘడియలు అయిన తరువాత కూడా అది మార్పు లేకుండా అలాగే ఉంటే అప్పుడు దాన్ని గాంగ జలమని తెలుసుకోవాలి. రంగు మారితే కుళ్ళి మెత్తపడితే సాముద్రజలం అని గ్రహించాలి. ఆనీరు త్రాగతగిందికాదు.

## గాంగజలాన్ని పట్టుకొనే విధానం.

7. శుచి శుక్ల వితత పట్టైక దేశచ్యుతమ్ అథవా హర్మ్యతల పరిభ్రష్టంశుభ్రమ్ అన్యైః శుచిభిః భాజనైః గృహీతం...నిద ధ్యాత్ తత్ సర్వకాలముపయుంజీత. తదలాభే భౌమమ్।

శుభ్రమైన తెల్లని పెద్దవస్త్రంపై జారినదాన్ని గాని లేదా, ఇటుకలతో కట్టి సుద్దపూసిన డాబా పైభాగం నుంచి గాని క్రిందకు జారినజలాన్ని వేరు వేరు శుభ్రమైన పాత్రల్లో గ్రహించి ఉంచుకోవాలి. దాన్ని అన్ని కాలాల్లో ఉపయోగించాలి. ఇది దొరకనప్పుడు భూమిపై లభించే జలం ఉపయోగించాలి

## ఏ కాలంలో ఏ నీరు త్రాగాలి?

8.తత్ర వర్షాసు ఆంతరీక్షమ్, ఔద్భిదం వాసేవేత-మహా గుణత్వాత్,శరది-సర్వమ్;ప్రసన్నత్వాత్,హేమన్తే సారసం, తాడాగంవా వసన్తే కౌపం ప్రాస్రవణం వా, గ్రీష్మే పి ఏవం, ప్రావృషి చౌంట్యమ్ అనభివృష్టం సర్వంచ ఇతి.(వెనుకటి రోజుల్లో కూడా ఇప్పటిలాగే భూగర్భం లోని జలాన్ని పైకి లాగి త్రాగేవిధానం ఉండేది.ఇలాంటినీటిని ఔద్భిదం అన్నారు. ఇదిచాలా ప్రశస్తమైందని చెప్పారు.

అనేక విధాలైన జలాల్లో, వర్షాకాలంలో ఆకాశంనుండి పడిన ఆంతరిక్ష జలాన్ని గాని,ఔద్భిదం అనగా భూమినుండి జలగాపైకి ఉబికిన నీటిని (అంటే ప్రస్తుతకాలంలో బోర్‌వెల్స్ వేసి పైకి తీసిన నీటిని)త్రాగాలి. ఇది గొప్పగుణం కలది. శరత్కాలంలో ఏ నీరైనా వాడవచ్చు; ప్రసన్నంగా ఉంటుంది కనుక, హేమన్తఋతువులో సరస్సులలోను (సహజంగా చెరువులలోనున్న తటాకాలలోను (కృత్రిమంగా త్రవ్విన చెరువులలోను) ఉన్న నీటిని త్రాగవచ్చు. వసన్తకాలంలోను, గ్రీష్మకాలంలోను దిగుడుబావి నీరు, కొండజాలునీరుగాని, ప్రావృట్‌కాలంలో వరలులేని మట్టిబావిలోని నీరైనా వర్షజలం కలవనిది అంతా ఉపయోగంపవచ్చు.

## వర్షాకాలంలో క్రొత్త నీటిలో ఈదకూడదు, నదీజలంత్రాగకూడదు.

**యోవగాహేత వర్షాసుపిబేద్యాపి నవంజలమ్ । సబాహ్యా భ్యన్తరాన్ రోగాన్ ప్రాప్నుయాత్ క్షిప్రమేవతు ॥**

ఎవ్వడు వర్షాకాలంలో నదులలోగాని ఇతరత్ర ఉన్న క్రొత్తనీటిలో స్నానం చేస్తాడో త్రాగుతాడో వాడు పైన శరీరం మీద,శరీరం లోపల రోగాలను త్వరగా పొందుతాడు.

## పాడైన నీటిని ఎలా శుభ్రపరచాలి?

వ్యాపన్న స్యాగ్ని క్వథనం, సూర్యాతపప్రతాపనం,తప్తాయః పిండ, సికతా లోష్టానాం వానిర్వాణం, ప్రసాదనం చ కర్తవ్యం. నాగ-చంపకోత్పల పాటలా పుష్పప్రభృతిభిశ్చ అధివాసనయ్ ఇతి।

బురద, నాచు మొదలైనవాటిచే పాడైన నీటిని అగ్ని పైకాచడం సూర్యకిరణాలతో బాగా వెచ్చజేయడం-బాగా కాల్చిన అయోగోళకం, ఇసుక, ఇటుకరాళ్ళు వేయడం, ఇండిపగింజ,పటిక మొదలైనవాటిచే నీటిని విరవడం,లేదా, పరిమళభరితాలు దోషరహితాలు అయిన పుష్పాలను నీళ్లలో వేసి దుర్వాసననుపోగొట్టడం.

## ప్రాచీన రసాయనశాస్త్రం. (Ancient Chemistry)

ప్రాచీన కాలంలో రసాయనశాస్త్రం అనేది ఆయుర్వేదంలో ఒక భాగంగా వికాసాన్ని పొందింది. ఈసృష్టిలో ఉన్న పదార్థాల పరస్పర సమ్మేళనం.వల్ల ప్రతిక్షణం అనేక రకాల రసాయన చర్యలు ఏర్పడుతున్నాయి. ఈ రసాయన చర్యలనే ప్రాచీన భారతీయ శాస్త్రవేత్తలు 'పాకం' (Chemical Combination) అన్నారు దానివల్ల అనేక ద్రవ్యాలు ఏర్పడతాయని అంటారు. పాకంవల్ల పూర్వరూపం నశించి వేరొక రూపం కలుగుతుంది. పాకం అనేది అగ్ని సంయోగంవల్ల కలుగతుందని మనవారు అన్నారు. ఇక్కడ నాశనం అంటే మార్పుమాత్రమే.

### ఈక్రింది వాక్యాలు చూడండి:

1. అగ్నిసంయోగాత్-జాయమానః - పరిణామ విశేషః - పాకః -ఇతి-ఉచ్యతే. అగ్ని సంయోగంవల్ల - పుట్టే పరిణామవిశేషమే పాకం అని చెప్పబడుతున్నది. 'పరిణామ విశేషం' అంటే ఒకవిశిష్టమైన మార్పు. (Chemical Change)
2. పాకేన పార్థివద్రవ్యే రూప-రస-గంధ- స్పర్శానాం నూతనానాం సముత్పత్తిః భవతి- పాకంచేత పృథివీ ద్రవ్యంలో రూపం - రసం - గంధం - స్పర్శ అనే నాల్గు నూతనంగా పుట్టటం జరుగుతున్నది.
3. జలే, తేజసి, వాయౌచ, పాకవశాత్ నూతనరూపాదీనామ్ ఉత్పత్తిః నభవతి ఇతి ప్రాచీనాః భారతీయ వైజ్ఞానికాః ఉక్తవన్తః జలంలో, తేజస్సులో, వాయువులోను పాకంవల్ల నూతన రూపాదులకు ఉత్పత్తి ఉండదు. అని ప్రాచీన భారతీయ వైజ్ఞానికులు చెప్పారు.
4. అతఏవ-ఘటాదౌ - పార్థివవస్తుని అగ్ని సంయోగాత్ శ్యామాది గుణనాశేన రక్తాదిగుణాంతరోత్పత్తిః । అందువల్లనే - కుండ మొదలైన మట్టితో చేసిన వస్తువునందు అగ్ని సంయోగంవల్ల నలుపు మొదలైన రంగు నశించడం చేత - ఎరుపు మొదలైన వేరే గుణాలు పుట్టడం ఉంది.

శతధా నీరు మొదలైన వాటిలో నూరుసార్లు వేడిచేసినా కూడా వేరొక రూపం- పుట్టదు- అనికూడా చెప్పుచున్నారు.

(న్యాయసిద్ధాన్త ముక్తావళి- గుణఖండం - శ్లో25.)

**జలాదౌ తాప్యమానే అపిన రూపాంతరోత్పత్తి: ఇతిచ వదన్తి.**

5. పాకః కుత్ర భవతి ? పరమాణౌ :- ఉత- పరమాణు పుంజ రూపే,వస్తుని? పాకం ఎక్కడ ఏర్పడుతుంది? పరమాణువులోనా? లేక- పరమాణు సముదాయమైన వస్తువులోనా?

6. పరమాణౌ ఏవ పాకః (Chemical action) ఇతి కణాదాను యాయినః వదన్తి పరమాణువుల్లోనే, పాకం(రసాయనచర్య). అని కణాదముని యొక్క అనుయాయులు అంటున్నారు.

7. అయమ్ - ఏవ - పీలుపాక వాదః ఇదే పీలుపాకవాదం (అంటే పీలువుల్లోనే పరమాణువుల్లోనే పాకం= పరిణామం అని చెప్పే వాదం అన్నమాట వీరు వైశేషికులు.

8. పరమాణౌ న పాకః కింతు తత్సముదాయరూపే వస్తుని ఇతి గీత మాదయః వదన్తి పరమాణువులో పాకం లేదు. అయితే పరమాణు సమూహములైన వస్తువుల్లో అని గౌతముడు మొ॥ చెప్పుదురు.

9. అయమ్ ఏవ పిఠరపాక వాదః - ఇదే పిఠరపాక వాదం (పిఠరం = పరమాణు సముదాయమైన వస్తువు, దానిలో "పాకం" అని వాదించేవారు. వీరే నైయాయికులు.

10. ఆయుర్వేదశాస్త్రే రసాయనప్రక్రియయా వివిధానాం ధాతూనాం ఉపధాతూనాంచ విశోధనేన ఔషధాని సంపాద్యన్తేస్మ ఆయుర్వేద శాస్త్రంలో రసాయన ప్రక్రియద్వారా అనేక రకాల ధాతువులు (Matters) ఉపధాతువులు(Mixed Matters) వీటి విశోధనం చేత ఔషధాలు సంపాదింపబడుతున్నాయి. బహువిధానియంత్రాణి అపి ఏతదర్థం ఉపయుజ్యన్తేస్మ. అనేక రకాల యంత్రాలు కూడా దీనికొరకు ఉపయోగింపబడేవి.

11. మూలద్రవ్యాణి మిశ్రద్రవ్యాణి ఇతి ద్విధా - ద్రవ్యాణి భవన్తి.
మూలద్రవ్యాలు - మిశ్రద్రవ్యాలు - అని రెండు రకాలుగా ద్రవ్యాలు ఉంటాయి.

12. మూలద్రవ్యాణి ప్రాయశః అశీతి సంఖ్యాకాని - సంతి ఇతి ఆధునిక వైజ్ఞానికాః వదన్తి.

మూలద్రవ్యాలు సామాన్యంగా 80 రకాలు ఉన్నాయి. అని ఆధునిక వైజ్ఞానికులు అంటున్నారు.

13. పృథివీ - ఆపః - తేజః - వాయుః - ఆకాశం - కాలః - దిక్ - ఆత్మా - మనః ఇతి నవ ద్రవ్యాణి - వైశేషికాః వదన్తి - భూమి - నీరు తేజస్సు - గాలి - ఆకాశం - కాలం - దిక్కు- ఆత్మ - మనస్సు అని 9 ద్రవ్యాలను వైశేషికు - చెబుతున్నారు. ఏతేషు ద్రవ్యేషు ఆకాశ - కాల - దిగాత్మ మనస్సు రాసాయన పరిణామాః నభవన్తి. ఈద్రవ్యాల్లో - ఆకాశం కాలం దిక్ ఆత్మ మనస్సు అనే 5 ద్రవ్యాల్లో రసాయన పరిణామాలు వుండవు.

14. అతఏవ రసాయన శాస్త్రే ఏతేషాం విచారణం నభవతి. అందువల్లనే రసాయన శాస్త్రంలో వీటి యొక్క విచారణ ఉండదు.

15. రూపాదిగుణాః (Quaties) పరిస్పందాదిక్రాయాః(Actions) ద్రవ్యేషు భవన్తీతి - రసాయన చార్యాః అపి - అత్రైవ భవన్తి. రూపాది గుణాలు - పరిస్పందం (కదలిక) మొదలైన క్రియలు ద్రవ్యాల్లో ఏర్పడతాయి కనుక రసాయన చర్యలు కూడా అక్కడే కలుగుతాయి.

16. అగ్ని సంయోగాత్ - పదార్థస్య అణుషు (Moleculs) అత్యన్త వేగేన చలనం భవతి - అగ్ని సంయోగం వల్ల పదార్థానికి చెందిన అణువుల్లో అత్యన్త వేగంగా కదలిక కలుగుతుంది.

ఇతి, తత్ చలనమ్ అస్మాభిః సాధారణనేత్రేణ నదృశ్యతే ఇతి. తస్యాం దశాయాం పదార్థాణవః పరస్పరం వియుక్తాః భవన్తి, ఇతిచ వైజ్ఞానికాః వదన్తి ఆధునికాః। ఆ కదలిక మనచే సామాన్యమైన దృష్టిచే చూడబడదు. అని ఆ దశలో పదార్థాల అణువులనుండి ఒకటి విడిపోతాయి. అని కూడా వైజ్ఞానికులు ఆధునికులు అంటున్నారు.

17. ఏతేషాం వాదః నైయాయిక వాదస్య సన్నిహితో భవతి.

వీరి వాదం నైయాయికుల వాదానికి దగ్గరగా ఉన్నది.

18. నైయాయికాః ఏవం వదన్తి - "అనే కావయవ విశిష్టే పదార్థే అగ్నిసంయోగే సతి, అవయవినః సచ్ఛిద్రా - భవన్తీతి హేతోః సూక్ష్మాః అగ్న్యవయవాః పదార్థా

వయవమచ్ఛిద్రేషు ప్రవిశ్య పాకం జనయన్తి! అతః అవయవ విశిష్టావయవిని పాకః సంభవతి ఇతి.

నైయాయికులు ఇలా అంటున్నారు. అనేకావయవాలతో కూడిన పదార్థంలో అగ్ని సంయోగం ఏర్పడినప్పుడు అవయవాలు గల వస్తువులో కాళీలు ఉండుట వల్ల అగ్ని ఆకాళీలలో ప్రవేశించి పాకాన్ని (Chemical Action) కలుగజేస్తున్నది. అందువల్ల అవయవాలతో కూడిన విశిష్టపదార్థంలో మొత్తంగా ఒక్కసారే పాకం కలుగుతుంది. అని

19. వైశేషికాస్తు - పరమాణుషు ఏవపాకః - అగ్నిసంయోగాత్ పూర్వావయవనాశః నూతనావయవోత్పత్తి :, ఉత్పన్నానాం నూతనావయవనాం నూతన రూపాది గుణసంబన్ధః ద్రవ్యాన్తరారంభః ద్వ్యణుకాది క్రమేణ ఇతి వదన్తి.

వైశేషికులైతే - పదార్థం యొక్క అతిసూక్ష్మాంశాలైన పరమాణువుల్లోనే పాకం (రసాయన చర్య ప్రారంభమై పూర్వావయవాలు (అణువులు) వాటిలోని గుణాలతో సహా నశించి నూతనావయవాలు వాటిలో క్రొత్తగా గుణాలు - వేరొక పదార్థం ఆరంభింపబడుతున్నది. ద్వ్యణుకం మొదలైన క్రమంలో అని అంటున్నారు.

20. ద్వణుకం నామ అణుద్వితయం - ద్వ్యణుకం అంటే రెండు అణువులు (Two Molecules) ఈ పై విశేషాలు న్యాయ దర్శనంలో గౌతమముని, వైశేషిక దర్శనంలో కణాదముని క్రీస్తు పూర్వం, గ్రీకు వైజ్ఞానికులు కళ్ళు తెరవకముందే కొన్ని వేల సంవత్సరాల ముందే చెప్పారు.

# సమాసప్రయోగః - సమాసముల ప్రయోగం.

సంస్కృతభాషలో సమాసం జీవం వంటిది. ఎంతటి అర్థాన్నైనా సులువుగా సంగ్రహ పదరచన ద్వారా చెప్పాలంటే సమాసరచనం ఆశ్రయింపవలసి ఉంటుంది. ఇతరభాషల్లోనూ ఈ సమాసరచనం ఉంటుంది. ఇంగ్లీషులో 'Compound Words' అని అంటారు. రెండు శబ్దాలతోప్రారంభించి కొన్ని వందల శబ్దాలనైనా ఒకదాని ప్రక్కన ఒకటి మాలలా కూర్చి సంస్కృతంలో సమాసనిర్మాణం చేయటం ఉంటుంది. విడివిడిగా స్వతంత్ర పదాలతో చెప్పే ఒక భావాన్ని ఆ పదాలన్నీ కలిపి ఒకే పదంగా చేసి వాడటమే సమాసరచన. వాక్యం అంటే కొన్ని స్వతంత్ర పదాల సమూహంకాగా, ఈస్వతంత్ర పదాలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రక్కన పెట్టి కలిసి కట్టుగా ఒకే అర్థాన్ని సముదాయంగా బోధించడం సమాసరచనంలోని విశేషం. ఉదాహరణానికి ఈ క్రింది సమాసాన్ని తీసికోండి.

'మేఘమండల విద్యమాన జల దివ్యతేజస్సంయోగ సముద్భూత విస్ఫూర్జథుః' స్థూలంగా తీసికొంటే 'మేఘ - మండల - విద్యమాన - జల - తేజస్ - సంయోగ - సముద్భూత - విస్ఫూర్జథు' అని ఎనిమిది పదాలు కలిసాయి. సంయోగ - సముద్భూత అనేవి కూడా ఇంకా విడగొడితే ఇంకా సూక్ష్మంగా చాలా పదాలున్నట్లే. పై పదాలను వాక్యంగా విడగొట్టి ప్రయోగిస్తే 'మేఘానాం - మండలే - విద్యమానస్య - జలస్య - తేజసః - సంయోగాత్ - సముద్భూతా విస్ఫూర్జథుః' మేఘాలయొక్క మండలంలో ఉన్న - జలానికి - తేజస్సుకు - సంయోగంవల్ల పుట్టినది. పిడుగు (Thunder) పై పదాలకు కూడా ప్రాతిపదికం - విభక్తి ప్రత్యయం ఉంటాయి. ఇలా ఒక్కొక్క పదాన్ని విడగొట్టుకుంటూపోతే 8 ప్రాతిపదికాలు + 8 విభక్తి ప్రత్యయాలు ఉంటాయన్న మాట. ఎలా? మేఘ+ఆమ్ - మండల+ఙి - విద్యమాన + ఙస్ - జల + ఙస్ - తేజస్ + ఙస్ - సంయోగ + ఙసి సముద్భూత + సుప్ - విస్ఫూర్జథు + సుప్ అని, ఇప్పుడు వీటిని సమానంగా చేస్తే మధ్యలో ఉన్న విభక్తి ప్రత్యయాలు ఉండవు. లోపిస్తాయి. వాటి అర్థం మాత్రం మిగిలిన శబ్దాలే బోధిస్తాయి. ఆ విభక్తి ప్రత్యయాలు తీసేస్తే మనం ముందు తయారు చేసిన సమాసం అవుతుందన్నమాట. ఈ సమాసాన్ని దాన్ని విడగొట్టి నప్పుడున్న వాక్యం, దాన్ని విడగొట్టగా ప్రాతిపదికలు

విభక్తి ప్రత్యయాలు వేరుపడటం మనకు ఒక విషయాన్ని స్పష్టపరుస్తున్నాయి. ఏమిటంటే 'సమాసం' అనేది శబ్దాలను కుదించి ఒక సముదాయంగా మనముందు ఉంచుతుంది. అని ఈ విధంగా సమాసరచనలోని నిర్మాణ సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకొని కవులు, గ్రంథరచయితలు అవసరాన్ని బట్టి సమాసాలు వాడి తమ ప్రతిభాసంపత్తిని వ్యక్త పరుస్తారు.

## సమాసాలు ఎన్ని?

స్థూలంగా సమాసాలు (1) సామాన్య సమాసం (2) అవ్యయీభావ సమాసం (3) తత్పురుష సమాసం. (4) బహువ్రీహి సమాసం (5) ద్వంద్వ సమాసం అని పరిగణింప బడ్డాయి. సామాన్యంగా ఈ ఐదింటికి తేడా ఇలా చెబుతారు. ఇది అంత నిర్దుష్టమైన పరిగణనం కాకపోయినా కొంతవరకు అర్థం చేసుకోవడానికి సులువుగా గుర్తించడానికి ఉపయోగపడుతుంది.

1) సామాన్య సమాసం - ఏ పేరు పెట్టడానికి వీలులేని సమాసాలను సామాన్య సమాసాలన్నారు. (విశేష సంజ్ఞా వినిర్ముక్తః కేవల సమాసః, అయితే (1) ఇవ సమాసం (2) ఇవార్థసమాసం (3) గుణసమాసం (4) క్రియా విశేషణ సమాసం (5) నామపూర్వ పదం (6) అవ్యయపూర్వ పదం అని విభజించి పేర్లు పెట్టడం జరిగింది.

(1) **ఇవ సమాసం** - 'వలె' అని పోలికను బోధించే 'ఇవ' అనే పదంలో ఏర్పడే సమాసం ఇవ సమాసం.

ఉదా:- జీమూత ఇవ (మేఘమువలె) ఇది సాధారణ దృష్టితో చూస్తే సమాసంలా కనిపించును. కాని సమాసమే. వాగర్థౌ (శబ్దాలవలె) ఇత్యాదులు.

(2) **ఇవార్థ సమాసం** - 'వలె' అనే అర్థాన్ని బోధించే ప్రత్యయాలుండటం వల్ల సమాసంలోని పదాలు తెలుగులోకూడా తరచువాడుతూ ఉంటాం. ఏదైనా మనం ఊహించకుండా అకస్మాత్తుగా జరిగితే దాన్ని 'కాకతాళీయం'గా జరిగింది అంటాం. అంటే కాకికి అనుకోకుండా తాడిపండు దొరికినట్లన్నమాట. ఇది సమాసం.

(3) **మంద పాఠకః** - మందం పాఠకః మెల్లగా పఠించువాడు. శీఘ్రవాచక :- శీఘ్రం పాచకః - తొందరగా వండేవాడు. ఇలాంటివన్ని క్రియావిశేషణ సమాసాలంటారు.

**(4) గుణ సమాసం :-** విస్పష్టంపటుః - విస్పష్టపటుః - స్పష్టంగా పని చేయగలవాడు సమర్థుడు. వీటినే నామపూర్వపదసమాసాలు అని కూడా అనవచ్చు.

**(5) అవ్యయ పూర్వ పదాలు** - లింగం వచనం - విభక్తి లేని పదాలు అవ్యయాలు. ముందుముందు అవ్యయీ భావ సమాసం అనేది చెప్పుకోబోతున్నాం. అందులో చేరని అవ్యయాలతో ఏర్పడిన సమాసం అవ్యయ పూర్వ పద సమాసం - ఉదా - న + ఏ కధా = నైకథా (పలురకాలుగా) న + అంతరీయకమ్ - నాంతరీయకం (తప్పనిసరిగా ఉండేది)

**అవ్యయీభావ సమాసాలు**

ఈసమాసాల్లో 'అవ్యయం' అని వ్యవహరింపబడే పదాలు ముందుంటాయి. ఈ అవ్యయాలంటే ఏమిటో విడిగా పాఠంలో చెప్పుకొంటాం, వాటియొక్క అర్థానికి ప్రాధాన్యం ఉంటుంది. ఇలాంటివి మనం లోక వ్యవహారంలో వాడుతూనే ఉన్నాం. చూడండి. అనుగుణం అతినిద్రం, ఆబాలగోపాలం, యథాశక్తి, ప్రతివృక్షం, అనురూపం. ఇలా మనం చాలా పదాలు అవ్యయీభావ సమాసం, అని తెలియకుండానే వాడుతున్నాం.. ఈ సమాసాల్లో ముందున్న పదాలు అంటే అను, అతి, ఆ, యథా ప్రతి అనేవి అనేవి అవ్యయాలు. అంటే వీటికి లింగ వచనాదులు మిగతా సుబన్త శబ్దాలకున్నట్లు ఉండవన్నమాట. ఈ సమాసాల్లో ఈ అవ్యయశబ్దాల అర్థాలకే ప్రాధాన్యం ఉంటుంది.

'ప్రతివృక్షం' అన్నప్పుడు 'ప్రతి' అనే అవ్యయం 'వృక్షః' అనే సుబంత శబ్దంతో సమాసాన్ని పొందింది. వృక్షం వృక్షం = ప్రతి వృక్షం పుష్పాణి సన్తి అన్ని వృక్షాల్లోను పువ్వులున్నాయని అర్థం. అతి నిద్రం అనే సమాసంలో 'అతి' అంటే ఇప్పుడు పనికిరాదని అర్థం. నిద్ర ఇప్పుడు పనికిరాదు అనే అభిప్రాయంతో 'అతినిద్రం' అని వాడుతాం. వీటినే అవ్యయీభావ సమాసాలంటారు. ఒక్కొక్కప్పుడు విభక్తి ప్రత్యయాల అర్థాన్ని కూడా ఈ అవ్యయీభావ సమాసాలు బోధిస్తాయి. అధిహరి అంటే హరి యందుఅని అర్థం. కృష్ణుని యొక్క సమీపం - ఉపకృష్ణం, ఇక్కడ 'సమీపం' అనే అర్థాన్ని ఉప అనే అవ్యయం బోధిస్తున్నది. ఇలా అనేకరకాల అర్థాల్లో అవ్యయ పదాలకు ఏర్పడే సమాసాలు అవ్యయీభావ సమాసాలు.

# తత్పురుష సమాసాలు

ప్రథమ - ద్వితీయ - తృతీయ - చతుర్థి - పంచమి - షష్ఠి - సప్తమి అనే ఏడు విభక్తుల్లోను ప్రయోగింప బడిన పదాలు వేరే పదాలతో సమాసాన్ని పొందితే - ముందున్న పదం ఏ విభక్తి అయితే దాన్ని బట్టి అ సమాసానికి ఆపేరు వస్తుంది. (1) ప్రథమా తత్పురుష సమాసానికి చెందిన కొన్నిటిని కర్మధారయ సమాసం అని వ్యవహరిస్తారు. ఉదా:- నీలోత్పలం, శుభశకునం, శ్వేతవస్త్రం ఇత్యాద్యులు 'నీలమ్ చ ఉత్పలంచ - నల్లని కలువ అనే అర్థంలో నీల+ఉత్పలశబ్దాలు కలిసి 'నీలోత్పల' అనే సమాసంగా ఏర్పడ్డాయి. ప్రథమాతత్పురుషంలో ప్రథమా విభక్తితో కూడిన పదము యొక్క అర్థానికి ప్రాధాన్యం కనిపిస్తుంది. ఉదా:- అర్థం పిప్పల్యాః = అర్థపిప్పలీ - పిప్పిలిఅనే ఫలంలోని సగం. అర్థం ఋచః = అర్థర్చమ్ ఋక్కనే మంత్రం యొక్క సగము. ఈ రెండు చోట్ల అర్థం అనే పదము యొక్క అర్థానికి ప్రాధాన్యం కనిపిస్తుంది. 'నీలోత్పలం' అనే చోట 'నల్లనికలువ' అని రెండవ పదం అయిన 'ఉత్పలం' (కలువ) అనేదాని అర్థానికే ప్రాధాన్యం ఉన్నది. ఇంచుమించుగా కర్మధారయ సమాసంలో అన్ని ఇలాగే ఉంటాయి. ఇది చాలా రకాలుగా ఉంది.

2. **ద్వితీయాతత్పురుష సమాసం** :- ద్వితీయా విభక్తి గల పదం ముందు ఉంటుంది ఇక్కడ. గ్రామగతః - గామం గతః గ్రామాన్ని గురించి వెళ్ళినవాడు. ఇక్కడ గ్రామం అనేది ద్వితీయావిభక్తి. తత్పురుషసమాసంలో ఎక్కడైనా సామాన్యంగా రెండవ పదము యొక్క అర్థానికే ప్రాధాన్యం ఉంటుంది.

3. **తృతీయా తత్పురుషం** :- తృతీయా విభక్తి గల పదం ఇక్కడ ముందు ఉంటుంది. ఖడ్గహతః - ఖడ్గేన హతః. కత్తితో చంపబడ్డాడు. ఇక్కడ కూడా రెండవ పదానికే ప్రాధాన్యం

4. **చతుర్థీ తత్పురుష సమాసం** :- గోభ్యః హితం = గోహితం గోవుల కొరకు మేలు. ప్రజాభ్యః క్షేమంకరం = ప్రజాక్షేమంకరం - ప్రజలకొరకు క్షేమాన్ని కలిగించేది. ఇక్కడ చతుర్థీ విభక్తి గల పదం ముందుంటుంది.

5. **పంచమీ తత్పురుష సమాసం** :- పంచమీ విభక్తి గల పదం ముందు కలది ఇది. చోరేభ్యః భయం = చోరభయం - దొంగలవల్ల భయం. గ్రామాత్ బహిష్కారః గ్రామ బహిష్కరః గ్రామంనుండి వెలివేయుట.

6. **షష్ఠీతత్పురుష సమాసం :-** షష్ఠీ విభక్తి గల పదం ముందు ఉంటుంది. ఈ సమాసంలో ఇక్కడకూడా రెండవ పదముయొక్క అర్థానికే ప్రాధాన్యం. ఇక్కడ ప్రాధాన్యం అంటే క్రియాపదంతో అన్వయించటం అనే అభిప్రాయం. పురుషస్య భాగ్యమ్= పురుషభాగ్యమ్ స్త్రియాః - సౌభాగ్యం = స్త్రీ సౌభాగ్యమ్. లోకస్య హితం = లోకహితం మొదలైనవి.

7. **సప్తమీ తత్పురుష సమాసం -** ఇక్కడ సప్తమీ విభక్తితో కూడిన పదం ముందు ఉంటుంది. విద్యాయాం నిపుణః - విద్యా నిపుణః. విద్యలో నిపుణుడు. భైషజ్యే కుశలః = భైషజ్య కుశలః - వైద్యంలో నిపుణుడు.

8. నఞ్ తత్పురుష సమాసం :- న బ్రాహ్మణః - అబ్రాహ్మణః. బ్రాహ్మణుడు కానివాడు. న విద్యా = అవిద్యా - అజ్ఞానం.

ఈ సమాసాలన్ని తెలుగులో అందరికీ తెలిసినవే. 'తత్పురుషః' అనే శబ్దం కూడా తత్పురుష సమాసమే. సచ అసౌ పురుషశ్చ = తత్ పురుషః, తస్య పురుషః తత్ పురుషః అని కర్మధారయం - 'షష్ఠీ తత్పురుషం' అనే రెండు చెప్పుకోగా సమాస పదం ఏర్పడింది. దీనిలాంటి సమాసాలన్నీ తత్పురుష సమాసాలన్నమాట.

## 4. బహువ్రీహి సమాసం

'బహువ్రీహి' అనేపదం (సమాసపదం' ఎలా ఏ అర్థంలో తయారైందో అలా తయారైన సమాసపదాలన్నీ బహువ్రీహి సమాసాలన్నమాట. ఎలా? బహువః = అనేకాలైన, వ్రీహయః = వడ్లు ( వరిధాన్యాలు) యస్య = ఎవరికైతే ఉన్నాయో, వాడు = బహువ్రీహిః అంటే బాగాధాన్యం కలవాడని అర్థం. ఇలా ఇతర పదార్థానికి అనగా సమాసంలోలేని వేరే అంశానికి ప్రాధాన్యం కల సమాసం బహువ్రీహి అవుతుంది. పీతాంబరః = పచ్చని బట్ట కలవాడు, మందబుద్ధిః = మందగించిన బుద్ధి కలవాడు. దృఢహస్తః = దృఢమైన హస్తం కలవాడు. బహుగుణః = అనేక గుణములు కలవాడు. ఇలాంటివన్ని బహువ్రీహి సమాసాలే. తెలుగుకావ్యాల్లో ఇలాంటివి కోకొల్లలు.

## 5. ద్విగు సమాసం

సంఖ్యావాచక పదం ముందుగల తత్పురుష సమాసాన్నే ద్విగు సమాసం అంటారు. అయితే 'ద్విగు' అన్న సమాస పదం మాత్రం బహువ్రీహి సమాసంలోనే

తయారైనప్పటికీ సంఖ్యా పూర్వకమవటంచేత ఇదివేరుగా తత్పురుష సమాసంలో భాగంగా గుర్తింపబడింది. ద్వే - గావౌ - యస్య సః రెండు గోవులు ఎవరికున్నాయో వాడు 'ద్విగుః'. సప్తర్షయః అన్నచోట సప్త చ తే ఋషయశ్చ = ఏడుగురైన ఋషులు అని సంఖ్యా పూర్వంగా ఉన్న కర్మధారయ సమాసమే ద్విగుసమాసంగా పరిగణింప బడింది. ఈ ద్విగు సమాసంలో సమాస పదాలన్నీ సంఖ్యాపూర్వకంగానే ఉంటాయనే నియమం లేదు. అందువల్లనే పౌర్వశాలః = పూర్వస్యాంశాలాయాం భవః = తూర్పునున్న శాలలో ఉన్నవాడు అనేది - సంఖ్యాపూర్వం కాకపోయినా ద్విగు సమాసమే. ఇక - షాణ్మాతురః = ఆర్గురు తల్లుల బిడ్డ. (కుమారస్వామి) ద్వైమాతురః = ద్వైమాతురః = ఇద్దరు తల్లు బిడ్డ. అష్టాకపాలః = ఏడు పెంకులలో సంస్కరింపబడిన హోమ ద్రవ్యం ఇటువంటివన్నీ ద్విగు సమాసాలే. వీనికి సంఖ్యముందు ఉంది.

## 6. ద్వంద్వ సమాసం

ఈ సమాసంలో కూర్చబడిన పదాలకు గల అర్థాలన్నీ ప్రధానంగా ఉన్నప్పుడు దాన్ని ఇతరేతరయోగద్వంద్వ సమాసం అని అంటారు. రామః చకృష్ణః చ = రాముడున్ను కృష్ణుడున్ను అనే అర్థంలో రామకృష్ణ శబ్దాలు రెండూ కలిసి "రామకృష్ణౌ" అనే సమాసం ఏర్పడుతున్నది. రామకృష్ణులు అని అర్థం. ఇలా ఎన్నైనా కలపవచ్చు. రాముడు కృష్ణుడు గోవిందుడు ముకుందుడు అని నాల్గూ కలిపితే 'రామకృష్ణ గోవింద ముకుందాః' అని అవుతుంది. రామకృష్ణ గోవింద ముకుందులు అని అర్థం. ఇలా కాక ఒక్కొక్కప్పుడు సమూహరూపమైన అర్థం కూడా రావచ్చు. ఎలాగంటే రామశ్చ కృష్ణశ్చ గోవిందశ్చ ముకుదశ్చ ఏతేషాం సమాహారః = రామకృష్ణ గోవింద ముకుందమ్. రాముడు కృష్ణుడు గోవిందుడు ముకుందుడు వీరందరియొక్క సమూహం అని దీనికి అర్థం. దీన్ని సమాహార ద్వంద్వ సమాసం అంటారు. ఈ విధంగా ద్వంద్వం సమాసం (1) ఇతరేత యోగద్వంద్వం (2) సామాహార ద్వంద్వం అని రెండు రకాలుగా ఉంటుంది. ఇతరేతర యోగద్వంద్వానికి చివర ద్విచనం గాని బహువచనం గాని ఉంటుంది. సమాహార ద్వంద్వానికి మాత్రం "సమూహం" అర్థం కనుక - ఏకవచనమే ఉంటుంది. ఏవైనా కొన్ని వస్తువులను కలిపి ఒక పదంలో చెప్పదలచినప్పుడుగాని, లేదా, వాటి సమాహారాన్నే చెప్పదలచినప్పుడు గాని ఈ ద్వంద్వ సమాసం వాడతారు.

సంస్కృతంలో ఉన్న ఈ సమాసాలే తెలుగు మొదలైన భాషల్లో కూడా వాడబడుతున్నాయి. సాధారణంగా సుబన్త శబ్దాలు తిజన్త శబ్దాలు అని రెండు రకాలుగా ఉన్న పదాలలో తిజన్తపదాలకు సమాసం చేయడం ఉండదు. కాని అరుదుగా ఇలాంటి తిజన్త పదాలనుకలిపి సమాసాలుగా చేయడం కూడా కొన్నిచోట్ల ఉంది. 'ఖాదత' తినండి! 'మోదత' ఆనందించండి. అనే రెండు క్రియా పదాలు కలిసి 'ఖాదత మోదత' అనే సమాస పదంగా అయినాయి. ఇలాంటివి చాలా అరుదుగా ఉంటాయి.

**సమాసాల గురించి ఈ క్రింది అంశాలు గుర్తించాలి.**

1. సమాసాలు అనేవి సుబన్త పదాలలో ఒక భాగం.
2. సమాసంగా ఏర్పడిన పదాలకు ఏక - ద్వి - బహువచనాలు చేర్చి ఇతర శబ్దాల్లాగే వ్యవహరించడం జరుగుతుంది.
3. సమాసంగా కాకముందు, విడివిడిగా ఉన్న పదాలకు విభక్తులు వచనాలు స్వతంత్రంగా ఉన్నప్పటికి, సమాసంగా అవి కలిసిన తరువాత వాటి విభక్తి ప్రత్యయాలు వచనాలు విడిగా వినిపించవు.
4. సమాసం అనేది అనేక పదాల (రెండు అంతకంటే ఎక్కువ పదాల) సమ్మేళనం.
5. ఒక్క తిజన్త పదాలు తప్ప ఏ రకాలైనశబ్దాలైనా సమాసాలుగా ఏర్పడవచ్చు.
6. సమాసాల వల్ల రచనలో "సంగ్రహత" (Compactness) సాధింపబడుతుంది.
7. లయబద్ధంగా అందమైన పరస్పరసంవాదం (Hormony) గల శబ్దాల కూర్చి సమాసాలు తయారు చేయవచ్చు. ఈ సమాసాలను శ్లోకాల్లోను, ఛందస్సుతో సంబంధం లేకుండా విడిగానూ వాడవచ్చు.
8. సంస్కృతభాషారచన (1) సమాసాలులేని కేవల పదాలు గాను (2) సమాసాలు గలది గాను రెండు రకాలు చేయవచ్చు.
9. కొందరు కవులు వ్యస్తపదరచనను, కొందరు సమస్త పదరచనను ఆదరిస్తారు.
10. వాక్యాలలోని పదాలకు ఎలా అర్థం చెప్పుకుంటామో, సమాసాల్లోని పదాలకుకూడా అదే క్రమంలో అర్థాలు చెప్పుకోవాలి. సమాసలుగా ఏర్పడే శబ్దాలకు యోగ్యత లేదా సామర్థ్యం ఉండాలి.

# కృత్ ప్రత్యయాంతాలలో కొన్ని విశేష ప్రయోగాలు.

కృత్ ప్రత్యయాంత ప్రయోగాల్లో, తరచుగా ప్రయోగాల్లో కనిపించేవి, వాక్య ప్రయోగాల్లో బాగా ఉపకరించేవి రెండు రకాల శబ్దాలున్నాయి. (1) క్త్వా - ల్యప్ (2) తుమున్ అనే ప్రత్యయాల్తో వాక్యాల్లో క్రియా పదాలు రెండు రకాలుగా ఉంటుంటాయి. ఇలాగే (1) సమాపక క్రియా పదాలు (2) అసమాపక క్రియాపదాలు అని కూడా రెండు రకాలు క్రియపదాలున్నాయి. వెనుక ధాతువుల గురించి లకారాల గురించి చెప్పుకున్న ప్రయోగాల్లో అన్నీ సమాపక క్రియా పదాలే. అంటే అవి ప్రయోగిస్తే వాక్యాలు పూర్తి అయినట్టే.. వాక్యాలు పూర్తి కానప్పుడు తెలుగులో ప్రయోగించే కొని, తిని, వ్రాసి, వెళ్ళి, వచ్చి మొదలైన శబ్దాలలాగా సంస్కృతంలో ప్రయోగింప వలసి వచ్చినపుడు పై రెండు రకాల ప్రత్యయాలును క్రమంగా వాడుతారు. ఉదా - గత్వా = వెళ్ళి; పీత్వా = త్రాగి, నీత్వా = తీసికొనివెళ్ళి, భుక్త్వా = తిని, దృష్ట్వా = చూచి, లిఖిత్వా = వ్రాసి ఇలా ప్రతిధాతువుకు క్త్వా (త్వా) అనే ప్రత్యయాన్ని చేర్చి పై విధంగా రూపాలు తయారు చేయవచ్చు. ఇక్కడ ఒక విశేషం గుర్తించాలి. వెనుక ఉపసర్గలు అని చెప్పబడే కొన్ని శబ్దాల గురించి చెప్పడం జరిగింది. వాటిని ఇక్కడ కూడా చేర్చవచ్చు. అలా చేరిస్తే క్త్వా ప్రత్యయాంత శబ్దాలకు కొద్దిగా మార్పు వస్తుంది. క్త్వా ప్రత్యయం స్థానంలో ల్యప్ (య) అనేది వస్తుంది. పై ఉదాహరణలకు ఉపసర్గలు చేరిస్తే ఎలా ఉంటాయో చూడండి.

(1) గత్వా - సమ్ + గత్వా = సంగమ్య (2) పీత్వా - ని + పీత్వా = నిపీయ
(3) భుక్త్వా - సమ్ + భుక్త్వా = సంభుజ్య (4) దృష్ట్వా - పరి + దృష్ట్వా = పరిదృశ్య
(5) నీత్వా - ప్ర + నీత్వా = ప్రణీయ (6) లిఖిత్వా - వి + లిఖిత్వా = విలిఖ్య

ప్రతి ధాతువుకు క్త్వా ప్రత్యయం చేర్చినపుడు ధాతువుకుముందు ఉపసర్గలు చేర్చినపుడు ఇలాంటి మార్పులే వస్తాయి. ఉపసర్గల చేరికవల్ల అర్థాలు కొద్దిగా మారినా ఈ క్రియలు అసమాపక క్రియలుగానే ఉంటాయి.

ఇక "తుమున్" అనే ప్రత్యయం చేరిస్తే ఎలా ఉంటాయో చూడండి.

(1) గమ్ = తుమున్ = గంతుం - వెళ్ళుటకొరకు (2) పా+తుమున్ = పాతుం (త్రాగుటకొరకు) (3) నీ+తుమున్=నేతుం (తీసికొనివెళ్ళడానికి) (4) దృశ్+తుమున్

ద్రష్టుం చూడడానికి (5) లిఖ్ +తుమున్ = లిఖితుం (వ్రాయడానికి) వీటికి ఉపసర్గలు చేర్చినా రూపంలో మార్పురాదు.

ఉదా:- సమ్ + గంతుం = సంగంతుం; వి+లిఖితుం = విలిఖితుం. ఇలా ఎన్నైనా తయారుచేయవచ్చు. వీటిని వాక్యాల్లో ప్రయోగిస్తే ఎలా ఉంటుందో చూద్దాం.

ఒక వ్యక్తి వరుసగా అనేకక్రియలు చేస్తున్నప్పుడు చిట్టచివరి క్రియను విడచి పెట్టి ముందు వాటికి క్త్వా ప్రత్యయం చేర్చాలి.

ఉదా:- రామః ధనుః పరిగృహ్య, బాణమ్ ఆరోప్య, ఆకర్ణాన్తం కృష్ట్వా, రావణం హన్తుం ప్రయుయోజ.

(రాముడు ధనుస్సును పరిగ్రహించి, బాణాన్ని ఆరోపించి, చెవివరకు లాగి, రావణుని చంపడానికి, ప్రయోగించెను.

బాలః ఫలకే లిఖిత్వా, అక్షరాణి అనూద్య హస్తేన దర్శయిత్వా పఠితుం ప్రయతతే

బాలుడు పలకపై వ్రాసి,అక్షరాలు కూడబలుకుకొని, చేతిలో చూపుతూ చదవడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇప్పుడు కొన్ని ప్రయోగాలు చూద్దాం.

1) సూర్యమండలేన ఆకృష్య భ్రామ్యమణాపృథివీ - స్వాత్మానం పరితఃస్వయం భ్రమిత్వా, సూర్యం పరితః పరిభ్రమతి। సూర్యమండలం చేత ఆకర్షింపబడి త్రిప్పబడుతున్న భూమి - భూమి చుట్టూ స్వయంగా తిరుగుతూ సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నది.

2) అగ్నిః పదార్థానామ్ అన్తః ప్రవిశ్య విస్ఫోటనం జనయతి

అగ్ని పదార్థాలలోపల ప్రవేశించి విస్ఫోటనాన్ని పుట్టిస్తుంది.

3) నోదనాభిఘాతాత్సంయుక్తసంయోగాచ్చపృథివ్యాంకర్మ 'ఇతి సూత్రమ్ ఆశ్రిత్య భూమి కంపస్య కారణం కిమ్? ఇతి విచార్య, కణాదమతాను యాయినః ఏవమ్ - వదన్తి. నోదనం వల్ల అభిఘాతంవల్ల సంయుక్త సంయోగంవల్ల పృథివిలో కర్మ ఏర్పడుతున్నది, అనే సూత్రాన్ని ఆశ్రయించి భూమి కంపానికికారణం - ఏమి? అని విచారించి, కణాదమతా న్ననుసరించే ప్రాచీన భారతీయ వైజ్ఞానికులు - ఇలా అంటున్నారు.

"వాయ్వాదిభిః ఆభ్యన్తరవస్తూనామ్ నోదనాత్ అభిఘాతాద్వా తేషు కర్మ ఉత్పద్య, వాయుసంయుక్తే వస్తుభిః పృథివీ సంయోగాత్ పృథివ్యాం కంపనాది ఉత్పద్యతే -" ఇతి. వాయువు మొదలైనవాటిచే పృథివిలోపల భాగంలో ఉన్న పదార్థాలకు నోదనం (బలంగా నెట్టడం) వల్ల, అభిఘాతంవల్ల గాని, వాటిలోకర్మ (Acrtion చలనం) పుట్టి వాయువుతో సంయుక్తాలైన పదార్థాలతో సంయోగం (సంశ్లేషం Cohesion)పృథివికి ఏర్పడటం వల్ల పృథివిలో కంపం మొదలైనవి ఏర్పడుతున్నది.

4. 'నాడ్యోవాయుసంయోగాత్ ఆరోహణమ్" ఇతి సూత్రమ్ అనుసృత్య వాయు సంయుక్తాః సూర్యరశ్మయః ఆపః గ్రీష్మే ఊర్ధ్వమ్ ఆరోహయన్తి ఇతి అపగమ్యతే. సూర్యకిరణాలు వాయుసంయోగం వల్ల పైకి తీసికొనివెళ్తాయి' అనే సూత్రాన్ని అనుసరించి వాయువుతో సంశ్లేషం(Cohesion) కల్గిన సూర్యకిరణాలు - నీటిని గ్రీష్మంలో పైకి తీసికొనివెళ్తున్నాయి అని తెలుస్తున్నది.

5. యది వయం వైశేషిక సూత్రాణి న్యాయసూత్రాణిచ పరిశీల్య ఆధునిక విజ్ఞానేన తుల యిత్వా అవగంతుం సమన్వేతుంచ ప్రయతామహే, తర్హి ఒకవేళ మనం వైశేషిక సూత్రాలు న్యాయసత్రాలున్ను పరిశీలించి ఆధునిక విజ్ఞానంతోసరిపోల్చి అర్థం చేసికోవడానికి సమన్వయించడానికిని ప్రయత్నిస్తే

6. బహూని సూత్రాణి ఆధునిక దృష్ట్యా పర్యాలోచ్య వివేక్తుం శక్యన్తే.

అనేక సూత్రాలు ఆధునిక దృష్టితో ఆలోచించి వివేచించడానికివీలవుతున్నాయి.

అప్పుడు ప్రాచీన భారతీయుల శాస్త్రీయ పరిజ్ఞానం తెలిసికొని ఆశ్చర్యాన్ని పొందుతాముగాక.

# తద్ధితాంతపదప్రయోగాలు

వెనుక కృత్ ప్రత్యయాన్త పదాలగురించి చెప్పడం జరిగింది. ఇప్పుడు తద్ధిత ప్రత్యయాలతో కూడిన పదజాలాన్ని తెలుసుకుందాం.

స్థూలంగా ప్రత్యయాలు గురించి చెప్పినప్పుడు కొన్ని తద్ధితాంత ప్రాతిపదికల గురించి చెప్పుకోవడం జరిగింది. (సుబన్తపదాలు అనే పాఠం ఒకసారి చూడండి. టేబుల్ కూడా చూడండి) సాధారణంగా ధాతువులకు కృత్ ప్రత్యయాలు చేర్చి కృదంత శబ్దాలు తయారుచేస్తే, ఆశబ్దాలపైన ఈ తద్ధిత ప్రత్యయాలు చేర్చి వాటిని తద్ధిత ప్రాతిపదికలుగా మార్చడం జరుగుతుంది. పాణిని మహర్షి ఎన్నిరకాల అర్థాలలో ఈ తద్ధిత ప్రత్యయాలు చేర్చవచ్చునో తన వ్యాకరణ సూత్రాల్లో నిర్దేశించాడు. వాటిని అనుసరించి కొన్ని విశేషప్రయోగాలు మాత్రమే ఇక్కడ మనం చెప్పుకుందాం.ఈ క్రింది విధంగా వాటి ప్రయోగాలను భాషలో గుర్తించవలసింటుంది.

1. అపత్యార్థక తద్ధిత ప్రత్యయాలు : ఒకరి సంతానం (అపత్యం) అనే అర్థంలో అణ్,యఞ్, ఇఞ్, ఢక్, ఠక్ అనేవి ప్రధానంగా చేర్చబడుతుంటాయి.

1. అణ్ :- ఆశ్వపతః - అశ్వపతి యొక్క కుమారుడు; దైత్యః - దితి యొక్క సంతానం.భారద్వాజ :- భరద్వాజుని సంతానం ఇలా (అశ్వపతి+అ=ఆశ్వపతః భరద్వాజ+అ) అణ్ ప్రత్యయం జేర్చడం జరుగుతుంది.
2. యఞ్ - గార్గ్య : (గర్గుని యొక్క గోత్రాపత్యం - వంశంలో పుట్టిన సంతానం) ఇలాగే వత్స వంశం లో పుట్టిన సంతానం వత్స +య= వాత్స్యః=ఇత్యాదులు.
3. ఇఞ్ - దశరథుని కొడుకు - దాశరథి : (దశరథ+ఇఞ్= దాశరధిః)దక్షునికొడుకు - దాక్షి : (దక్ష+ఇఞ్=దాక్షిః)
4. ఢక్ -సాధారణంగా స్త్రీల సంతానం అని చెప్పదలచుకున్నప్పుడు ఈ 'ఢక్' అనే ప్రత్యయం చేర్చబడుతుంది

   గంగ యొక్క సంతానం - గంగా+ఢక్=గాంగేయః యమున యొక్క సంతానం - యమునా+ఢక్=యామునేయః ఢక్ అనే ప్రత్యయం చేర్చినప్పుడు దాని స్థానంలో 'ఏయ్'అనేది చేర్చబడుతుంది.దితియొక్క సంతానం - దితి+ఢక్=దైతేయః

5. ఠక్ - రేవతి మొదలైన శబ్దాలకంటే వారి సంతానం అనే అర్థంలో ఈ ఠక్ అనేది చేర్చబడుతుంది. దాని స్థానంలో 'ఇక' అనేది వచ్చిచేరుతుంది. రేవతీ+ఠక్= రైవతికః, ఇలాగే ద్వారపాలికః చామరగ్రాహికః,దండగ్రాహికఃమొ. అన్ని చోట్ల ఒక్క 'అపత్యం' సంతానం అనే అర్థమేకాక వేరు అర్థాలు కూడా ఉండవచ్చు.

ఇలా - వాసుదేవః, పాంచాలః, నాకులః, పాండ్యః, పౌరవః, కౌరవః పాండవాః, పౌత్రః, కౌరవ్యః మొదలైన శబ్దాలన్నీ ఈ అపత్యాదిఅర్థాలు కల తద్ధితాన్త శబ్దాలు.

2. రక్తాద్యర్థ ప్రత్యయాలుః పైనపేర్కొన్న అణ్, మొదలైన ప్రత్యయాలే కాక మరికొన్ని ఘన్, ట్యణ్, మొదలై ప్రత్యయాలు ఈ విభాగంలో చేర్చబడ్డాయి. పితృవ్యః (పినతండ్రి) మాతులః (మేనమామ) పిత్ర్యం(తండ్రికి సంబంధించినది) పితామహః (తండ్రియొక్క తండ్రి)వాయవ్యం (వాయుదేవత నుద్దేశించిన హోమద్రవ్యం) పాశుపతం (పశుపతిదేవతాగలది). తల్ - గ్రామతా (గ్రామసమూహం) జనతా (జనసమూహం) శిక్షకః, కాషాయం (కషాయ రంగుతో కూడినది) ఇలా మరికొన్ని ప్రత్యయాలు ఈవర్గంలో చేరిఉన్నాయి. ఇలా వేరువేరు వర్గాలుగా చాలా తద్ధిత ప్రత్యయాలు చెప్పబడ్డాయి వీటిలో మనకు బాగా ప్రయోగంలో అవసరమైనవి కొన్ని చెప్పుకుందాం.

1. ఖ ప్రత్యయం - రాష్ట్రియః (రాష్ట్రంలో పుట్టినవాడు)
2. ఖఞ్ ప్రత్యయం - గ్రామీణః (గ్రామంలో పుట్టినవాడు)
3. ఛ ప్రత్యయం - యుష్మదీయః (మీవాడు) అస్మదీయః (మావాడు) తదీయం (వానిది) మదీయం (నాది) అంగుళీయం,బంధువర్గీయం,సమీయం, విషమీయం.
4. ఠఞ్ - ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఐహలౌకికం, పారలౌకికం మొదలైనవి.
5. మయట్-ఇది వికారార్థాన్ని బోధించే ప్రత్యయం,స్వర్ణమయం (స్వర్ణవికారమైనది) మృణ్మయం, గోమయం, ఆమ్రమయం (తీయమామిడి చెట్లతో నిండినది) శిలామయం, జలమయం, ఇత్యాదులు.
6. యత్ - నావ్యం (నౌకచేదాటదగినది)వయస్యః (వయస్సుచేసమానుడు) ధర్మ్యం - (ధర్మం చేత పొందదగినది) వధ్యం (చంపదగినది) మూల్యం

(కొనదగినది) తుల్యం (సమానమైనది) సామాన్యం (సమానమైనది) శరణ్యాం (ఆశ్రయింపదగినది. దంత్యం, కంఠ్యమ్, నస్యం.

7. త్వప్రత్యయం - గోత్వం, మనుష్యత్వం, మాతృత్వం - ఏదైనా వస్తువుయొక్క ధర్మాన్ని చెప్పదలచినప్పుడు ఈ 'త్వ' ప్రత్యయాన్ని వాడతాం. పశుత్వం, వృక్షత్వం, నీచత్వం, మహత్త్వం మొదలైనవి.

8. తల్ - పై అర్థంలోనే 'త్వ' అనే ప్రత్యయానికి బదులు 'తల్' అనేదాన్ని వాడవచ్చు. గోతా, మనుష్యతా, మాతృతా, పశుతా, వృక్షతా, నీచతా, మొదలైనవి. వీటి హ్రస్వాలు చేసి తెలుగులో వాడుతాం.

9. కొలత లేదా ప్రమాణం అనే అర్థాన్ని చెప్పదలచుకున్నప్పుడు 1.ద్వయసచ్ 2. దఘ్నచ్ 3. మాత్రచ్ అనే మూడు ప్రత్యయాలు వాడవచ్చు. ఊరుద్వయసం - తొడలవరకు ఉన్నది (జలం మొదలైనది) ఇలాగే ఊరుదఘ్నం, ఊరుమాత్రం అనవచ్చు.

10. తసిల్ - సర్వతః, ఉభయతః, అభితః, పరితః, విశ్వతః, అతః, తతః, అముతః, ఇతః, యతః, (పంచమీవిభక్తి యొక్కఅర్థాన్ని 'త': అనేది బోధిస్తుంది.)

11. త్రల్ - యత్ర, కుత్ర, సర్వత్ర, బహుత్ర, (సప్తమీ విభక్తి యొక్క అర్థాన్ని బోధిస్తుంది)

12. దా - సదా (ఎల్లప్పుడు) యదా (ఎప్పుడైతే) తదా(అప్పుడు) కదా?(ఎప్పుడు?) సర్వదా(ఎల్లప్పుడు) అన్యదా (వేరొకప్పుడు)

13. యదా, తదా, అనేఅర్థాలో యర్హి (ఏసమయంలో అయితే) తర్హి(ఆసమయంలో) అని 'ర్హిల్' ప్రత్యయం చేర్చవచ్చు.ఏతర్హి (ఈసమయంలో అయితే).

14. థాల్ - తథా (ఆవిధంగా) యథా (ఏవిధంగా) బహుథా (అనేకవిధాలుగా) సర్వథా (అన్నివిధాల).

15. థమ్ - కథమ్ (ఎలాగు?) ఇత్థమ్ (ఇలాగు).

16. హ - ఇహ (ఇక్కడ) త్రల్ కుబదులుగా కొన్ని చోట్ల 'హ' వస్తుంది.

17. (అ). తమప్ - అతిశయార్థాన్ని బోధిస్తుంది 'తమప్' ప్రత్యయం. లఘుతమం (చాలాచిన్నది) బృహత్తమం (చాలాపెద్దది).

ఆ. తరప్ - రెండిటిలో ఒక్కటి అని చెప్పదలచినప్పుడు ఏకతరః, అన్యతరః అని వాడతారు.

20. ఈయసున్ - లఘీయాన్, గరీయాన్, మహీయాన్, ద్రాఘీయాన్
చిన్న వాడు, గొప్పవాడు, పెద్ద వాడు, పొడవైన వాడు.

21. తరప్ - తమప్ అనేవి తిజన్త పదాల పైకూడా చేరుస్తారు. అప్పుడు అతిశయార్థం వస్తుంది. పచతి తమామ్ (బాగావండుతున్నాడు).

22. ఇష్ఠన్ - లఘిష్ఠః (బాగాచిన్నవాడు) శ్రేష్ఠః, జ్యేష్ఠః, భూయిష్ఠః, గరిష్ఠః, ప్రజిష్ఠః ఇత్యాదులు.

## కొన్ని తద్ధితాంత ప్రయోగాలు ప్రధానమైనవి చూద్దాం.

అ. సంబంధవాచకాలు - లోకంలో వాడదగిన బంధుత్వ బోధకాలైన తద్ధితాంత శబ్దాలు.

1. గోపాలః మమ పైతృష్వస్రీయః కిల - గోపాలుడు నాకు మేనత్తకొడుకు కదా!

2. గోవిందః తవ మాతృష్వస్రీయః ఇతి మయా జ్ఞాతమ్ । (మాతృష్వస్రీయః పినతల్లి కొడుకు) గోవిందుడు నీకు పినతల్లి కొడుకు అని నాచే తెలియబడింది.

3. ఘటోత్కచస్య అర్జునః పితృవ్యః భవతి ఘటోత్కచునికి - అర్జునుడు - పినతండ్రి - అవుతాడు - (ఇలాగే భ్రాతృవ్యః= సోదరునికుమారుడు)

4. మమ భ్రాత్రీయః హైదరాబాదే అస్తి - నాసోదరునికుమారుడు హైదరాబాదులో ఉన్నాడు.

5 కృష్ణ బలరామౌ భ్రాతరౌ భవతః - శ్రీకృష్ణ బలరాములు సోదరుః అవుతారు.

6. అయం మమ భాగినేయః - వీడునా మేనల్లుడు.

7. దుర్యోధనస్య శకునిః మాతులః భవతి - దుర్యోధనునికి శకుని మేనమామ అగును.

8. అయం మమ మాతామహః- ఈయన నాకు తాత (తల్లికితండ్రి) (ఇలాగే పితామహః) ఈపితామహ - మాతామహ శబ్దాలను స్త్రీలింగంలో 'హీ' అని

చివర అక్షరాన్ని మార్చాలి. వీటికి ముందు 'ప్ర' అని చేరిస్తే తాత తండ్రి అని అర్థం.

## కొన్ని ఇతర విశేషప్రయోగాలు - బాగా వాడుకలోఉన్నవి.

1. స్వకీయం, పరకీయం - తనది, పరునిది. పరకీయం సుఖందీయతే, స్వకీయం నదీయతే - ఇతరులది సుఖంగా ఈయబడుతుంది - తనది ఈయబడదు.
2. రాజకీయేషు నైతికాని మూల్యాని భ్రశ్యంతి. రాజకీయాల్లో నైతికాలైన విలువలు నశిస్తున్నాయి.
3 ఏతే సర్వే అపి అస్మదీయాః, ఏతేపునః యుష్మదీయాః వీరంతా కూడా - నావారు వీరైతే నీవారు. (ఇలాగే 'మామకీనాః' తావకీనాః)
4. మాసికం, సాంవత్సరికంచ కృత్యం మయా పూరణీయమ్ - నెలలో చేయదగినది - సంవత్సరంలో చేయదగినది అయిన పని - నాచే పూర్తిచేయదగిఉన్నది.
5. నైయాయికాః వైశేషికాశ్చ పదార్థతత్త్వం విచారయన్తి - నైయాయికలు, వైశేషికులు పదార్థతత్త్వాన్ని విచారిస్తారు.
6. వైయాకరణాః శబ్ద సాధత్వా సాధుత్వే - నిశ్చిన్వన్తి. వైయాకరణులు శబ్దాల మంచి చెడులను నిశ్చయిస్తారు.
7. శాస్త్రీయం దృక్పథమ్అత్యావశ్యకమ్ - శాస్త్రీయ దృష్టి చాలా అవసరం.
8. లౌకికం జ్ఞానం మనుష్యస్య సర్వథా అపేక్షితమ్ - లౌకికజ్ఞానం మనుష్యునికి అన్ని విధాల కావాలి.
9. ఐతిహాసికాః చరిత్ర తత్త్వమ్ అనుశీలయన్తి. ఇతి హాసకారులు చరిత్ర తత్త్వాన్ని పరిశీలిస్తారు.
10. ప్రావృషికః అంబుదః సమ్యక్ వర్షతి - వర్షాకాలపు మేఘం బాగా వర్షిస్తుంది.
11. హిమవతి సముత్పన్నా గంగా - హైమవతీ ఇతిఉచ్యతే. హిమాలయంపై పుట్టిన గంగ - హైమవతి అని అనబడుతుంది. (పార్వతిని కూడా ఇలానే అంటాం)
12. హాలికాః హల్యాని క్షేత్రాణి సమీకుర్వన్తి - నాగలి పట్టిన కృషీవలులు దున్నదగిన పొలాలను సమానం చేస్తున్నారు.

13. సభ్యాః సర్వే అపి సభామ్ అలంకుర్వన్తి - సభ్యులు (సభలో ఉండదగినవారు) అందరు సభను అలంకరించుచున్నారు.

14. సార్వజనీనః శైత్యాతపయోః అనుభవః - చలి, ఎండల అనుభవం అందరికీ సమామే. (వైశ్వజనీనం అని కూడా అనవచ్చు)

15. సత్యానుపాలనం స్వర్గ్యం యశస్యం చ భవతి - సత్యాన్ని పాలించడం స్వర్గ జనకము , కీర్తికరము అగును.

16. ఆకాలికా ఇయం వృష్టిః జనాన్ భీషయతి - అసమయంలో ఏర్పడ్డ ఈ వర్షం జనులను భయపెడుతున్నది.

17. ఇదం మౌఢ్యం త్వయా త్యాజ్యమ్ ఏవ - ఈ మూఢత్వం నీచే తప్పక విడువదగినదే.

18. కర్తవ్యేషు ఆలస్యం శ్రమస్య వైయర్థ్యమ్ ఆపాదయతి - చేయదగిన పనుల్లో ఆలస్యం శ్రమకు వ్యర్థత్వాన్ని కలిగిస్తుంది. అధోరేఖాంకితాలు

తద్ధిత ప్రత్యయాన్త పదాలు గుర్తించండి.

# ప్రాచీనానాం భౌగోళిక విజ్ఞానమ్

ప్రాచీన భారతీయర్షయః భౌగోళికాంశాన్ పురాణేషు సమ్యక్ నిరూపిత వన్తః । విష్ణుపురాణే బహుత్ర ఇతరపురాణేషు భౌగోళికాంశాః దృశ్యంతే.

ప్రాచీనభారతీయ ఋషులు భౌగోళికాంశాలను పురాణంలో బాగా నిరూపించారు. విష్ణుపురాణంలోను, చాలాచోట్ల ఇతరపురాణాల్లోను భౌగోళికాంశాలు కనిపిస్తున్నాయి.

సప్తద్వీపా ఇయంపృథివీ ఇతితేషాం సిద్ధాన్తః

ఏడుద్వీపాలు కలదీపృథివి అనివారి సిద్ధాన్తం.

తేచ - (1) జంబూద్వీపః (ఆసియా) (2) ప్లక్షద్వీపః (3) కుశద్వీపః (4) క్రౌంచద్వీపః (5) శాకదీపః (6) పుష్కరద్వీపః (7) శాల్మలీద్వీపః ।

# అవ్యయపదాలు - వాటి ప్రయోగాలు.

## (భౌతిక విజ్ఞాన విశేషాలు)

సంస్కృతభాషలో అవ్యయాలు అని చెప్పబడే కొన్ని శబ్దాలున్నాయి. వీటిని వాక్యాల్లో మధ్యమధ్య అనుసంధాయకాలుగా(linking words) ఉపయోగిస్తూంటాం. వీటికి మిగతాశబ్దాల్లా స్త్రీ - పుం- నపుంసకలింగాలు, ఏక- ద్వి - బహువచనాలు ఏమీ ఉండవు. వాక్యాలలోని అర్థాలను పూరించడానికి లేదా ఒక విశేషమైన అర్థాన్ని చెప్పడానికి ఇవి వాడతారు, అనుసంధానం చేయడానికి కూడా వీటిని వాడతారు. మనం శ్లోకాలు ఏవైనా చదివితే - తప్పని సరిగా ఇవి కనిపిస్తాయి. చూడండి - తు= అయితే, చ=కూడా; హి=కదా, ఇలాగే - ఖలు, కిలను, మొద॥ వై, ఏవ= అవధారణార్థకాలు (వాడే అనే చోట 'ఏ' అనే అక్షరం ఈ అర్థాన్నే బోధిస్తున్నది) ఇవ=వలె; నీచైః= తక్కువగా; ఉచ్చైః=ఉన్నతంగా; తిరస్=కనుపింపకుండాఉండుట; శకు=సుఖము, నఞ్, న=కాదు, లేదు;నికషా= దగ్గర, నానా=అనేకత్వము; ప్రాతర్=ప్రొద్దుట; పునర్, ముహుర్=మరల; దివా=పగలు; రాత్రౌ=రాత్రియందు - ఇలా కొన్ని వందల అవ్యయ పదాలున్నాయి.

వీటిలో బాగా ప్రయోగాల్లో ఉండి కనిపించేవి, కొన్ని - వా, ఇవ,ఇతి,తు, హి, వై,ఏవ,చ, న, కిల,ఖలు, ను, హ, పునర్, ముహుర్, ఉచ్చైస్, నీచైస్, శమ్ మొదలైనవి. వీటి ప్రయోగాలు ఎలా ఉంటాయో చూద్దాం.

వైశేషిక సూత్రాలు, మరికొన్ని వాక్యాలు ఉదాహరణాలు గా చూద్దాం.

1. రూప - రస - గంధ స్పర్శాః, సంఖ్యాః, పరిమాణాని, పృథక్త్వం, సంయోగవిభాగౌ పరత్వా - పరత్వే, బుద్ధయః, సుఖదుఃఖే, ఇచ్ఛాద్వేషౌ, ప్రయత్నాశ్చ గుణాః । (వైశేషికసూత్రం 1 - 1 -6)

   రూపం(Colour) రసం (Taste) గంధం (వాసన(Odar) స్పర్శ(Touch) సంఖ్యలు(Numbers) పరిమాణాలు(Dimenson and Magnitude) పృథక్త్వం (వేరుతనంSeverality) సంయోగం (కలయిక (Conjuction or Contact) విభాగం (విడివడుటం(Disjuctin) పరత్వం(Priority or Propin-

quity అపరత్వం(Posteriorityy or remoteness) బుద్ధి(Intelect సుఖం(Pleasure) దుఃఖం (Pain) ఇచ్ఛ (కోరిక- Desire) ద్వేషం(Aversion) ప్రయత్నం (Effort or volition) ఇవన్నీ గుణాలు ( పైవాక్యంలో 'చ' 'కూడా'అనే అవ్యయం ప్రయోగింపబడింది. రామఃచ, కృష్ణః చ=రాముడును, కృష్ణుడును అనే చోట చ అనేది ఇద్దర్నీ కలుపుతున్నది. దీన్నే సముచ్చయం అని అంటారు. -పైవాక్యాల్లో భౌతిక విజ్ఞానంలో పదార్థ ధర్మాలు(Qualities of Substances or matters) అని చెప్పబడే రూపం, రసం, గంధం, స్పర్శ, పరిమాణాలు, సంఖ్యలు, సంయోగం, విభాగం, పరిమాణం ఇవన్నీ నిర్వచింపబడి ఉన్నాయి. వీటిని మన ంప్రాచీన శాస్త్రకారులుకూడా నిర్వహించారు. ఇదికాక- గురుత్వం (బరువుWeight) ద్రవత్వం,(Fluidity) శబ్దం(Sound) స్నేహం (జిడ్డుతనం(Viscidity) వేగం (Speed) భ్రమణం(Velacity) మొదలైనవన్నీ నిర్వచింపబడ్డాయి. ఘనపదార్థాల (Solid matters) ధర్మాలు, ద్రవపదార్థాల ధర్మాలు (Qualities of liquids) ఇవన్నీ న్యాయ - వైశేషిక దర్శనాల్లో బాగా విస్తరించి వర్ణింపబడ్డాయి. సోదాహరణంగా, పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనేవే కాక, కాలం, దిక్కు, ఆత్మ మొదలైన అనేక పదార్థాల ధర్మాలు స్వరూపాలు నిరూపింపబడ్డాయి. ఇప్పుడు మరికొన్ని వాక్యాలు చూద్దాం.

2. కర్మాణి చతుర్విధాని భవన్తి ఇతి తే వదన్తి .

కర్మలు (Action or motions) నాల్గువిధాలుగా ఉంటాయి అని వారు చెబుతున్నారు. (ఇక్కడ 'ఇతి' అనేది అవ్యయం)

3. తాని హి ఉక్షేపణం (To through or flingupwards) అపక్షేపణం (Throwing downwards) ఆకుంచనం ప్రసారణం గమనమ్ ఇతి పంచ.

ఆకుంచనము ముడుచుట(Contraction) ప్రసారణము సాచుట (Expansion) ఇందులోనే (Elasticity) అనేది కూడా చేరిపోతుంది. గమనం (Motion) అని ఐదరకాలు.

5. ద్రవత్వాత్ ఏవ జలస్య స్యందనం సంపద్యతే కిల. (ఏవ. కిల)

ద్రవత్వం (Liquidy) వల్ల నే నీటికి జారుట (Fluidily) ఏర్పడుతున్నది కదా.

6. అపాం సంఘాతో విలయనం చ తేజస్సం యోగాత్ ( వై.సూ.1-2-8) జలానికి ఘనీభావం కరగటం కూడా తేజస్సు యొక్క సంబధంవల్ల. (నీరు వడగళ్ళు మొదలైన విధంగా గడ్డకట్టడానికి విద్యుత్ మొ॥ తేజస్సు, కరగడానికి సూర్యకిరణం, అన్ని మొ॥ తేజస్సు కారణం అని వైశేషికులు అంటున్నారు.)

7. అగ్నౌ ఉష్ణత్వవత్, ఉత్పీడనం, ఊర్ధ్వ ప్రసరణహేతుః, తచ్చ అదృష్ట కారితమ్ ఏవ. అగ్నిలో వేడిలాగానే పైకినెట్టే వత్తిడి- పైకి ప్రసరించడానికి కారణం, అది స్వభావసిద్ధమే. (ఇక్కడ 'ఏవ' - అవ్యయం)

8. సంయోగాభావే గురుత్వాత్ పతనం సంపద్యతే ।

సంయోగం లేనప్పుడు బరువుతనం వల్ల (వస్తువు) పడటం ఏర్పడుతున్నది.

ఏదైనా బరువు గల వస్తువు దాన్ని పట్టినిలిపేది లేనప్పుడు, ప్రతిబంధం ఏదీలేనప్పుడు బరువు వల్లే క్రిందకు పడుతుంది.) (భూమికి ఆకర్షణ శక్తి ఉందని ఆధునిక భౌతిక శాస్త్రవేత్తలు మొదలైనవారి సిద్ధాన్తం. అయితే భూమి ఆధారం మాత్రమే తప్ప ఆకర్షకం కాదని ప్రాచీనుల అభిప్రాయం. బరువైన వస్తువు తన బరువు వల్ల మధ్యలో వేరే ఆధారం లేకపోవడం వల్లనే నేల పై పడుతోందని, దూది మొదలైన వస్తువులు తేలికతనం వల్ల గాలిచేత పైకి నెట్టబడినా, తేలికతనం వల్ల ఆధారమైన భూమిపైకి మెల్లగా జారడం అనేది దాన్ని పట్టుకొని నిలిపే గాలి యొక్క పీడనం తగ్గటం వల్లనే అని అంటారు. (తృణే కర్మ వాయు సంయోగాత్ (5-1-14) అనే సూత్రంలో వాయువు యొక్క సంయోగం (ఆశ్లేష (Athesion or conjuction) కారణంగానే గడ్డిలో కదలిక (Motion) ఏర్పడిందని మనవాళ్ళు అంటారు.

9 గురుత్వవిశిష్టం వస్తు హి - నోదన విశేషాత్ ఏవ, ఊర్ధ్వం - తిర్యగ్ వా ప్రేర్యతేఇతి వైశేషిక వాదః 1 బరువుగల వస్తువైతే -వత్తిడి లేదా ప్రేరణ వల్ల నే పైకి, అడ్డంగా గాని నెట్టబడుతున్నది. అని వైశేషికుల వాదం

10 నోదన విశేషా భావాత్ ఊర్ధ్వం న తిర్యగ్గమనమ్ (వై.సూ. 5-1-8) ప్రేరణ (నెట్టడం) అనే విశేషక్రియలే నందు వల్ల - పైకి గాని అడ్డంగాను చలనం లేదు. (ఇంతవరకు వస్తువు క్రిందకు పడటానికి దాని గురుత్వం కారణం, పైకి ప్రక్కలకు కదలడానికి వేరొక వస్తువు యొక్క ప్రేరణ (వత్తిడి - నెట్టడం)

అనేది కారణం అని మనవారి అభిప్రాయం తెలుస్తోంది). నోదన విశేషాత్ ఉదసన విశేషః (5-10).

11 ఆధునికానాం సంశ్లేషః అణ్వాకర్షణం వా 'సంయోగే' ఏవ అన్తర్భవతి కిల ఆధునికులు (చెప్పే) సంశ్లేషం (Athesion) వాయువులు ఆకర్షణం గాని 'సంయోగ' గుణంలోనే అంతర్భవిస్తున్నదికదా!

12 శక్తిః నామ కశ్చన విశేషః అస్తి ఇతి ప్రాచామ్, ఆధునికానాంచ వాదః ।
శక్తి (Power) అనే ఒక విశేషం ఉంది అని ప్రాచీనులు ఆధునికులు కుడా అంటారు.

13 ఆధునికాః 'ఘర్షణమ్' ఇతి శక్తిః చలన ప్రతిబంధతయా అస్తి ఇతి వదన్తి. ఆధునికులైతే 'ఘర్షణమ్' (Function) అనే శక్తి కదలికకు ప్రతిబంధంగా ఉంది అని అంటారు.

14 ప్రాచీనైః ప్రతిబంధః ఇతి అభ్యుపగమ్యతే. సచ ప్రతిబంధః వస్త్వన్తరమేవ ప్రాచీనులచే 'పతిబంధం' (అడ్డు) అనేది అంగీకరింపబడుతున్నది.

ఆ ప్రతిబంధమైతే వేరొకవస్తువే (అవుతున్నది) (ఒక వస్తువు యొక్క గమనానికి వేరొక వస్తువు యొక్క భాగాలు అడ్డుగా ఉన్నప్పుడు ఘర్షణ ఏర్పడి వస్తువు యొక్క వేగం (Speed) తగ్గి క్రియ ఆగిపోతుంది. ఇక్కడ ఘర్షణం అనేది వస్తుసంయోగమే తప్పశక్తికాదు.

ఇక్కడ ఒక విశేషాన్ని గమనించాలి. ఏ వస్తువులోనైనా కదలిక, లేదా ఏ విధ క్రియపుట్టాలన్నా 'ప్రయత్నం' (Effort or volition) ఉండాలి. చైతన్యం కల వస్తువుల్లో ఆ ప్రయత్నం ఆత్మ (Soul) వల్ల కలుగుతున్నది. జడవస్తువుల్లో ఒక వస్తువు యొక్క సంయోగం వల్ల వేరొక వస్తువులో నోదనం (ప్రేరణం) కలిగి కదలిక ఏర్పడుతోంది. సృష్టిఆదిలో అణువుల్లో కదలిక (Motion) ఎలా కలిగింది? అది అదృష్టం వల్లనే. అంటే నిర్వచింపరాని కారణం (Inexeplicable reason) అదే దైవం అంటారు. అగ్ని, వాయువు ఈ రెండూ వస్తువుల సంయోగ - విభాగాలకు హేతువు లౌతాయి. ఏ దైనా వస్తువును కాల్చితే దాని అణువుల్లో ఒక వత్తిడి ఏర్పడి 'స్ఫోటనం' ఏర్పడ వచ్చు. దీన్నే "తథాదగ్ధస్య స్ఫోటనే" (5-1-13) అనే సూత్రంలో కణాదముని చెప్పాడు. ఇక్కడ వ్యాఖ్యాత ఏమంటున్నాడో చూడండి.

"దహ్యామానస్య వస్తునః అంశవిశేషస్య విస్ఫోటనాఖ్యే తిర్యగ్ ఊర్ధ్వగమనాత్మకే కర్మణి, సంయోగ విశేషః - విస్ఫోటనం సంస్కారశ్చ మేతుః । సః అయం సంయోగ విశేషః ప్రయత్న విశేషాత్ "న ఉత్పద్యతే । కింతు అగ్నికారితః ఇతి అగ్నికారితః ఇతి" కాల్చబడే వస్తువు యొక్క అవయవాలకు అని వ్యవహరింపబడే అడ్డంగాను పైకి కదలిక అనే క్రియ కలగడంలో సంయోగ విశేషం అనేది వేగం మొదలగు సంస్కారం కారణం . ఆ ఈ సంయోగం విశేషం అనేది విశేష ప్రయత్నం వల్ల ఏర్పడటంలేదు. అయితే అగ్నివల్లనే ఏర్పడింది అని" అనిదీని అభిప్రాయం.

పైవాక్యాల్లో సమాస పదాలు (Compound Words) కూడా చాలా ఉన్నాయి. ఒకసారి చూడండి. పాఠం ఆరంభంలో చెప్పిన సూత్రంలో ద్వంద్వ సమాసాలు వాడబడ్డాయి. వీటిని ఇతరేతర యోగద్వంద్వం అంటారు.

A) 1) రూపరసగంధ స్పర్శాః రూప - రస - గంధ స్పర్శ అనేనాల్గు పదాలు ఒకటిగా కలిసి ద్వంద్వ సమాసంగా ఏర్పడ్డాయి. ఇది బహువచనంలోఉంది. రెండుకంటే ఎక్కువ శబ్దాలు కలిస్తే బహువచనం వాడాలి.

2) సంయోగ విభాగౌ - సంయోగః చ విభాగఃచ = సంయోగ విభాగౌ (ఇది ద్వివచనంలో ఉన్నది.)

3) పరాత్వా పరత్వే - పరత్వంచ అపరత్వంచ =పరాత్వాపరత్వే (ఇది ద్విచనంలో ఉన్నది)

4) సుఖదుఃఖే - సుఖం చ దుఃఖంచ = సుఖదుఃఖే (ఇది ద్విచనంలో ఉన్నది)

5) ఇచ్ఛాద్వేషౌ - ఇచ్ఛాచ ద్వేషఃచ = ఇచ్ఛాద్వేషౌ (ఇది ద్వివచనంలో ఉన్నది)

B) తత్పురుష మాసాలు చూడండి.

1) తేజస్సంయోగాత్ - తేజసః సంయోగః (తేజస్సుయొక్క సంయోగము) = తేజస్సంయోగః తస్మాత్ దానివలన - తేజస్సంయోగాత్ (తేజస్సంగం వల్ల) ఇది షష్ఠీ తత్పురుషసమాసం. ఇలాగే - అణూనామ్ ఆకర్షణమ్ = అణ్వాకర్షణమ్. అణువులయొక్క ఆకర్షణము (షత)

2. సంయోగా భావే - సంయోగస్య - అభావః సంయోగాభావః - తస్మిన్ (దానియందు) సంయోగాభావే.

3. వైశేషిక వాదః వైశేషికణాం (వైశేషికులయొక్క) వాదః = వైశేషిక వాదః

4. నోదన విశేషాత్ - నోదనస్య విశేషః తస్మాత్ (నోదనము యొక్క విశేషము)

C) తృతీయా తత్పురుష సమాసాలు

(1) అదృష్టకారితం - అదృష్టేన కారితం (అదృష్టం చేత కల్పింపబడింది)

(2) గురుత్వ విశిష్టం - గురుత్వేన విశిష్టం (గురుత్వం చేత కూడినది)

D) సప్తమీ తత్పురుష సమాసం - ఊర్ధ్వ ప్రసరణే - హేతుః= ఊర్ధ్వ ప్రసరణ హేతుః

ఊర్ధ్వ ప్రసరణంలో హేతువు

ఇలా ఎన్నో భౌతిక శాస్త్ర విశేషాలు గ్రహించవచ్చు.

# ప్రాచీన వాస్తువిజ్ఞానమ్

1 ప్రాచీనకాలే, తటాక - దుర్గ -ప్రాకార - మందిర - గృహ-ఆరామ నిర్మాణవిషయే నిర్దుష్టా శాస్త్రీయ నిర్మాణపద్ధతిః ఆశ్రితా అభవత్ । ప్రాచీన కాలంలో తటాకాలు - దుర్గాలు కోటలు) ప్రకారము దేవాలయాలు, గృహాలు, ఆరామాలు నిర్మించడం విషయంలో నిర్దుష్టమైన శాస్త్రీయ నిర్మాణపద్ధతి ఆశ్రయింపబడేది.

(2) సమరాంగణ సూత్రధారమ్, మానసారః ఇత్యాది గ్రంథేమ వివిధనిర్మాణ విధానం నిరూపితమస్తి.

సమరాంగణ సూత్రధారం, మానసారం మొదలైన గ్రంథాల్లో వివిధ నిర్మాణవిధానం నిరూపింపబడి ఉంది.

(3) నగరనిర్మాణమపి సమ్యక్ నిరూపితమ్ అస్తి నగరనిర్మాణం కూడా బాగా నిరూపింపబడి ఉంది.

# సంధిప్రక్రియ - లింగములు

సంధిప్రక్రియగురించి తెలుగు భాషను అభ్యసించిన వారికి తెలుసును. అసలు ఈ 'సంధి' అనే విధానం ఎందుకు వచ్చింది? అని ఆలోచిస్తే, ఇది భాషా ప్రయోగంలో ఉన్న ఒక సర్వ సాధారణమైన లక్షణం అని అంగీకరించవలసిఉన్నది. ఏవైనా రెండక్షరా లను ఒకదాని ప్రక్కన ఒకటి కలిపి ఉచ్చరింప వలసివచ్చినప్పుడు, మనం అక్షరాలను ఉచ్చరించడానికి వినియోగించే ముఖయంత్రంలో (Vocal Cards) కదలికలు ఏర్పడతాయి. ఈ కదలికలు సాధ్యమైనంతవరకు తనకు సుఖకరంగాను, కొంత ప్రయత్నంలో సౌలభ్యం కలిగేటట్లు ఉండాలని ప్రతివ్యక్తి భావించడం ఉంది. అందువల్ల కొన్ని అక్షరాలను ఒకటిగా కలపడం, కొన్ని అక్షరాలను విడచి పెట్టడం, క్రొత్తగా ఉచ్చారణసౌలభ్యం కోసం అక్షరాలను చేర్చుకోవడం, ఒక అక్షరం స్థానంలో తనకు ఉచ్చారణలో సులభంగా ఉండే అక్షరాలను చేర్చడం ఇలా ఎన్నో రకాల మార్పులు, ఉచ్చారణ సమయంలో ప్రతివ్యక్తి చేస్తాడు. ఈ మార్పునే వ్యాకరణ శాస్త్రకారులు సంధులుగా నిర్వచించారు. ఒక విధంగా చెప్పాలంటే సంధులుకాని, సమాసాలు కాని ఏవైనా భాషను వ్యవహరించే వ్యక్తులు చేసే మార్పులు చేర్పుల వల్లనే ఏర్పడేవే తప్ప, వ్యాకరణ శాస్త్రకారులు కావాలని ఏర్పరిచినవేమీ కాదు. కేవలం వ్యాకరణ శాస్త్రం వాడుకలో ఉన్న పద్దతులను సూత్రీకరించి నిర్వచించిందే తప్ప ఏమీ లేదు. సంధులు అనేవి మన ఉచ్చారణలో ఉన్న సహజమైన పరిణామం మాత్రమే అని చెప్పడం ఈ మాటల తాత్పర్యం.

సంధులు : సంధులు రెండు రకాలుగా ఉంటాయి స్థూలంగా. (1) అచ్ సంధులు (2) హల్ సంధులు. రెండు అచ్చుల కలయికలో ఏర్పడిన మార్పులు అచ్ సంధులైతే, అచ్చులు హల్లులు పరస్పరం కలవడం వల్ల గాని, హల్లులు పరస్పరం కలవడం వల్లగాని హల్లులకు ఏర్పడిన పరిణామాలు (మార్పులు) హల్ సంధులని సాధారణంగా చెప్పవచ్చు. ఈ ప్రకరణంలో సంధుల సామాన్య పరిచయం మాత్రమే ఉద్దిష్టం.

ఈ సందర్భంగానే శబ్దాలకు గల లింగాల గురించి కూడా ఒక మాట అనుకుందాం.

సంస్కృతభాషలో శబ్దాలకు లింగాలుంటాయి. అవి మూడు (1) పుంలింగం (2) స్త్రీలింగం (3) నపుంసకలింగం

లోకవ్యవహారంలో ఈ లింగాలంటే ఏమిటో మనకు తెలుసును. ఒక రకమైన శరీరనిర్మాణం, కొన్ని విశేష లక్షణాలు ఉంటే పురుషులని, వీటికంటే వేరుగా ఉండే కొన్ని విశేష శరీర నిర్మాణ విధానాలు, అవయవాలు, గుణాలను బట్టి స్త్రీలని, ఈ రెంటి కలయిక ఒకచోట ఉంటే నపుంసకులని అనడం ఉన్నది.

సంస్కృతంలో శబ్దాలకు లింగాలను నిర్ణయించడంలో లౌకికమైన విధానం పాటింపబడలేదు.

స్త్రీ ప్రత్యయాలని చెప్పబడే కొన్ని చేర్చబడిన ప్రాతిపదికాలన్నీ స్త్రీలింగ శబ్దాలే. ఈ ప్రత్యయాలు చేర్చబడిన శబ్దాల్లో కొన్ని పుంలింగ శబ్దాలు, మరికొన్ని నపుంసకలింగ శబ్దాలు. హలన్త స్త్రీలింగ శబ్దాలకు స్త్రీ ప్రత్యయాలుండవు. స్త్రీలింగశబ్దాలు : సాధారణంగా ఏ ప్రాతిపదికలకు చివర ఆ, ఈ, ఉ అనే అక్షరాలుంటాయో, అవి స్థూలంగా 90 శాతం స్త్రీలింగ శబ్దాలే అయి ఉంటాయి. పుంలింగ శబ్దాలుకూడా ఆ, ఈ, ఉ అనే అచ్చులు చివరకలవి ఉన్నా అవి చాలా తక్కువ. కనుక చాలా శబ్దాలను పై విధంగా గుర్తించవచ్చు. ఇలాగా 'తి' అనే అక్షరం, 'తా' అనే అక్షరం చివరగల శబ్దాలన్నీ స్త్రీలింగాలుగానే చాలా వరకు ఉంటాయి. హ్రస్వ అకారాన్తశబ్దాలన్నీ పుంలింగ నపుం సకలింగాలే తప్ప స్త్రీలింగాలు ఉండవు. ఇక పుంలింగ నపుంసకలింగ శబ్దాలకు కేవలం ప్రథమా విభక్తి ద్వితీయావిభక్తులే తేడాగా ఉంటాయి. మిగతా విభక్తులో రూపాలు చాలావరకు సమానంగానే ఉంటాయి. హలంతశబ్దాలో స్త్రీలింగ పులింగాల్లో ఉన్న తేడా గుర్తించడం కష్టమే. ఉదా : శరత్ అనేది స్త్రీలింగం. అయితే కొందరు శాస్త్రకారులు హలన్త స్త్రీలింగ శబ్దాలను ఆకారాన్తాలుగా మార్చారు. అప్పుడు వాటిని గుర్తించడం సులువే. నిశ్-నిశా, దిక్-దిశా, వాక్-వాచా, ఇత్యాదులు, అయితే ఇటువంటి ప్రయోగాలు అన్ని హలన్త శబ్దాలకు కనుపించవు.

శరద్ - శరదౌ - శరదః అని ఉంటే, పుంలింగ శబ్దం అయిన మరుత్ శబ్దం కూడా మరుత్ - మరుతౌ - మరుతః అనే ఉంటుంది. కనుక, కొన్ని స్థూలంగా గుర్తించాలి. మరికొన్ని శబ్దాలను వ్యవహారాన్ని బట్టే గుర్తించాలి. స్త్రీలను బోధించేవి స్త్రీలింగాలు, పురుషులను బోధించేవి పుంలింగాలు అని నిర్ణయించడం కుదరదు.

అందువల్ల స్త్రీలింగ బోధకాలైన ప్రత్యయాలు చేర్చగా ఏర్పడిన శబ్దాలన్నీ స్త్రీలింగాలు, ఇవి అజన్తాలుగా ఉంటాయి, ఎక్కువగా దీర్ఘాన్తాలుగా ఉంటాయి అని స్థూలంగా ఒక అవగాహన ఉంటే చాలా వరకు గుర్తించవచ్చు. స్త్రీలింగ శబ్దాలను, పుంలింగ శబ్దాలను, నపుంసకలింగ శబ్దాలను, ఏలింగాలు లేని అవ్యయాలను క్రియాపదాలను వేటినైనా ఒకశబ్దాన్ని మరొక శబ్దంతో కలిపితే సంధులేర్పడతాయని తెలిసి కోవడం అవసరం.

ఇప్పుడు కొన్ని సంధుల గురించి మరికొంత సంగ్రహంగా తెలుసుకుందాం.

## అచ్ సంధులు

రెండు అచ్చుల కలియలో ఏర్పడే మార్పులు అచ్ సంధులు, అని సాధారణ నిర్వచనం. ఈ మార్పు 5 రకాలుగా ఉంటుంది స్థూలంగా.

1. సవర్ణదీర్ఘ సంధి :- రెండచ్చులు ఒకేరకమైన కలిసి దీర్ఘంగా మారడం. అంటే అ+అ=ఆ; ఇ+ఇ=ఈ, ఉ+ఉ=ఊ, ఆ+ఆ=ఆ; ఈ+ఈ=ఈ, ఊ+ఊ=ఊ, ఈ+ఇ=ఈ; ఊ+ఉ=ఊ; ఉ+ఊ=ఊ; ఇలా ఏర్పడేసంధి సవర్ణదీర్ఘ సంధి. ఈ సంధి సమానమైన 'ఒకేలా ఉండే' అచ్చులకు వస్తుంది. అలాగని అన్ని అచ్చులకు రాదు. అ,ఇ,ఉ,ఋ, అనే వర్ణాలకు మాత్రమే వస్తుంది. సవర్ణాలకు వచ్చే దీర్ఘం సవర్ణదీర్ఘం.

ఇ+ఈ=ఈ; ఆ+అ=ఆ; అ+ఆ=ఆ; ఊ+ఉ=ఊ; ఉ+ఊ=ఊ; ఋ+ౠ+ౠ; ౠ+ఋ=ౠ.

2. గుణసంధి :- రెండచ్చుల కలియికలో ఆ రెంటి స్థానంలో ఏ,ఓ,అర్ అనేవి ఆదేశంగా వస్తే అక్కడ గుణ సంధి అంటారు. ఈ సంధి. అకార - ఇకారాలకు, అకార ఉకారాలకు, అకార ఋకారాలకు, ఌకారానికి మధ్య ఏర్పడుతుంది.

అఆ+ఇ,ఈ= ఏ, అఆ+ఉ,ఊ=ఓ, అ,ఆ+ఋ,ౠ=అర్, అ,ఆ+ఌ = అల్

3. వృద్ధి సంధి :- అ, ఆ లకు ప్రక్కన ఏ, ఓ, ఐ, ఔ, ఋ,ఌ అనే వర్ణాలుంటే ప్రక్క ప్రక్కన ఈ రెండరాలను కొట్టి వేసి ఐ,ఔ,ఆర్ అనేవి వచ్చి చేరితే దాన్ని వృద్ధి సంధి అంటారు.

4. యణాదేశ సంధి :- ఇ,ఉ,ఋ,ఌ అనే అచ్చులకు క్రమంగా ప్రక్కన వీటికి ఇవే అచ్చులు కాక వేరే అచ్చులు ఉన్నప్పుడు ఇ,ఉ,ఋ,ఌ అనే వర్ణాలను కొట్టివేసి య్,వ్, ర్,ల్ అనేవి ఆదేశంగా వస్తే దాన్ని యాణాదేశ సంధి అని అంటారు.

ఇలా మరికొన్ని విశేష సంధులున్నాయి. అయితే సవర్ణదీర్ఘసంధి, గుణసంధి, వృద్ధి సంధి, యణాదేశ సంధి అనే ఈ నాలుగు భాషలో బాగా వాడబడుతూ ఉంటాయి. వీటి ఉదాహరణాలు కొన్ని చూద్దాం.

# ప్రాచీనకాలంలో నౌకానిర్మాణం

పై అచ్ సంధులు ఉపయోగించి ప్రాచీనులనౌకా నిర్మాణానికి సంబంధించిన కొన్ని వాక్యాలుచూద్దాం.

1. యుక్తి కల్పతరునామ్ని గ్రంథే భోజదేవేనోక్తం నౌకానిర్మాణ విధానమ్ ।
యుక్తి కల్పతరువనే గ్రంథంలో భోజదేవునిచే చెప్పబడింది నౌకానిర్మాణ విధానం, ఇక్కడ భోజదేవేన+ఉక్తమ్ = భోజదేవేనోక్తమ్ అని గుణసంధి ఏర్పడింది.

2. అయం శ్లోకశ్చాత్ర వివేచ నీయః
ఈ శ్లోకం ఇక్కడ వివేచింపదగి ఉన్నది. శ్లోకస్+చ=శ్లోకశ్చ (శ్చుత్వసంధి) ఇక్కడ శ్లోకశ్చ+అత్ర (అ+అ=ఆ) శ్లోకశ్చాత్ర అని సవర్ణదీర్ఘసంధి.

3. నౌకాశ్చప్రాచీనకాలే దశప్రకారాః దర్శితాః భోజేనైవమ్.
నౌకాలు ప్రాచీనకాలంలో పదిరకాలు చూపబడ్డాయి భోజునిచే ఇలా -

4. క్షుద్రాచ, మధ్యమా, భీమా, చపలా, పటలా, భయా ।
దీర్ఘా పత్రపుటా చైవ గర్భరా మంథరా తథా ॥

క్షుద్ర, మధ్యమ, భీమ, చపల, పటల, భయ, దీర్ఘ, పత్రపుటా, గర్భ, మంథర, అనేవి పది రకాల నౌకల పేర్లు. ఇవన్నీ ఆకారాన్త స్త్రీలింగ శబ్దాలే. ఇక్కడ చ+ఏవ= అనే రెండు పదాలు కలిసి వృద్ధి సంధి వచ్చి చైవ అ+ఏ=ఐ అని అయింది. ప్రాచీన కాలంలో నౌకాన్మాణం ఉందని తెలుస్తున్నది.

5. ఏతాసు నౌకాసు భీమా, భయా, మంథరా ఇతి తిస్రః నౌకాః నశుభావహాః ।

ఈ నౌకల్లో భీమ, భయ, మంథర అనే మూడు నౌకాలు శుభావహములు కావు. ఇక్కడ శుభ+ఆవహాః=శుభావహాః అని సవర్ణదీర్ఘసంధి .

6. అపిచ దశవిధాః నౌకాః సన్తీతి భోజః ప్రాహ। ఇంకా పదిరకాల నౌకలు ఉన్నాయని భోజుడు చెప్పాడు.

ఇక్కడ సన్తి+ఇతి = సంతీతి (ఇ+ఇ=ఈ) సవర్ణదీర్ఘసంధి.

7. దీర్ఘికా-తారిణీ-లోతా-గత్వరీ, గామినీ - తరీ।

జాంగలా - ప్లావినీ - చైవ ధారిణీ - వేగినీ తథా॥

దీర్ఘిక, తారిణి, లోత, గత్వరి, గామిని, తరి, జాంగల, ప్లావిని, ధారిణి, వేగిని అని పదిరకాల నౌకలు కూడా చెప్పబడ్డాయి. ఇక్కడ అన్నీ స్త్రీలింగ శబ్దాలే. తారిణీ మొదలైనవి ఈ కారాన్తాలు. చ+ఏవ=చైవ వృద్ధి సంధి.

8. సర్వమందిరా నామ్నా నౌకా విశాలతమా విశ్రామ ప్రదేశైః, తురగాణాం, స్త్రీణాం, సాధారణ జనానాంచ యానాయ బహూప యోగినీ నిర్మితా భవత్ సర్వమందిర అనేపేరుగల నౌక చాలా విశాలంగా విశ్రాంతి స్థానాలతో గుర్రాలకు, స్త్రీలకు, సాధారణ జనులకు ప్రయాణానికి బాగా ఉపకరించేదిగా నిర్మింపబడింది. నిర్మితా+అభవత్=నిర్మితాభవత్ సవర్ణదీర్ఘసంధి.

9. ఏవం మధ్యమందిరా అగ్రమందిరా ఇత్యపి నౌకా విశేషాః నిర్మితాః అభవన్ - ఇలాగే మధ్యమందిర అగ్రమందిర అనే నౌకలు నిర్మింపబడినాయి. ఇతి+అపి అని రెండు అవ్యయాలకు యణాదేశసంధి ఇతి+అపి=ఇత్యపి (ఇ+అ=య)

10. రాజవల్లియా నౌకా సహస్రజనానాం వహనే సమర్థాకిల।

రాజవయా నౌక వేయిమంది జనాన్ని మోయడంలో సమర్థత కలది కదా!

పాణిని లింగాల గురించి ఏమి చెప్పాడో విశేషాలు కొన్ని చూద్దాం. పాణిని మహర్షి లింగానుశాసనం అనే గ్రంథాన్ని రచించి, శబ్దాలకు లింగాలు ఏలా ఉంటాయో విశదపరచాడు. కొన్ని విశేషాలు.

1. ఋకారాన్తాలు మాతృ దుహితృ స్వసృ-యాతృ-ననన్దృ శబ్దాలు ఐదు మాత్రమే స్త్రీలింగాలు మిగతా ఋకారాన్తాలన్నీ ఈ కారాన్తాలుగా మారిపోతాయి.

2. క్తిన్ ప్రత్యయాన్తాలు అంటే 'తి' చివరగలవి స్త్రీ లింగాలు. జాతి, నీతి, రీతి, ఖ్యాతి, భీతి,నుతి,స్తుతి,భక్తి మొ॥

3. తల్ ప్రత్యయాన్తాలు స్త్రీలింగాలు - జనతా,మానవతా,పశుతా ఇత్యాదులు.

4. 'త్వ' ప్రత్యయాన్తాలన్నీ నపుంసకలింగాలే. గురుత్వం. ద్రవత్వం,మహత్త్వం మొదలైనవి.
5. ఘఞ్ అచ్ ప్రత్యయాన్త శబ్దాలన్నీ పుంలింగాలే. పాకః, త్యాగః, కరః, గరః, ఇత్యాదులు.
6. నకారం ఉపధగా (తుదివర్ణానికి ముందు వర్ణంగా) ఉండి హ్రస్వ- అకారాన్తా లైన శబ్దాలన్నీ కొన్ని పుంలింగంలోను, కొన్ని నపుంసక లింగంలోను ఉంటాయి.
7. సాధారణంగా 'ల్యుట్' ప్రత్యయాన్త శబ్దాలన్నీ నపుంసకలింగాలే. గమనం, పతనం ఇత్యాదులు.
(అ) ప్రాచీనకాలే నౌకద్వారా దేశాన్తరగమనం విశేషతః అవర్తత।
ప్రాచీనకాలంలో నౌకలద్వారా విదేశాలకు వెళ్లడం విశేషంగా ఉండేది.
(ఆ) వేదేష్వపి నౌకా ప్రస్తావః జాగర్తి - వేదాల్లోకూడా నౌకల ప్రస్తావన ఉంది. రామాయణే గుహేన రామార్థం నావికశతప్రచోద్యమానా నౌకా+ఉపస్థాపితా ఇతి+అవగమ్యతే. రామాయణంలో గుహునిచే రాముని కొరకు నూర్గురు నావికులచే నడుపబడు నౌక ఉంచబడినది అని తెలుస్తున్నది.

పై వాక్యాల్లో 'విదేశేషు+అపి=విదేశేష్వపి' అని యణాదేశ సంధి ఉన్నది. ఇతి+అవగమ్యతే అనే రెండు పదాలు కలిపితే= ఇత్యవగమ్యతే అని యణాదేశ సంధి ఏర్పడుతున్నది. నౌకా+ఉపస్థాపితా=ఈ రెండు పదాలు కలిపితే=నౌకోపస్థాపితా అని గుణసంధి అవుతుంది. పైన ఇచ్చిన ఉదాహరణలను బట్టి సంధి కొన్ని చోట్ల చేయవచ్చు, చేయకపోవచ్చు అని గ్రహించాలి. రెండు శబ్దాలను, లేదా రెండక్షరాలను దగ్గర దగ్గరగా (విలంబం లేకుండా వెంటవెంటనే) ఉచ్చరించినప్పుడే ఈ సంధి కార్యాలు జరుగుతాయి అని కూడా గ్రహించాలి. ముఖ్యంగా అచ్ సంధులు చాలా ఉన్నప్పటికీ ప్రాథమికంగా సంస్కృతాధ్యయనం చేసేవారు యణాదేశసంధి, గుణసంధి, వృద్ధిసంధి, సవర్ణదీర్ఘసంధి అనేవి నాలుగు గ్రహించ గలిగితే చాలు.
(ఇ) మహర్షీన్ మన్వాదీన్ మీనరూపధారీ భగవాన్ నారాయణః ప్రలయకాలే నౌకాయామ్ అధిరోప్య పర్యరక్షత్।

ప్రలయకాలంలో మహర్షులైన మన్వాదులను మీనరూపధారి అయిన భగవన్నారాయణుడు నౌకలో ఎక్కించి రక్షించినాడు. పరి+అరక్షత్=పర్యరక్షత్ (యణాదేశ సంధి) మహా+ఋషీన్=మహర్షీన్ - ఇక్కడ గుణసంధి.(మహా+ఋషి= మహర్షి) మను+ఆదీన్=మన్వాదీన్ - ఇక్కడ యణాదేశసంధి (మను+ఆది=మన్వాది)

**హల్ సంధులు - కొన్ని విశేషాలు :**

అచ్చు హల్లు కలసినప్పుడు గాని, ఒక హల్లు వేరొక హల్లుతో కలసినప్పుడు గాని ఈ హల్ సంధులు ఏర్పడతాయి. ఇక్కడ హల్లులకే మార్పు ఏర్పడుతుంది. కొన్ని ప్రధాన సంధులు చూద్దాం.

**1. జశ్త్వసంధి :-** ఇది చాలా చోట్ల కనబడుతూ ఉంటుంది. ప్రధానంగా క,ట,త,ప అనే వర్ణాలు గ,డ,ద,బ అనే వర్ణాలుగా మారడం ఈ సంధిలో కనబడుతుంది. వాక్+ఇయమ్=వాగియం; త్విట్=ఇయమ్=త్విడియం, తత్+ఇదమ్=తదిదమ్, అప్+ఇంధనమ్=అబింధనమ్, ఇక్కడ అచ్చులు ఎదురుగా ఉన్నాయి. ఇలాగే హల్లుల కలయికలో కూడా ఈ మార్పు వస్తుంది. చూడండి.

వాక్+భవతి = వాగ్భవతి; త్విట్+దృశ్యతే=త్విడ్‌దృశ్యతే,
అప్+భోగః = అబ్భోగః, వనాత్+గతమ్ = వనాద్గతమ్

**చర్త్వసంధి :-** ముఖ్యంగా గ,జ,డ,ద,బ అనే వర్ణాలు క చ ట త ప అనే వర్ణాలుగా మారితే దాన్ని చర్త్వసంధి అంటాం. ఈ వర్ణాలలోనే ఎక్కువగా ఈ సంధి కనబడుతూ ఉంటుంది. హుతభుగ్+సమిద్ధః=హుతభుక్‌సమిద్ధః (అగ్ని ప్రజ్వరిల్లినాడు) హవ్యవాడ్+సందృశ్యతే = హవ్యవాట్ సందృశ్యతే. తద్+కిమ్ = తత్కిమ్; కకుబ్+పాలకః=కకుప్పాలకః । తజ్+శ్లోకః= తచ్‌శ్లోకః ।

**శ్చుత్వసంధి :-** ఇది కూడా భాషలో బాగా కనిపిస్తూనే ఉంటుంది. ఈ సంధిలో సకారం శకారంగా మారడం, తకారం చకారంగా మారడం, ప్రధానంగా కనిపిస్తూ ఉంటుంది. దకారం జకారంగా మారటం కూడా చాలాచోట్ల ఉంది. నకారం ఞ కారంగా మారటం ఉంది.

హరిస్+చింతనీయః = హరిశ్చింతనీయః, తత్=చిన్తనమ్=తచ్చింతనం. తద్+జయః=తజ్జయః; చక్రిన్+జయస్వ=చక్రిఞ్జయస్వ.

**అనునాసిక సంధి :-** ఇది చాలా ముఖ్యం. అనునాసిక వర్ణాలైన ఙఞణ నమ లనే వర్ణాలతో సంయోగాన్ని పొందిన కొన్ని వర్ణాలు అవి కూడా అనునాసిక వర్ణాలుగా మారిపోవడం ఈ సంధి యొక్క లక్షణం.

తత్+మార్గః =తన్మార్గః; త్విడ్+నశ్యతి =త్విణ్ణశ్యతి;

వాక్+నతిః = వాఙ్నతిః, అప్+మయ= అమ్మయం. ఇత్యాదులు.

ఆంధ్రభాషలో సంధిప్రక్రియ తెలిసినవారికి సంస్కృత సంధులంత కష్టం కాదు.

ఈ క్రింది విష్ణుపురాణ శ్లోకంలో కొన్ని సంధులను గుర్తించండి.

**ఉదయాస్తమనే చైవ సర్వకాలన్తు సమ్ముఖే ।**

**యైర్యత్ర దృశ్యతే భాస్వాన్ సతేషా ముదయః స్మృతః ॥**

ఉదయం అస్తమనం అనేవి సూర్యునికి లేవు. ఎప్పుడూ ఉండేవానికి, ఎలా ఉంటాయి? ఎవరిచే ఎప్పుడు చూడబడతాడో వారికి ఉదయం అని వ్యవహారం.

ఇక్కడ "ఉదయ+అస్తమన=ఉదయాస్తమనే (సవర్ణదీర్ఘ సంధి) చ+ఏవ=చైవ (వృద్ధిసంధి) సర్వకాలమ్+తు=సర్వకాలన్తు. (పరసవర్ణసంధి) మకారం సున్నాగాను, సున్నా (అనుస్వారం) నకారంగాను మారింది.

**నైవాస్తమనమర్కస్యనోదయః సర్వదా సతః ।**

**ఉదయాస్తమనాఖ్యంహి దర్శనాదర్శనం రవేః ॥**

సూర్యునికి ఉదయాస్తమాలుండవు. కేవలం సూర్యుడు కనిపించడం కనిపించక పోవడమే అలా అంటాం.

ఈ మాట మన ప్రాచీనుల వైజ్ఞానిక దృష్టికి నిదర్శనం. న+ఏవ=నైవ (వృద్ధిసంధి) నైవ+అస్తమనం=నైవాస్తమనం (సవ.దీ.) న+ఉదయ=నోదయః (గుణసంధి) దర్శన+అదర్శనం=దర్శనాదర్శనం; అస్తమన+ఆఖ్య=అస్తమనాఖ్యం (స.దీ.) ఆఖ్యమ్+హి=ఆఖ్యం హి (అనుస్వార సంధి) హల్లుపరంగా ఉన్నప్పుడు పదాన్తంలో ఉన్న మకారం సున్నాగా మారింది.

**ఉత్తరం యత్సముద్రస్య హిమద్రేశ్చైవ దక్షిణమ్ ।**

**వర్షం తద్భారతం నామ 'భారతీ' యత్ర సన్తతిః ॥**

సముద్రానికి ఉత్తరంగాను, హిమాద్రికి దక్షిణంగాను ఉన్న వర్షం (ప్రదేశం) భారతం. అక్కడ ఉన్న జనసంతతిని 'భారతీ' సంతతి అంటారు.

ఈ శ్లోకం మన పురాణ ఋషుల అఖండ భారత భావనను తెలియ పరుస్తున్నది.

యద్+సముద్రస్య=యత్సముద్రస్య (చర్త్వసంధి) హిమ+అద్రిః= హిమాద్రిః (స.దీ.) హిమాద్రేస్+చ=హిమాద్రేశ్చ (శ్చుత్వసంధి) తత్+భారతం= తద్భారతం (జస్త్వసంధి).

## ముఖ్యంగా గ్రహించవలసిన కొన్ని విశేషాలు

1. పదం చివర ఎప్పుడూ సంస్కృతంలో అనుస్వారం అంటే "సున్న" (0) ఉండదు. దానికి బదులు మకారపు పొల్లే ఉంటుంది.

రామమ్,ఫలమ్, వయమ్ ఇత్యాదులు. అయితే మకారాన్తమైన పదానికి ఎదురుగా హల్వర్ణం ఉంటే అది సున్నగానే ఉంటుంది.

రామమ్+భజ = రామంభజ, శత్రుమ్+జయ=శత్రుంజయ ఇటువంటి చోట్ల సున్న కూడా ప్రక్కన ఉన్న వర్ణానికి సంబంధించిన వర్గ పంచమాక్షరమైన అను నాసికను స్వస్థానంలో పొందుతుంది. పైనున్న శత్రుంజయ - అనేచోట 'సున్న' (0) చ వర్గ పంచమాక్షరంగా మారి 'శత్రుఞ్జయ' అవుతుంది. తెలుగులో ఇలా సున్నాతోటే వ్రాయడం మనకు అలవాటు - వాస్తవానికి అలా వ్రాయకూడదు. ఈ క్రింది పదాలు చూడండి :

| తెలుగులో ఇలా వ్రాస్తారు | సంస్కృతంలో ఇలా వ్రాస్తారు |
|---|---|
| 1 కుంతలం | కున్తలమ్ |
| 2 శాంతం | శాన్తమ్ |

తెలుగులోనైనా పదం సంస్కృతమే అయినప్పుడు దాని మర్యాదనే అనుసరించాలి.

ఈ పుస్తకంలో ఇంకా చెప్పవలసినవి ఎన్నో ఉన్నాయి చెప్పినవి చాలా తక్కువ, అయినా ఇదొకమార్గదర్శనం మాత్రమే విజ్ఞుల్లు దీనిలోని స్ఫూర్తి గుర్తించి అనుసరించగలరు.



విశ్వజనీనం

సంస్కృతవాణిలో ప్రాచీన
సారస్వతంనుంచి వాక్య ప్రయోగాలు
గ్రహిస్తూ వాటిలోని భౌతికాధ్యాత్మిక
విషయాలను విశ్లేషిస్తూ తద్వారా
ప్రతిబింబించిన మన ప్రాచీన భారతీయ
మేధకు సంక్షిప్తంగా మార్గనిదర్శకంగా
అందించేము. సమగ్రంగా కాకపోయినా
సంగ్రహ సుందరంగా, సరళంగా
సంస్కృత భాషామృతాన్ని
ఆస్వాదించండి!